

ఫొటో: జి.నాగేశ్వరరావు

పెచ్చు తీసే పనిలేదు.  ముక్కలు తరగక్కర్లేదు. 

 శుభ్రం చేసే శ్రమలేదు.  నూరుకునే భారంలేదు.

ఒక్క క్షణం కూడా వృథాకాదు!

# ఏ వేళనైనా - ఏ వంటకానికైనా 
# మీకోసం సంసిద్ధం.

# స్వచ్ఛమైన - శుద్ధమైన
# ప్రియ అల్లం వెల్లుల్లి
#  మిశ్రమం.




తిరుగులేని నాణ్యత కోసం
తాజా పరిమళపు ఘుమ ఘుమలకోసం
'ప్రియ' అల్లం వెల్లుల్లి మిశ్రమం.

దీనిలో కృత్రిమ పదార్థాలు ఏమైనా లేవు. నూటికి నూరుపాళ్ళు ప్రకృతి సిద్ధంగా తయారైన సహజ మిశ్రమం.

**priya**

ోదయా ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్,
యాఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాదు - 500 482

Sista's-UEL-609/93 TEL

# చతుర ప్రపంచం

## 'టైగర్' కోడి

ఒక్కొక్కసారి పెంపుడుజంతువులు సైతం ప్రాణాంతకాలు కావడంకద్దు. అయితే అది ఏ కుక్కో అయితే ఆవేశంలో కరిచి వుండొచ్చు అనుకుంటాంగానీ, మరీ ఓ కోడిపుంజు అంతటి సాహసం చేయడం వింతగానే అనిపిస్తుంది. తమిళనాడులోని కావారపట్టి అనే వూళ్ళో ముత్తు అనే ఆసామీ తన తమ్ముడు పాండ్యన్‌కి ఓ బుల్లి కోడిపుంజుపిల్లనిచ్చి పెంచుకోమన్నాడు. పాండ్యన్ ఆ కోడిపిల్లని సొంత కొడుకులా అతి ఆప్యాయతగా పెంచుతూ దానికి 'టైగర్' అని పేరెట్టాడు. ఆ పేరు దానికి ఏముహూర్తాన పెట్టాడోగానీ పేరుకు తగ్గట్టే ఆ కోడిపిల్ల చాలా కోపంగా, భయంకరంగా అరుస్తూ చుట్టుపక్కల వాళ్ళ పాలిట పులిలాగానే తయారయింది. దానికి ఏ లోటూ రాకుండా చక్కగా పెంచడంతో అది బాగా బలిసి, దాని దారికడ్డొచ్చినవాళ్లందరినీ కుక్కలా కరవడం మొదలుపెట్టింది.




ఓసారి పాండ్యన్ వాళ్ళ పక్కింటి కుర్రాడిని కసుక్కున కరిచిందా టైగర్. దాంతో ఆ అబ్బాయి తండ్రి పాండ్యన్‌తో ఘర్షణపడి కోర్టు కెక్కాడు. ఈలోపుగా 'టైగర్' పాండ్యన్ కొడుకునే కరవడం, హాస్పిటల్‌కి తీసుకెడితే పదకొండు కుట్లు వెయ్యడం జరిగిపోయింది. ఇది చూసిన పాండ్యన్ భార్య సహించలేక ఆ కోడిని చావబాదడం మొదలెట్టింది. ఆవిడ చేతులు లాగాయి గానీ కోడి మాత్రం ఒక్క దెబ్బా పడకుండా తప్పించుకుంది. దాంతో ఒళ్లుమండిన పాండ్యన్ భార్య భర్త ఇంటికి రాగానే ఘర్షణ పెట్టుకుంది. ఇద్దరి మధ్యా వాదన పెరిగి పుట్టింటి కెళ్లిపోయింది. చివరికి పాండ్యన్‌కి కూడా విసుగెత్తి కోడిని అమ్మేద్దామని బేరానికి పెట్టాడు. అనలే కోడిమీద కోపంగా వున్న పక్కింటి ఆసామి ఆ కోడిని తనే కొని కసాపిసా తరిగించి కూర వండించేశాడు. అందరూ ఆ కోడి బాధ తప్పిందని ఆనందిస్తుండగా కోడి అసలు యజమాని ముత్తు

ముఖచిత్రం: జగ్‌మోహన్

వూరినుంచి వచ్చాడు. కోడిని అమ్మినందుకు తమ్ముడిమీద కేకలేసి, కోడిని కొని, కూర కూడా వండేసినందుకు పక్కింటి ఆసామి మీద విరుచుకుపడ్డాడు. ఇద్దరి మధ్యా ఘర్షణ పెరిగింది. ఆ పక్షం కొంతమంది, ఈ పక్షం కొంతమంది కత్తులు, కటార్లతో ఘర్షణకుదిగారు. అటువైపు నుంచి ఒక వ్యక్తి ఇటువైపునుంచి ఒకవ్యక్తి మరణించారు. అప్పటికిగానీ బహుశా 'టైగర్' అనిపించుకున్న ఆ కోడి ఆత్మ శాంతించి వుండదు.

## అమృతగుళిక

35 ఏళ్ళ అందాల భరిణ అయిన ఓ యువశాస్త్రజ్ఞురాలు తనకి సౌందర్యమే కాదు, మేధకి కూడా కొదువలేదని నిరూపించింది. న్యూయార్క్‌లో డాక్టరుగా పనిచేస్తున్న ఈ యువతి పేరు డైనీపెనికా. ఈవిడ కనిపెట్టిన ఓ మందు హృద్రోగుల పాలిట 'అమృత గుళిక' అంటూ వైద్య ప్రపంచమంతా ఒప్పుకుంది.

ఈ మందు పేరు ' టిష్యూప్లాస్మినోసిన్ యాక్టివేటర్'. టి.పి. ఎ అని పిలుస్తారు. ఇది రక్తంలో పేరుకుపోయిన కొవ్వు పదార్థాలను కరిగించి, శరీరంలో అన్ని భాగాలకీ స్వేచ్ఛగా రక్తప్రసరణ జరిగేలా చేస్తుంది. అంతే కాకుండా అధిక రక్తపోటువల్ల వచ్చే హెమరేజ్ రాకుండా అరికట్టే మందుగా కూడా పనిచేస్తుంది. అమెరికాలోని 'నేషనల్ మెడికల్ హెల్త్ ఇన్స్టిట్యూట్‌వాళ్ళు ఈ మందును మార్కెట్లో అమ్మడానికి అంగీకారాన్ని తెలిపారు.




ఈ మందును కనిపెట్టడానికి ముందు డాక్టర్ పెనికా స్వీడన్‌లో మెడికల్ కాన్ఫరెన్స్‌కు హాజరయింది. మీటింగ్‌కు ముందు ఆమె అక్కడికి బెల్జియం నుంచి వచ్చిన ఓ డాక్టరుతో సంభాషిస్తున్న సమయంలో టిష్యూప్లాస్మినోసిన్ యాక్టివేటర్‌ని విడదీయడంవల్ల జీవకణాల్లో వచ్చే కొన్ని సమస్యలని, మార్పులనీ వివరించి చెప్పాడాయన. అప్పుడు ఆమెకి తట్టిన ఆలోచఫలితమే ఇది. టి.పి.ఎ.ని ప్రత్యేక పద్ధతుల్లో విడదీయగలిగితే విషమించిన హృద్రోగాలను కూడా తగ్గించవచ్చు అనిపించింది పెనికాకు. అప్పటినుంచీ ఆమె శాన్‌ఫ్రాన్సిస్కో యూనివర్సిటీలోని జెనిటిక్స్ విభాగంలో చేరి ఈ విషయంపై నిర్విరామకృషి చేసి ఓ సంవత్సరం తర్వాత హృద్రోగుల పాలిట అమృతగుళికలాంటి ఈ మందును కనిపెట్టింది.

# ప్రాణాంతక క్రీడ

ప్రపంచం మొత్తంమీద అన్నిరకాల ఆటలలో కి 'ఐస్ డ్రైవింగ్' అత్యంత ప్రాణాంతకమైనది. ప్రతి సంవత్సరం రమారమి 2300 మంది ఆటగాళ్ళు ఈ ఆటలో ప్రమాదానికి గురై చనిపోతున్నారని లెక్కలు చెపుతున్నాయి. అయినా ఏటా వందల సంఖ్యలో కొత్త ఆటగాళ్ళు వచ్చి ఈ ఆటలో చేరుతూనే వున్నారు.

మంచు పర్వతాలలో స్కైమాస్ ధరించి




పైనుంచి కిందికి జారుకుంటూ, వేగంగా పోయే ఈ ఆటను ఉత్సాహంగా చూసేవాళ్ళ సంఖ్య కూడా హెచ్చుగానే వుంది. క్రికెట్ ఆట చూసే ప్రేక్షకుల సంఖ్యకు ఇది 50 రెట్లు వుంటుందని ఒక అంచనా.

ఏటా ఆటలో చేరే కొత్త ఆటగాళ్ళ సంఖ్య 4000దాకా వుంటుందంటున్నారు. ఈ 'ఐస్' డ్రైవింగ్‌ను నేర్చుకోడానికి ప్రపంచం మొత్తంమీద వివిధ దేశాల్లో 200 స్కూళ్ళదాకా వున్నట్టు అంచనా. ప్రపంచం మొత్తంమీద ఈ ఆటమీద అయ్యే ఖర్చు కోట్లాది రూపాయల్లో వుంటే ఒక్క అమెరికాలోనే దీనిమీద 3, 350 లక్షల డాలర్లు ఖర్చుపెడుతున్నారు.

స్విట్జర్లాండులో నాలుగు సంవత్సరాలకొకసారి ఐస్ డ్రైవింగ్ ఒలింపిక్స్ జరుగుతూ వుంటాయి. కానీ 4 ఏళ్ళ వరకు ఆగలేక కృత్రిమమైన ఐస్ స్లోప్స్‌ను తయారుచేసుకుని సంవత్సరాని కొకసారి ఈ పోటీలను నిర్వహిస్తోంది అమెరికా.

500 సంవత్సరాలక్రితమే ప్రారంభమయిన ఈ ఆట మొదట్లో నార్వే, స్వీడన్, ఫిన్‌లాండులలో జరిగేది. అప్పట్లో డ్రైవింగ్‌కు కావలసిన బూట్లు... వగైరా పరికరాలను ఆవులు, లేళ్ళు మొదలైన జంతువుల ఎముకలతో, చర్మంతో తయారు చేసేవారు. కొంతమంది ఈ ఆట క్రీస్తుపూర్వమే ప్రారంభమయిందంటారు.

క్రీ.శ. 1200లో ఈ క్రీడ ఒక ప్రాంతం నుంచి మరోప్రాంతానికి రహస్యసమాచారాన్ని అందించడానికి ఉపయోగపడేది. అప్పటి స్వీడన్ రాజులు తమ సైనికులు శత్రువులబారి నుంచి తప్పించుకుంటూ రహస్య సమాచారాన్ని సేకరించుకువచ్చేందుకు వీలుగా ఈ మంచు పర్వాతాలలో గుహలను తవ్వించారు.

1590లో ఆస్ట్రియామీదుగా మధ్యాఐరోపాకి విస్తరించిన ఈ ఆట అటుపైన నార్త్ అమెరికా, జపాన్, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ మొదలైన దేశాల్లో వేగంగా వెళ్ళూనుకుంది.

మొట్టమొదటిసారిగా 1924లో ఇది వింటర్ ఒలింపిక్స్‌లో ఒకటిగా చేర్చబడింది. ఎంత మంది ప్రాణాలు కోల్పోయినా, ఇప్పటికీ ఈ ఆట మాత్రం దినదిన ప్రవర్ధమానంగా వెలుగుతూనే వుంది.





# చాతుర కతలు

## అలవాటు

ఆ బిచ్చగత్తె చేత ఎలాగైనాసరే అడుక్కు తింటం మాన్పించి ఏదో ఒక పనిలో పెట్టాలని అరుణ్ ఆలోచన!

చాలాసార్లు ఆవిడతో చెప్పేడు కూడా - రోడ్లెంట తిరిగి చిత్తుకాయితాలు ఏరుకున్నా సాయంకాలానికల్లా కాస్తో కూస్తో డబ్బు సంపాదించవచ్చు. గౌరవంగానూ బతకొచ్చునని.

ఆవిడమాత్రం అదోలా నవ్వి "ఇదే అలవాటయింది బాబో!" అనేది.

చాలామంది ఆ బిచ్చకత్తెను చీదరించుకోటం అరుణ్ గమనించకపోలేదు. అలా పరాన్నభుక్కుల్లా బతికేకన్నా శ్రమ చేసుకొని బతకటంలో ఉండే ఆనందం ఆమెకేం తెలుసునను కున్నాడు.

చివరికి ఓరోజు అరుణ్‌కి మాంచి ఆలోచనొచ్చింది.

ఆమెను సాదరంగా ఆహ్వానించి వరండాలో కూచోమని చెప్పి తన మామూలు ధోరణిలోనే బిచ్చగత్తెకు అడుక్కోటం మానుకోమని చెప్పాడు. 'చిత్తుకాయితాలు ఏరుకొని అమ్మటం ఆమెకు కొత్త కనక అందులో స్థిరపడేదాకా రోజూ తనింట్లోనే భోజనం కూడా పెడతానన్నాడు'

"బాబో... ఇలా అడుక్కోటం అలవాటైంది బాబో" అంది పెద్దగా.

"నువ్వు నా మాట వినకపోతే ఒట్టే..." అరుణ్ అన్నాడు గట్టిగా.

ఆమె మౌనంగా తల దించుకొంది.

అరుణ్‌కి ఆనందమనిపించింది. హడావిడిగా ఇంట్లోకి వెళ్ళి ఒక పాత గోతం తెచ్చి ఆమెకిస్తూ వీధుల్లో ఎక్కడెక్కడ చిత్తుకాయితాలు ఎక్కువగా దొరుకుతాయో వివరాలన్నీ



చెప్పి, ఆమె ఉత్సాహంగా గోతం భుజాన పెట్టుకొని వీధిలోకి వెళ్తుంటే గర్వంగా చూస్తూ నిలుచున్నాడు.

★ ★ ★

ఆరోజు కూడా బిచ్చగత్తె ఖాళీ గోతంతో తిరిగొచ్చింది.

అరుణ్ ఆశ్చర్యపోయాడు. వేలెడేసి వెధవలు కూడా గోతాలకు గోతాలు కాయితాలు ఏరుకొచ్చి అమ్మటం అరుణ్ గమనిస్తున్నాడు.

అలాంటిది బిచ్చకత్తెకు ఈ నాలుగురోజులూ అసలు చిత్తుకాయితాలే దొరకలేదంటే ఆశ్చర్యంకాదా!

"ఈరోజు కూడా ప్రయత్నించు" నీరసంగా చెప్పాడు అరుణ్.

బిచ్చకత్తె దిగులుగా చూసి అక్కణ్ణించి కదిలింది.

ఆమె వెళ్ళింతర్వాత అరుణ్ ఆఫీసుకు బయలుదేరాడు. బస్టాపు దగ్గర నించొని పరిసరాల్ని గమనించేడు అరుణ్. అక్కడ చాలా చిత్తుకాయితాలు పడున్నాయి!

బిచ్చకత్తె అక్కడికి వస్తే బావుండునను కొంటూ తలెత్తి దూరంగా చూసి సంతోషపడ్డాడు.

బిచ్చకత్తె అక్కడికే వస్తోంది!

అరుణ్ మరింత ఆసక్తిగా ఆమెకేసే చూస్తూ నించున్నాడు.

బిచ్చగత్తె దగ్గరికొస్తున్నకొద్దీ అక్కడక్కడా బస్సుకోసం నించున్న వాళ్ళంతా హడావిడిగా దూరంగా పారిపోతున్నారు.

వాళ్ళు ఆమెను చూసి అలా ఎందుకు పారిపోతున్నారో అర్థంకాక అరుణ్ నొసలు చిట్లించి చూస్తున్నాడు.

బిచ్చగత్తె మరింత దగ్గరికొచ్చింది. ఆమె అరుణ్‌ని గమనించలేదు. గొంతెత్తి అక్కడ నించున్న ఎవర్తోనో ఆమె అంటున్న మాట విని అరుణ్ నిశ్చేష్టుడైపోయాడు.

"బాబో! నాలుగు చిత్తుకాయితాలుంటే ఏరిపెట్టండి బాబూ!" అంటూ బతిమిలాడ్తోందామె.

నాలుగు రోజులనుంచి బిచ్చకత్తెకు చిత్తుకాయితాలెందుకు దొరకలేదో అర్థమైంది అరుణ్‌కి.

—గోపరాజు నాగేశ్వరరావ్

## బదులు

సరోజకి సినిమా పాటలపిచ్చి. అస్తమానూ ఏదో ఒక కూనిరాగం తీయందే నోరూరుకోదు. పెళ్లి కాగంతవరకూ తల్లీ, తండ్రీ మొత్తుకునేవారు "అబ్బబ్బా! ఆ సినిమా పాట్లగోల ఆపవే, కాసేపయినా పుస్తకం తియ్యవే" అంటూ. ఊహూ! ఏం ప్రయోజనం ఉండేదికాదు. ఒక వేళ పుస్తకం పట్టుకున్నా...

"బడిలో ఏముందీ...? దేముడి గుడిలోనే వుందీ..." అంటూ ఓ సినిమా పాట పాడేసి బుద్ధిగా పుస్తకం మూసేసేది.

ఓసారి వాళ్ల దూరపు బంధువొకాయన ఆ వూళ్లో రెండు రోజులు పనివుండి సరోజా వాళ్లింట్లోనే మకాం పెట్టాడు. అసలే నీళ్లు లేక అవస్థలు పడుతున్న సిటీలో గ్రామం నుంచొచ్చిన సదరు చుట్టం రెండేసి బకెట్ల నీళ్లు పట్టుకుని, గంటల తరబడి స్నానం చేస్తుంటే ఒళ్లుమండినా మర్యాదకి ఊరుకునేది సరోజ తల్లి. కానీ సరోజ మాత్రం ఆయనలా బాత్‌రూమ్‌లోకి దూరిన మరుక్షణం "జలకాలాటలలో... కలకల పాటలలో..." అంటూ హైపిచ్‌లో పాటందుకునేది. దాంతో సిగ్గుపడి మొహమాటంతో నీళ్లు పూర్తిగా పోసుకోకుండానే బయటకొచ్చేసేవాడా బంధువు.

రాకరాక వచ్చిన అతిథి అని, లోపల తిట్టుకున్నా పైకి మర్యాద నటిస్తూ రెండు రకాల కూరలు వగైరాలతో భోజనం పెట్టేది సరోజ తల్లి. అలా ఆయన కంచం ముందు కూచోగానే "వివాహభోజనంబు, వింతైన వంటకంబు" అంటూ మాధవపెద్దిలా కంచుగొంతుకతో పాటందుకునేది సరోజ. దాంతో రెండు మెతుకులు కెతికి అయిందనిపించి, ఉసూరుమంటూ లేచేవాడా చుట్టం.

ఆ మర్నాడు పని అయిపోయిందంటూ ఊరికి బయలుదేరిన చుట్టం అరగంట తిరక్కుండానే గోడక్కొట్టిన బంతిలా వెనక్కొచ్చాడు. బస్సుల స్ట్రైకు మూలంగా ఆ రోజుకి





ప్రయాణం లేదని ఆయన పూర్తిగా చెప్పకుండానే "అంతా భ్రాంతియేనా..." అంటూ పాటందుకున్న సరోజతో...

"అదికాదమ్మాయ్..." అని ఆయనేదో చెప్పబోతుంటే "ఏ నిమిషానికి ఏమి జరుగునో...." అంటూ రాగం అందుకునేసరికి టక్కున గదిలోకెళ్ళి మంచమెక్కాడా చుట్టం.

ఇలా పెళ్ళికాని క్రితం యధేచ్ఛగా సాగిన సరోజ పాటల ప్రహసనానికి పెళ్లి ఓ పెద్ద అడ్డుకట్టవేసిందని చెప్పాలి. ఎందుకంటే సరిగ్గా అదే అలవాటు భర్తకి కూడా వుందని




ఆనందించిందిగాని, ఆ తరవాతి కథ మాత్రం సరోజ అనుకున్నట్టు జరగలేదు.

కూతురి కొత్తకాపురం చూడాలని తండ్రి వచ్చాడు ఇంటికి. మామగారిని చూడగానే "స్వాగతం సుస్వాగతం..." అని పాటందుకున్న భర్తని మురిపెంగా చూసింది సరోజ.

ఆ మర్నాడు ఏడు గంటలయినా నిద్రలేవక ముసుగు తన్నిన మామగార్ని చూసి...

"మత్తువదలరా... నిద్దుర మత్తు వదలరా" అంటూ కూనిరాగం తీస్తున్న అల్లుడికేసి బెరుగ్గా చూసి తక్కున లేచి కూర్చున్నాడు మామ. సరోజకి ఓ మూల బాధగానే వున్నా నోరెత్తి ఏమీ అనలేక లోపల్లోపలే గింజుకుంది. మర్నాడు రాత్రి ప్రయాణం పెట్టుకున్న తండ్రికి ఆ వుదయమే పూర్ణించి టెలిగ్రాం వచ్చింది, భార్యకి సుస్తీగా వుందనీ, వున్నపళంగా బయలుదేరి రమ్మని. విషయం చూచాయగా అర్థమైన అల్లుడు గదిలోంచే అందుకున్నాడు.

"పోతేపోనీపోరా... ఈ పాపపు జగతిని శాశ్వతమెవరురా..." అంటూ. దాంతో కోపం వచ్చిన మామగారు అల్లుడికి చెప్పకుండానే పెట్టె పుచ్చుకుని రిక్షా ఎక్కేశాడు.

తండ్రి అలా వెళ్లగానే భర్త మీద విరుచుకుపడింది సరోజ, "మీకిదేమయినా మర్యాదగా వుందా?" అంటూ.

"ఎందుకులేదూ! మన పెళ్లికి ముందు మీ దూరపు చుట్టం రెండ్రోజులు మీ ఇంట్లోవుందామనొస్తే నువ్వేం చేశావు? ఆయనెవరనుకున్నావు. స్వయంగా మా వేలువిడిచిన మేనమామకి తోడల్లుడు. పెళ్లిలో నిన్ను చూసి జరిగిందంతా చెప్పుకుని ఏడ్చాడు పాపం" అన్నాడు భర్త.

—రాధాశివమోహన్

# ధనకెరటంపై సమీక్షలు



ఆగస్ట్ చతురలో ప్రచురితమైన ప్రఖ్యాత రచయిత ఆర్.కె. నారాయణ్ నవలకి జె.వి.బి. నాగేశ్వరరావు అనువాదం 'ధనకెరటంపై' వచ్చిన ఉత్తమ సమీక్షలను ఈ దిగువ ప్రచురిస్తున్నాం.

## జీవన సూక్ష్మం

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

**కో**పరేటివ్ తనఖాబ్యాంకు బయట మర్రిచెట్టు క్రింద కూర్చుని బ్యాంకుకు అప్పుల కోసం వచ్చిన పల్లీయులకు సాయం చేసి, వారిచ్చే చిల్లర డబ్బులతో జీవనం సాగించే ఒక సాదా సీదా వ్యక్తికి ధనవంతుడినైపోవాలనే కోరిక జనించడం, అది వటవృక్షంలా పెరిగి తత్పరిణామాలలో త్వరిత కాలంలోనే అతను సంపన్నుడైపోయిన విధానం ఏమాత్రం సహజంగానూ, సమర్థనీయంగానూ లేదు. సాహిత్య పోషకులెవరూ ప్రోత్సహించలేని ఒక సెక్సు పుస్తకం ఒక అనామకుని జీవితాన్ని అందలమెక్కించడం, అతని జీవన విధానాన్ని చిత్రంగా మార్చేయడం ఒక వింతైన మలుపైతే, ఎలాగో ఒక స్థాయికి చేరినవాడు అంతటితో తృప్తిపడక, వూరందరి డబ్బూ తన





ఇంట్లో పెట్టుకుని, తనకేమాత్రం లాభంలేని విధంగా 30/- శాతం వడ్డీ సమర్పించే ఆలోచన ఎందుకు చేసేడనేది అర్థంకాని వింత.

ఆ సెక్సు పుస్తకానికెంతటి ప్రభావం వుందో ముందే తెలిసీ, దాన్ని స్నేహమనే పేరుతో వీరయ్యకి డాక్టర్ పాల్ ఎందుకు త్యాగం చేసేడో? స్నేహం పదానికి ముందు అన్ని ఆదర్శాలు వల్లించిన అదే పాల్ చివర్లో బాలూ పంచన చేరి వీరయ్య పతనానికి ఎందుకు నాంది పలికాడో కూడా అర్థం కాకపోవడానికి బహుశా మా విషయ పరిజ్ఞాన లోపమే కారణం కావచ్చు. ఏ కొడుకు జీవితాన్నందలమెక్కించాలని ఆశతో ఎండమావుల వెంట పరుగెత్తాడో ఆ కొడుకు పనికిమాలిన వాడై తన పతనానికి కారకుడైనపుడే జీవన సూక్ష్మాన్ని వల్లిస్తాడు పాపం ఆ మానవుడు.

-కె.వసంతలక్ష్మి
భీమవరం

## విఫలప్రయత్నం

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

**డ**బ్బులేనివాడు డుబ్బుకు కొరగాడని మనకో సామెతవుంది. అదెంత నిజమో, డబ్బు ఎక్కువైతే మనశ్శాంతి వుండదనేది కూడా అంతే నిజం. ఈ సత్యాన్ని చెప్పడం కోసం రచయిత చేసిన విఫల ప్రయత్నం 'ధనకెరటం' నవల.

ఇది అనువాద నవలే కావొచ్చు. కానీ మూలం ఇంతకంటే గొప్పగా వుండదని చెప్పడానికి, ఆ నవలలోని ప్రాముఖ్యత లేని పాత్రలు, ఏమాత్రం రంజింపని సన్నివేశాలే సజీవ సాక్ష్యం. సాధారణంగా ఏ పాత్రనైనా చదివినపుడు, ఆ పాత్రపట్ల అభిమానమో, అసహ్యామో, సానుభూతో కల్గాలి. కానీ ఈ నవలలోని ఏ పాత్రను చూసినా ఎలాంటి భావం కల్గదు. అన్నీ నిర్జీవ పాత్రలే. అన్నీ కొయ్యబొమ్మలే.

ప్రధాన పాత్ర వీరయ్యనే తీసుకుందాం. అతను దరిద్రుడుగా వున్నప్పుడు అతనిపట్ల జాలికల్గదు. అతడు ధనవంతుడైనపుడు అభిమానం కల్గదు. మూర్తీభవించిన అహంకారం వీరయ్యపాత్ర. అతని భార్య మరబొమ్మ. అతని పుత్రరత్నం బాలు, లేటు వయసులో పుట్టినందుకు అతి గారాబంగా పెరిగి, చదువబ్బక, ఇంట్లోంచి పారిపోయి, చావుతప్పి కన్ను లొట్టబోయి, తండ్రితో కల్సి ఇంటికి రావడం వీటిలో ఏ సన్నివేశం హృదయాన్ని కదిలించదు.

ఇంకో విచిత్రమైన పాత్ర విలేకరి కమ్ డాక్టర్ పాల్. లక్షలు సంపాదించి పెట్టే రచనని తెల్సీ, దాన్ని వీరయ్యకు ఇచ్చివేయడం విడ్డూరంగావుంది. అదే పాల్ వీరయ్య కొడుకు బాలూను క్లబ్బుల చుట్టూ తిప్పడంలో అర్థం లేదు.

వీరయ్య అకస్మాత్తుగా కుబేరుడు ఎలా అయ్యాడో, అతడు 30% వడ్డీ ఎలా చెల్లించగల్గాడో ఖాతాదార్లకు అర్థం కాకపోయినా, పాఠకుడికి తెలియజేసే బాధ్యత రచయిత మీద వుంది. ఒకవేళ వీరయ్య 40 రోజులు చేసిన లక్ష్మీ పూజవల్ల ధనవంతుడయ్యాడా? ఒక అభ్యుదయ రచయిత మంత్రతంత్రాలకు విలువనిస్తాడా?

పాల్‌తో శత్రుత్వం ఏర్పడి, డబ్బంతా పోయి, జీవిత వైకుంఠపాళిలో మళ్లీ మొదటి గడికి చేరిన వీరయ్య నేలమీద చాప పర్చుకొని పడుకున్న సన్నివేశంద్వారా సాదాసీదా జీవితంలో అంతులేని సుఖముందని చెప్పినట్లు భావించాలా?

-మహబూబ్‌కమల్
న్యూపాల్వంచ

## ఉక్కిరి బిక్కిరి చేసిన కెరటం

*(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

'**ధ**నమూల మిదం జగత్' అనేది నిజమే గానీ, కేవలం అదే మనిషికి పూర్తి మనశ్శాంతిని ఇవ్వలేదని నిరూపించింది, ఆగస్ట్ చతుర నవల 'ధనకెరటం'. ఉప్పెనలా పొంగి వచ్చిన డబ్బు మనిషిని ఉక్కిరిబిక్కిరి చేస్తుందేకానీ, ఊపిరి సల్పనివ్వదని చెప్పుటలో రచయిత పూర్తిగా కృతకృత్యులయ్యారు.



రచనా శైలి అద్భుతం. కథలో అక్కడక్కడ వాడిన ఉపమానాలు రచయిత గొప్పదనాన్ని చెప్పటమేకాక, పాఠకునికి కూడా కథ పట్ల ఆసక్తి కల్గించాయి.

తెలివైన వాడూ, లౌక్యం ప్రదర్శించగలవాడూ డబ్బును ఏవిధంగా సంపాదించగలడో ఓ పక్క చెబుతూనే, మరో పక్క ఏ వృత్తిలో రాణించాలంటే, ఏవిధమైన లౌక్యం అవసరమో వివరించారు రచయిత.

తల్లిదండ్రుల పెంపకంలో లోపాలుంటే బిడ్డలు ఏవిధంగా చెడిపోతారో, బిడ్డలు మూర్ఖులు అయితే తల్లిదండ్రులు ఏవిధంగా కష్టాలపాలవుతారో వివరంగా చెప్పారు.

ఒక వ్యక్తికి జీవనోపాధి కల్పించాలికానీ, జీవించటానికి ధనం రూపంలో సహాయం చేస్తే మనిషి పనికిమాలినవాడై దుర్వ్యసనాలకు లోనౌతాడనీ బాలూ పాత్ర నిరూపించింది. అందుకే వీరయ్య వారసత్వ ఆస్తిగా తన కొడుక్కి రేకుపెట్టెను మాత్రమే బహూకరించాడు.

ఆయా సందర్భాలలో కొన్ని ప్రదేశాలను రచయిత ఎక్కువగా వర్ణించారనే చెప్పాలి. ఇది పాఠకుడికి విసుగు కల్గించినా కథలో కొద్దిగా ఉన్న సస్పెన్సు పాఠకుణ్ణి ముందుకు నడిపిస్తుంది.

పైకి అమాయకులుగా కన్పించినా లోపల స్వతహా చెడు గుణాల్ని కల్గిన వ్యక్తుల స్నేహం సాటివాణ్ణి ఏవిధంగా పతనం చేస్తుందో చెప్పింది పాల్ పాత్ర. మానవత్వాన్ని చూపింది వీరయ్య అన్న పాత్ర.

మొత్తం మీద డబ్బు లేకపోతే మనిషి క్షణక్షణం అవమానాల్ని ఎదుర్కొంటూ అష్టకష్టాల్ని అనుభవించుటయేకాక, ఆ ధనం అధికమైనా అశాంతికి గురౌతాడనీ వివరించిందీ నవల. ప్రతివ్యక్తి శ్రేయస్సుకు అభివృద్ధికి పట్టుగొమ్మ కుటుంబ సౌఖ్యమనీ, కుటుంబ సౌఖ్యం లేకపోయినప్పుడు యజమాని సర్వసౌఖ్యాన్ని కోల్పోతాడనీ చెప్పింది.

-కె.మాధవీలత,
వెంట్రప్రగడ

# శృతిమించితే

(నాలుగవ బహుమతి రు: 25/- పొందిన సమీక్ష)

ఏవ్యసనమైనా శృతిమించితే ముప్పు తప్పదు. ముఖ్యంగా ధన సంపాదనా వ్యసనంలోపడి, ఏం పొందుతున్నాం, ఏం పోగొట్టుకుంటున్నాం, అనే ఆలోచన లేకుండా కాసు వెంట పరుగులెత్తేవారికి ఈ నవల కనువిప్పు కలిగిస్తుంది.

బ్యాంకు ముంగిట్లో కూర్చుని వచ్చేపోయే ఖాతాదారుల లావాదేవీలవలన లబ్ధినిపొంది కుటుంబం గడిపే వీరయ్య, బ్యాంకు సెక్రటరీతో జరిగిన చిన్న ఘర్షణవల్ల అహం దెబ్బతిని, డబ్బు సంపాదించాలనేదాన్నే జీవితధ్యేయంగా ఎంచుకుని, ఉవ్వెత్తున లేచిన ధనకెరటంలో మునిగి, తేలి, చివరకు ఇసుక దిబ్బలపై ఎలా మిగిలాడో తెలిపే ఈ నవల ఆలోచింపజేసేలా వుంది. కథనం ఆపకుండా చదివించింది.

ధనార్జనకే అతిగా అంకితమైనవారు కుటుంబశాంతిని ఎలా కోల్పోతారో, అనేందుకు ఒక ఉదాహరణ ఈ నవల.

పూజారిగారు వీరయ్యకు ధనార్జనకై ఆచరించవలసిన విధులను తెలపడం, మంత్రోపదేశం చేయడం, వాటిని వీరయ్య చిత్తశుద్ధితో ఆచరించడం చదవడానికి బాగున్నా కొంచెం వాస్తవ విరుద్ధం అనిపిస్తుంది. అయితే పూజారిగారి విశ్లేషణ ఆమోదయోగ్యంగా వుంది.

ఈ నవలలో అర్థంకానిది ఒకటే. అది విలేకరి డాక్టర్ పాల్ పాత్ర. అతను విజ్ఞాని, సహృదయుడు, స్నేహశీలి, పరోపకారి, నిస్వార్థపరుడు అని రెండు మూడు సంఘటనలలో అనిపిస్తుంది. పైగా వీరయ్య జీవితాశయం నెరవేరడానికి పాల్ ఎంతో తోడ్పడ్డాడు. అటువంటి పాల్, బాలూ చెడిపోవడానికి ఎందుకు కారకుడయ్యాడు అనేది అర్థంకాదు. అంతేకాదు ఎన్నో ఒడుదుడుకులకోర్చి పైకొచ్చిన వీరయ్య క్షణికావేశంలో పాల్‌ను చితకబాదడం సహజంగా లేదు. అయితే 'వినాశకాలే విపరీత బుద్ధి' అని అదే వీరయ్య పతనానికి నాంది అయ్యింది. ఏది ఏమైనా ఈ నవల ధనపిపాసు




లకు కనువిప్పు.

-పెండ్యాల సుబ్బారావు,
రామచంద్రాపురం.

## మ'ధన' కెరటం

***(అయిదవ బహుమతి రు: 25/- పొందిన సమీక్ష)***

విషయం చర్వితచర్వణమే అయినా వివరణ, విశ్లేషణ ప్రత్యేక శైలితో సాగింది. ధన సంపాదనే ధ్యేయంగా గల వ్యక్తులు తమ జీవిత నాణాలకు రెండోవైపు ఎంత నష్టపోతున్నదీ, అశాంతి అనుభవిస్తున్నదీ విపులంగా విశదీకరించే సత్ప్రయత్నం చేసిన రచయిత సర్వదా అభినందనీయులు. డబ్బు ఓ అల లాంటిది. ఎంత వేగంగా వస్తుందో అంత వేగంగానూ తిరిగి తన స్థానానికి వెళ్ళిపోతుందన్న కఠిన సత్యాన్ని తెలియజేసిందీ నవల. ప్రతి దృశ్యమూ ఎంతో స్వాభావికతను సతరించుకుంది. పాత్రలూ, సంభాషణలూ, సన్నివేశాలూ- అన్నీ నిత్యం మన చుట్టూరా చూస్తున్నవే.

కానీ, కథా చట్రంలో ఇమడని అంశాలు రెండున్నాయి. ఒకటి- 'డబ్బుని ఎలా పెంచాలి, దాని ఫలాలను ఎప్పుడు తినాలి' అన్న విషయం గురించి ఎంతో అవగాహన, వివేచనగల వీరయ్య- ఆచరణ శూన్యుడిగా మారి అవాస్తవికంగా నష్టపోవటం వంటిక్రింద రాయిలా అన్పించింది. రెండవది- "డాక్టర్ పాల్" వ్యక్తిత్వం- ఇంతకీ అతనెలాంటివాడు? మంచివాడా, చెడ్డవాడా? ఎలా? ఈ ప్రశ్నలకి ఈ నవలలో సరైన సమాధానం దొరకదు.

వీరయ్యకు జ్ఞానోపదేశం కలగడమే కథ యొక్క ప్రధానాంశమై, ముంగిపు విషయంలో రాజీపడవలసి వచ్చిందేమో?

-కె. శరత్‌చంద్రారెడ్డి,
జమిస్తాన్‌పూర్.

## ధనమూలమిదంజగత్

***(ఆరవ బహుమతి రు: 25/- పొందిన సమీక్ష)***

ప్రస్తుత సమాజంలో మనిషి ఉత్థాన పతనాల హేతుకర్త గౌరవావమానాల రూపకర్త ధనం అని తెలియచేసిన ఆర్కే నారాయణ్‌గారి 'ధనకెరటం' నవల ఒక వినూత్నశైలితో సాగింది.

నవలలోని వీరయ్య పాత్ర మనకు సమాజంలో తరచు కన్పిస్తూ ఉండేదే. అతని పాత్రోచితమైన సంభాషణలు నిష్ఠురసత్యాలు. "సరే నీకు డబ్బక్కర్లేదన్నమాట. డబ్బక్కర్లేని వాడికి నాతో పనిలేదు. ప్రపంచంలో ఇంకా నీలాంటి వెర్రి వాళ్ళున్నారన్న మాట" అన్న వ్యాఖ్య కన్యాశుల్కంలోని గిరీశంను జ్ఞప్తికి తెస్తుంది.

వీరయ్య బీదతనాన్ని నవల ప్రథమార్థంగా అనుకొంటే అందులో వీరయ్య మధ్యతరగతి మనస్తత్వాన్ని చిత్రించడంలో రచయిత కృతకృత్యుడయ్యాడు. కొంత సుపీరియారిటీ కాంప్లెక్స్ కూడా ఉన్న వీరయ్య సంతర్పణలను, బూతుపుస్తక ముద్రణనూ ధన సంపాదనకు వాడుకోవడంవల్ల హీరోనుండి నూడో హీరో దిశగా పయనించాడు. చిట్టా పద్దుల పుస్తకంతో తండ్రీ కొడుకులు పరుగెట్టడంలాంటివి కథనంలో కొంత సినిమాటిక్ కామెడీని కల్పించాయి. నిజాయితీని వ్యాపారంగా చేసే ఈరోజుల్లో వ్యాపారంలో నిజాయితీగా ఉండాలనే నిష్ఠ, బూతుపుస్తక ముద్రణా భారాన్ని తర్కంతో మోహన్‌లాల్‌కి అంటగట్టడం లాంటివి అతని తెలివిని ప్రతిబింబిస్తాయి. గదులనిండా డబ్బు పేరుకుపోవడం అనేది కొంత అసహజత్వాన్ని కల్గించింది. నమ్మిన వాడే మోసం చేయగలడు అని పాల్ నిరూపించాడు.

చివరకు వీరయ్యకు పాత జీవితాన్నే అందించి రచయిత 'నడమంత్రపు సిరి నిలవదు, నిలవనీదు' అన్న ఆర్యోక్తిని రుజువుచేశాడు. అనువాదం అభినందనీయం. చతుర వినూత్న నవలల విధాతగా మరోసారి నిరూపితం అయింది.

-టి. కృష్ణమూర్తి,
ధూల్మిట్ట.

# చతుర

సంపుటి: 16
సంచిక: 9
అక్టోబర్: 1993

అనుక్షణం తన పతి అనురాగంలో, గాఢపరిష్వంగంలో జలప్రవాహమై కరిగి పరవళ్లు తొక్కాలని...

అతడి ప్రేమసాగరంలో వెన్నెలకన్యలా ఊయలలూగాలని...

ఊహాలోకంలో విహరించే ఓ భార్య...

అజరామర ప్రేమకు కోణార్క శిల్పి నిర్వచించిన మనోహర శిల్పంలాంటి అర్ధాంగిని... అతిస్వచ్ఛంగా ప్రేమించే ఓ భర్త...

అలాంటి భార్యాభర్తలయిన ఓ ప్రేయసీప్రియుల మధ్య... కారణం లేకుండా ఏర్పడిన జడత్వం... కరిగి కల్లోలంగా మారిన క్షణం... ఏమైంది? అది వారి జీవితాల్ని ఏ మలుపు తిప్పింది?

వివాహ సంబంధాల మహోన్నత విలువలను అందమైన శైలిలో అక్షరబద్ధంచేస్తూ భాగవతుల సుబ్రహ్మణ్యం రాసిన 'చైత్రంలో చిరుజల్లు' ఈ నెల 'చతుర' సమగ్ర నవల.



సంధ్యారుణిమను కోల్పోయిన విచారం, విరహోత్కంఠిత అయిన రాత్రి కాటుక కళ్ళలో ప్రతిఫలిస్తోందా! అన్నట్టు... గగనతలాన కమ్ముకున్న చీకట్లు...

నల్లటి షిఫాన్ చీరమీద వెండిజరీతో కుట్టిన చుక్కల్లా మెరుస్తూన్నాయ్ నక్షత్రాలు...

గాలికి చెదురుతూన్న నైట్‌క్వీన్ పరిమళాలు...

వాల్తేరు అప్‌లేండ్స్...

కాస్త ఎత్తుగా కట్టబడిన చిన్న ఇల్లు...

ఇంటిచుట్టూ ఆవరణలో రకరకాల మొక్కలు... రంగురంగుల పువ్వులు... మెత్తటి లాన్...

దూరంగా రోడ్డుమీద వాహనాల రొద...

ఉండి ఉండి వీస్తూన్న చల్లటి గాలి...

మెత్తగా- మందంగా- ఏ మార్పూ లేకుండా కదుల్తూన్న కాలం...

బాల్కనీలో వున్న కుర్చీలో రిలాక్సింగ్‌గా వెనక్కివాలి కూర్చొనివుంది మంజూష.

ఆమె కళ్ళు ఏ భావమూ లేకుండా, నక్షత్రాల్లోకి చూస్తున్నాయి...

నెమ్మదిగా లేచింది మంజూష...

లేత పసుపురంగు ఆయిల్‌బౌండ్ డిస్టెంపర్ మీద మేచింగ్ పెయింటింగ్స్...

అభిరుచికి నిలువెత్తు అద్దాల్లా కర్టెన్లు...

వారానికోసారి, ఈ వస్తువులన్నీ మార్చి సర్దడం- ఎంత ఇష్టంగా వుండేదో!

వాహనాల రొద తగ్గుతోంది...

ప్రతిరోజు, ప్రతిరాత్రి, ప్రతిక్షణం- ఇదే నిరీక్షణ... ఇదే అన్వేషణ.

ఎవరికోసమో! ఎందుకోసమో! ఏమో!

మరొక్కసారి రోడ్డువైపు చూసి, చిన్నగా నిట్టూర్చి లోపలికెళ్ళింది మంజూష.

ఇదే ఇల్లు, ఇవే గదులు, ఇవే వస్తువులు, ఇదే వాతావరణం... తననెందుకూ పనికిరాకుండా చేస్తున్నాయి. తననో జడపదార్థాన్ని చేసేస్తున్నాయి.

నెమ్మదిగా కిచెన్‌లోకి వెళ్ళి కుక్కర్ పెట్టి వచ్చింది. రకరకాల వంటలు ఎంత ఇంట్రస్టింగ్‌గా చేసేది ఆరోజుల్లో...

బెడ్ రూం!.

నెమ్మదిగా కర్టెన్ తొలగించింది. కర్టెన్‌కి వ్రేలాడుతున్న చిన్నచిన్న గంటలు స్వీట్‌గా చిరుశబ్దం చేశాయ్.

కిటికీ అద్దాల తలుపుల్లోంచి కన్పిస్తూ, నిద్రపోతున్నట్టున్న స్ట్రీట్‌లైట్స్...

తనకెంతో ఇష్టమైన లేత నీలంరంగు డిస్టెంపర్, లేత నీలం పూలకర్టెన్లు, లేత నీలం డిజైన్డ్ బెడ్‌షీట్లు, డ్రెస్సింగ్ టేబుల్ లేత నీలం, గోడలమీద మ్యాచింగ్ పెయింటింగ్స్, వాజ్‌లో అందమైన లిల్లీలు స్వచ్ఛంగా నవ్వుతూ.

అద్దాల రేక్‌లో తనకెంతో ప్రియమైన పుస్తకాలు ఆప్యాయంగా పలకరిస్తూ...

ఎన్నాళ్ళ అనుబంధం- ఈ వస్తువులతో తనకి...

నిజంగా ఇది అర్థంలేని అనుబంధమా!?

కాలం- మెడలో బండరాయి కట్టినట్టుగా కదుల్తోంది.

కుక్కర్ దింపేసి, మళ్లీ బెడ్రూంలోకి వచ్చింది మంజూష. బెడ్రూంలోంచి డ్రాయింగ్ రూంలోకి, డ్రాయింగ్ రూంలోంచి బాల్కనీలోకి, మళ్ళీ లోపలికి- పిచ్చిగా తిరిగింది.

ఈ నిశ్శబ్దంలో, ఈ నిశ్చలతలో, ఈ జడత్వంలో, ఈ చీకటిలో- ఎంత తిరిగినా అంతే!

తనక్కావలసింది దొరకదు!.

అప్రయత్నంగా అల్మైరా తలుపులు తెరిచి, ఆల్బమ్స్ బైటికి తీసింది. మెత్తటి బెడ్‌మీద కూలబడి, దిండ్లనానుకుని వెనక్కివాలి, ఒక ఆల్బమ్ చేతిలోకి తీసుకుంది.

స్కూల్లో... కాలేజీలో... యూనివర్సిటీలో- ఎంత లైవ్లీగా, ఎంత హేపీగా గడిచేయారోజులు?...

ఎన్ని ఏక్టివిటీస్?....

ఒక్క పూటైనా, ఇంత తీరిగ్గా- ఇంత విశ్రాంతిగా కూర్చునేదా?...

ఆ రోజులు, ఆ స్నేహితులు, ఆ పాటలు,




ఆటలు సరదాలు అన్నీ ఏమైపోయాయ్?

ఎవరు విసిరేశారీ జడత్వంలోకి తనని?

ఎందుకు విసిరేశారు?

తాను చేసిన ఏ పాపానికీ అర్థం లేని శిక్ష?!...

"హేపీ వెడ్డింగ్ డే"

హుఁ!... ఇదే!.... ఇదే!!... ఇదే!!!...

తననో జడపదార్థాన్ని చేసేసింది.

తన వ్యక్తిత్వాన్నీ- చైతన్యాన్నీ ముద్ద చేసేసింది.

తన భావాల్నీ స్వేచ్ఛనీ, మనసునీ ముక్కలు ముక్కలు చేసేసింది.

జీవితంలోని థ్రిల్స్ అన్నిటినీ చంపేసింది.

ఈ ఇంట్లోని అన్ని వస్తువులతోపాటు తననీ ఓ అలంకారపు వస్తువుగా మార్చేసింది.

ఇదే!... ఈ వెడ్డింగ్ డే చేసిందిదే!...

అసహనంగా ఆల్బమ్‌ని బెడ్‌మీద విసిరికొట్టి, లేచి కిటికీ దగ్గరకెళ్ళి మళ్లీ బెడ్‌మీద కూర్చుంది.

అప్రయత్నంగా చేతికి తగిలిన మరో ఆల్బమ్‌ని తీసింది...

'స్వీట్ మెమొరీస్'

నిజంగా అవి స్వీట్ మెమొరీసేనా? ఏమో!...

పేజీలు తిప్పుతోంది-

అందమైన బెంగుళూరు దృశ్యాలు...

పెళ్ళయిన నాటిరాత్రే అతడడిగాడు -"మంజూ! హనీమూన్ కెక్కడికెళ్దాం?" అని.

అతడలా 'మంజూ' అని పిలుస్తుంటే, ఎంతో స్వీట్‌గా వుండేది. ఒక్కక్షణం ఆలోచించి 'బెంగుళూరు' అంది తను.

-ఆ రోజులే వేరు...

అవి అనుభూతికందని అద్వైతాన్ని అనుభవించిన రోజులు...

జీవితమంతా రంగుల స్వప్నంగా కనిపించిన రోజులు...

కలర్ రోజాలు పరిచిన 'వెల్వెట్ వే'మీద నడిచిన రోజులు.

ఆ ఆవేశం, ఆ ఉత్సాహం, ఆ థ్రిల్స్ ఏమైపోయాయవన్నీ ఇప్పుడు?

పేజీలు తిప్పుతోంది...

ఓ పెద్ద షాపింగ్ సెంటర్- అందమైన ఓ షాపుముందు షోకేసులో- చాలా ఖరీదైన చందనపు బొమ్మ. దంతపు పనితనం కూడా వుంది. ఒకదానివెంట ఒకటిగా నాలుగు ఏనుగులు సైజులవారీగా చందనపు మ్రానుల కాండాల్ని మోసుకెళ్తున్నట్టు...

మంచి గంధపు చెక్కతో చెక్కిన అపురూపమైన బొమ్మ అది. వుడెన్ కార్వింగ్ పనితనం అద్భుతం.

"ఎంత బావుందో చూశారా ఇది?" కెమెరా మూసి, భుజానికి తగిలించుకుని పది అడుగులు ముందుకెళ్ళిపోయిన అతడ్ని వెనక్కు పిలుస్తూఅంది-

"ఏమిటి?" తన దగ్గరగా వచ్చాడతడు.

ఆ అపురూప దారుశిల్పాన్ని కళ్ళతోనే చూపించింది.

"చాలా బావుంది" కామెంట్ అతడిదే.

"కొందామా మరి!?" ఉత్సాహంగా అడిగింది.

అతడేం మాట్లాడలేదు. తానే గబగబా లోపలి కెళ్ళి ధర కనుక్కొచ్చింది. "ఎనిమిది వందలుట!"

"రూపాయలే!... భూమ్మీద నించునే మాట్లాడుతున్నావా? ఇప్పటికే నువ్వు కొన్న వస్తువులు మూడున్నర వేలకు మించిపోయాయి. తిరిగి ఫ్లైట్‌లో వెళ్ళాలా! వద్దా? అదీగాకుండా అదంత వర్త్ చెయ్యదు. టూరిస్టుల్ని వీళ్ళు చాలా మోసం చేస్తారు. ఇప్పటికే చాలావరకు మోసపోయాం!"

అతడు బిజినెస్ మాగ్నెట్టే! సందేహంలేదు! కానీ- పిసినారివాడు కూడానా?...

"ఓహ్!... నో డియర్! ప్లీజ్! ఇదొక్కటే!"

"సారీ! నాకు చాలా ఆకలిగా వుంది. ముందేదైనా రెస్టారెంట్ సంగతి చూడవోయ్!" భుజం చుట్టూ చెయ్యేసి ముందుకు నడిపించబోయేడు.

గట్టిగా విదిలించుకుంది తాను. "ఇంకేం మాట్లాడకండి! ఈ సందర్భం మళ్లీ- మళ్ళీ వస్తుందా? ఏమైనా సరే! అది కొనాల్సిందే!"




# టోపీ సిగకి హాట్స్ ఆఫ్ 'హాట్స్ ఆఫ్'

'జుట్టున్నమ్మ ఎన్ని కొప్పులైనా పెడుతుందని అనగానే సరా? ఆ కొప్పులు అందంగా పెట్టుకోడం కూడా రావద్దూ?' అంటూ సుజెట్టెఖాన్ అనే ఈ లలనామణి తననిడుపాటి కురులను అందమైన కొప్పులతో అలంకరించి అందరినీ ఆశ్చర్యపరుస్తోంది. ఇంగ్లండ్‌లో జరిగిన 'హెయిర్‌డూ' అనే పోటీలో పాల్గొనడానికి తన కజిన్ సాయంతో సిగను ఈ రకంగా టోపీలా చుట్టింది జెట్టీ. దానికి కట్టిన రిబ్బను, అందులో పెట్టిన పువ్వుతో మరింత అద్భుతంగా కనిపించిన ఈ టోపీ కొప్పుతో జడ్జీలకి టోపీవేసి ప్రథమ బహుమతికొట్టేసింది జెట్టీ.

పట్టుదలగా అంది.

''మంజూ! నీకేమైనా పిచ్చిపట్టిందా? ప్రస్తుతం మన పొజిషన్ ఆలోచించు!''

''పొజిషన్‌కేమైంది? విశాఖపట్నం రోడ్లమీద అడుక్కుతింటున్నామా?'' కోపంగా ... కాదు... రోషంగా అంది.

''రోడ్డుమీద నించుని ఏమిటీ వాదనలు?... ముందు కాస్త వేడిగా ఏదైనా పడాలి. పద!'' బలవంతంగా తన చెయ్యి పట్టుకుని లాక్కెళ్ళాడు.

రౌండ్‌షేప్‌లో, చుట్టూ అద్దాలున్న చిన్న రెస్టారెంట్... కట్‌లెట్స్ తింటూనే, ఓ చేత్తో వేడికాఫీ కలుపుకుంటున్నాడు. మంజూష అసలేం ముట్టుకోలేదు. తన మనసంతా ఆ చందనపు బొమ్మ మీదే వుంది.

''కనీసం కాఫీ తాగు!'' ఒక కప్పు తన ముందుకు జరుపుతూ అన్నాడు.

''అఖ్ఖర్లేదు'' స్థిరంగా అంది.

బిల్లు చెల్లించి బయటకు వస్తూనే అన్నాడు- ''రేపు మైసూర్ ట్రిప్. మహారాజా ప్యాలెస్ చూస్తానన్నావ్‌గా!''

''నో!... ఆ బొమ్మ కొంటేనే, నేనెక్కడికైనా వచ్చేది! లేకపోతే ఈ గాజులమ్మేసి తిన్నగా మెడ్రాస్ వెళ్ళిపోతాను''... హెల్ప్‌లెస్‌నెస్‌తో కూడిన కోపం తనది.

''ఒహ్హో!...హనీమూన్ ప్లెజరంతా పాడుచేస్తున్నావ్!'' సీరియస్‌గా ఆమెనే చూస్తూ అన్నాడు.

''సర్లే! నీమాటే కానీయ్!'' చిరాగ్గా, విసుగ్గా షాపువైపు నడిచాడు.

''నిజంగానా?'' ప్లెజెంట్‌గా మారింది తన ముఖం.

''హౌ స్వీట్ యూ ఆర్!'' గబుక్కున అతని మెడ చుట్టూ చేతులేసి చిన్నగా ముద్దుపెట్టుకుంది.

మరో ఫొటోలో.

బ్లూ కలర్ జీన్స్‌లో- లేసుతో అల్లిన కుచ్చుటోపీ పెట్టుకుని గుర్రంమీద తాను 'పోలో' ఆడుతూ... తన ముఖంలో ఎంత ఉత్సాహం?... అసలా రోజున గేమ్ పూర్తయితేనా?

మరో ఫోటోలో...

పింక్‌కలర్ సల్వార్-కుర్తా... భుజాలవరకు వేలాడుతున్న 'యు' షేప్డ్ జుట్టు. ట్రిమ్‌గా, ఎంతో నాజూగ్గా దానిపై ఊలు టోపీ... రోజ్‌గార్డెన్‌లో గులాబీలా కలిసిపోయి...

ఇంకో ఫొటోలో...

బెంగుళూరు సిల్క్‌శారీ, షాల్ కప్పుకొని...

స్వీట్ మెమొరీస్... యస్! రియల్లీ స్వీట్ మెమొరీస్...

చిన్నప్పట్నుంచీ అంతే!... ఏదో మొండితనం?... పట్టుదల... ఏదో సాధించాలన్న తపన... సాధించగలనన్న ధైర్యం... ఎవరి చేతా శాసించబడని వ్యక్తిత్వం!

ఆ రోజుల్లో- స్లిమ్‌గా, స్మార్ట్‌గా వుండే తాను మోడర్న్ డ్రెసెస్‌లో ఎంత స్వేచ్ఛగా తిరిగేది?

ఒక్కక్షణం కూడా తీరికలేకుండా- స్నేహితులతో కలిసి సినిమాలు, షికార్లు, పిక్నిక్‌లు...

విజయన్, మనోహరన్, అనిల్, రాజీవ్‌దేశాయ్, ఉన్నికృష్ణన్, కెంపగౌడ, వరదరాజన్... వీళ్ళంతా ఎంత పిచ్చిగా తిరిగేవారు తన చుట్టూ, రకరకాల ఉత్తరాలు రాస్తూ, రకరకాల గ్రీటింగులూ, కార్డులూ గిఫ్టులూ ఇస్తూ, తమ ఆరాధననీ, ప్రేమనీ ఎంతగా పోటీలుపడి వెలిబుచ్చేవారు? కాంటీన్లకి, బీచ్‌కి, రెస్టారెంట్లకీ ఎలా తీసుకెళ్ళేవారు? ఇలా ఎంతమందితో ఎక్కడెక్కడికి తిరిగినా... పాపం! ఎందుకో- వాళ్ళు కోరుకున్న ఫీలింగ్ తనలోకి రాలేదు.

అటువంటి తన స్వేచ్ఛా జీవితాన్ని- ఏదో తనకి తెలియని మలుపు తిప్పడానికే తల్లిదండ్రుల ప్రయత్నాలు... తాను తీవ్రంగా ఖండించనూ లేదు. అలాగని గట్టిగా అంగీకరించనూ లేదు.

''చాలా పెద్ద ఫామిలీ. మంచి సంబంధం-. విశాఖపట్నంలో అతడో పెద్ద...''

''డాడీ! ఐ డోంట్ లైకిట్!'' పొపడ్ కొరుకుతూ అంది.

''పిచ్చిపిచ్చిగా వాగకు! ఎవరో ఏమిటో తెలుసుకోకుండానే ఏమిటా నిర్లక్ష్యం?'' పెరుగువేస్తూ అంది అమ్మ.

''చూడమ్మా! నీ ఇష్టం లేందే ఎలాగూ ఏమీ జరగదు. ఇది నీకెంతో నూటయిన సంబంధం

అని మా ఉద్దేశం! చిన్నచిన్న విషయాల్లోనూ నీ యిష్టాన్నెప్పుడూ మేం కాదనలేదు''

''బట్!... డాడీ!... ముందు నా ఎమ్.ఎ. పూర్తవనీ!''

''తప్పకుండా! నీ చదువయ్యాకే పెళ్ళి!''

ఏం మాట్లాడకుండా చెయ్యి కడుక్కొని లేచింది.

ఎంతకీ నిద్రపట్టలేదా రాత్రి. ఏదో అర్థంకాని అలజడి. ఏ అడ్డూ లేకుండా స్వేచ్ఛగా ప్రవహిస్తున్న సెలయేటికి- ఏదో ఆనకట్ట పడినట్టు... చిరాగ్గా- అన్‌ప్లెజెంట్‌గా...

'పె...ళ్ళి' అనే రెండక్షరాలు ఎందుకో హాయిగా అనిపించడంలేదు తనకి.

అసలేమిటి పెళ్ళంటే...!?

పెళ్ళి వల్ల తన జీవితంలోకి కొత్తగా రాబోయే మార్పులేమిటి?

ఇంతవరకు ముక్కూ మొహం తెలీని ఎవరో వ్యక్తితో, తన భావిజీవితం అంతా గడపాలా?

ఎప్పుడూ ఇలాంటి విషయాల్నే ఆలోచించ లేదు తను.

హాయిగా వుంటున్న తన మనస్సులో- ఇంత రెస్ట్‌లెస్‌నెస్‌ను క్రియేట్ చేస్తున్న అతడెవరు? ఏంచేస్తున్నాడు?

లీలగా- తనకు తెలీకుండానే, తననెవరో శాసిస్తున్న అస్పష్టభావన.

జీవితంలో మొట్టమొదటిసారిగా సన్నగా వణికిందామె హృదయం.



'మంజూ ఇండస్ట్రీస్'లోంచి బయటికొచ్చిన గ్రీన్‌కలర్ మారుతీకారు వైజాగ్ రోడ్లమీద మెత్తగా జారిపోతోంది.

పక్కనే మిత్రుడు డాక్టర్ బదరీనాథ్. మారుతీ నడుపుతున్నది ది గ్రేట్ ఇండస్ట్రియలిస్ట్ దివ్యరామ్. మంజూ ఇండస్ట్రీస్‌కున్న సిస్టర్ కన్‌సర్న్స్‌తో కలుపుకుంటే, అతడి బిజినెస్ టర్నోవర్ కోట్లలో వుంటుంది.

''రామ్! క్లబ్ కెళ్దాం పద. చాలా రోజులైంది వెళ్ళి! కాసేపు చల్లటి సముద్రగాలి పీల్చుకుని, బిలియర్డ్స్ ఆడుకుని వద్దాం!''

''ఎందుకో చాలా అలసట ఫీలవుతున్నాను. ఇంటికెళ్ళాలి''

''ఆడపిల్లలా మాట్లాడకు! అయినా ఇవాళ మనవాళ్ళు చాలామంది వస్తున్నారు''

'ట్వంటీఫస్ట్ సెంచురీక్లబ్' ఆవరణలో ఆగింది కారు.

బదరీనాథ్ కిందికిదిగి, అక్కడి లాన్‌లో గార్డెన్ ఛైర్స్‌లో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్న వాళ్ళ దగ్గరికెళ్ళి పేరుపేరునా, షేక్‌హ్యాండ్ ఇస్తూ పలకరించేడు.

కారు లాక్‌చేసి వెనకాలే వచ్చి అక్కడున్న ఓ కుర్చీలో కూర్చున్నాడు దివ్యరామ్- అందరి వంకా చూసి పలకరింపుగా నవ్వుతూ.

క్లబ్ ఇండోర్ స్టేడియంలో కొందరు బిలియర్డ్స్, ఇంకొందరు టేబుల్ టెన్నిస్ ఆడుతున్నారు.

ఈలోగా డాక్టర్ బదరీ లోపల అందర్నీ పలకరించి ఓ రౌండ్ కొట్టివచ్చేడు.

అప్పటికే అక్కడ డాక్టర్లంతా ఒక గ్రూప్, లాయర్లంతా మరోగ్రూప్, బిజినెస్ మాగ్నెట్లంతా ఇంకోగ్రూప్‌గా సంభాషించుకుంటున్నారు.

ఇంతలో ''హల్లో డాక్టర్!'' అంటూ లోపల్నుంచి వచ్చాడో వ్యక్తి.

''హలో సుందరం! చాలా కాలానికి... కోర్టుకి అంకితమైపోయావేమిటి!... అసలు కనబడ్డమే మానేశావు''.బదరీ అన్నాడు.

నవ్వేసి, పక్కనే ఖాళీగా వున్న కుర్చీలో కూర్చున్నాడు లాయర్ సుందరం. వెనకాలే మరో వ్యక్తి వచ్చి, పక్కన నించున్నాడు.

''ఇతడు భారత్. మన క్లబ్‌లో కొత్తగా జాయినయేడు. భారత్ కెమికల్స్ అధినేత వీరే!''





పరిచయం చేశాడు సుందరం.

అందరూ అతడితో కరచాలనం చేశారు.

"బైదవే- ఒక ముఖ్య విషయం! లయన్స్ వాళ్ళు కాదంబినీ దేవి డ్యాన్స్ ప్రోగ్రాం అరేంజ్ చేస్తున్నారు. మేమంతా టికెట్స్ తీసుకున్నాం! మీ బ్యాచ్ మాత్రమే మిగిలింది. మీరంతు టికెట్స్ తీసుకోగానే మేం వెళ్ళిపోవాలి!"

భారత్ టికెట్స్ బుక్ తీశాడు.

అందరూ వందరూపాయల టికెట్స్ రెండేసి తీసుకున్నారు.

"కాదంబినీదేవి!.... ఆవిడ గురించి చాలా విన్నాను. ఎన్నిసార్లో టికెట్స్ కొని కూడా ప్రోగ్రాం మిస్సయేవాడిని! ఈసారెలాగైనా చూడాలి!" దివ్యరామ్ అనుకున్నాడు.

లాయర్ సుందరం, భారత్‌లు థాంక్స్ చెప్పి వెళ్ళిపోయారు.

టికెట్స్ తీసుకుని మళ్ళీ కబుర్లలో పడ్డ వాళ్ళని ఉద్దేశిస్తూ, "ఇంక మనం బయల్దేరితే బావుంటుందేమో! కనీసం పన్నెండు లోపలయినా ఇల్లు చేరుకోవాలి" లేచి నిల్చున్నాడు దివ్యరామ్.

అందరూ లేచారు.

వాహనాలన్నీ మెర్క్యురీ లైట్ల కాంతిలో మెరుస్తున్నాయి.

ఈసారి డ్రయివ్ చేసే బాధ్యత తాను తీసుకున్నాడు డాక్టర్ బదరీనాథ్ గేరు మారుస్తూ, "ఇంతకీ ప్రోగ్రాం ఎప్పుడు?" అడిగాడు.

"ఇరవై రెండో తేదీన!"

★ ★ ★

బాల్కనీలో కొచ్చి నిలుచుంది మంజూష.

చుట్టూ నిశ్శబ్దం!

ఉండుండి కారో- స్కూటరో వెళ్తున్నప్పటికీ తనకెంతో పరిచయమైన ధ్వని మాత్రం వినబడ్డంలేదు.

ఛీ! ఛీ! ఏం మనుషులు? తనకంటూ ఓ ఇల్లుందని- ఆ ఇంట్లో ఎంత రాత్రయినా, ఎదురుచూస్తూ కూర్చొనే ఓ నిర్భాగ్యజీవి ఉందనే విషయం గుర్తుండదో ఏమో!

ఏకారణంచేత లేటైనా, కనీసం ఆ విషయం ఫోన్ చేసి చెప్పొచ్చుగా! ఎంత ఇర్రెస్పాన్సిబిలిటీ!... మొన్నటివరకూ అలాగే చెప్పేవాడు కూడా!

అయినా- రెస్పాన్సిబిలిటీ ఏంటి? హృదయంలో ప్రేమ ఉండాలి గానీ- తనకోసం, తన ప్రేమకోసం తహతహలాడే హృదయం ఉండాలి గానీ!... కేవలం బాధ్యతలూ కర్తవ్యాలూనా మానవ హృదయాల్ని కలిపేవి?

లోపలికొచ్చి చిరాగ్గా బెడ్‌మీద వాలిపోయింది మంజూష.

పోనీ! తనే ఫోన్ చేస్తే!?

లేవబోయింది.

ప్చ్!... అవసరంలేదు. అతడక్కడ వుండడు.

ఆరోజు...

అతన్ని తొలిసారి తాను చూసిన రోజు గుర్తొచ్చింది మంజూషకి.

అతనితోపాటు, తల్లీ- కజిన్‌సిస్టరూ, మరో అబ్బాయీ వచ్చేరు. పొద్దున్నే 'హౌరా మెడ్రాస్'లో దిగిన వాళ్ళని డాడీయే రిసీవ్ చేసుకున్నారు. అమ్మ ఆ రోజు తనని కాలేజీకి వెళ్ళొద్దని హెచ్చరించింది. కానీ తాను ఆగితేగా! తాను మామూలుగా వెళ్ళిపోయినా లంచ్‌టైంలో ఇంటికొచ్చింది.

వాళ్ళంతా పదకొండు గంటలకే భోంచేసి, రెస్ట్ తీసుకుంటున్నారు.

మధ్యాహ్నం టీ టైమ్‌లో-

అతని తల్లి సడన్‌గా అడిగింది... "ఏమ్మా! నీకు వంటొచ్చా?"

"రాదు!"

"అదేం?"

"ప్రాక్టీస్ లేదు"

"ప్రాక్టీస్ లేకపోవడమా?" కుతూహలంగా అడిగింది కజిన్ సిస్టర్.

"అవును! ఇంతవరకు నాకా అవకాశం- అవసరం కూడా రాలేదు" అమ్మ వైపు ప్రేమగా చూస్తూ అంది తాను. అమ్మమాత్రం ఉరిమిచూసింది తనవైపు.

అతడు కుర్చీలో ఇబ్బందిగా కదిలేడు.

"సంగీతం వచ్చా?"

"చాలా ఇష్టం!"

కొంచెం ఆగి, తానే అంది- "కాని... నేర్చుకో లేదు!"

"అదేం?"

"తీరికలేక"

-ఏమిటీ అర్థంలేని ఇంటర్వ్యూ? ఇంతవరకూ ఎవ్వరూ తననిలా ప్రశ్నించలేదు. ఏదో హక్కు వున్నట్టుగా, బేరమాడుతున్నట్టుగా ఏమిటీ ప్రశ్నలు? చిరాగ్గా చూసింది డాడీవైపు. వీళ్ళకి జవాబులు చెప్పాల్సిన అవసరం తనకేమిటి?

"ఏమడిగినా రావంటున్నారే!" కజిన్ అంది.

ఒళ్ళు మండింది తనకి- "నాకు రానివి వచ్చునని ఎలా చెప్తాను?"

"పోనీ! మీకేం వచ్చు?" అడిగిందామె.

ఎంత ఛాలెంజింగ్‌గా అడుగుతోంది! చూస్తే పల్లెటూరి బెంటులా వుంది. దీనికి నేను జవాబు చెప్పుకోవాలా?

"ఒక విషయం చెప్పు! నీకు పెయింటింగ్స్ వెయ్యడం వచ్చా? ఇంట్రస్టుందా అసలు?" అంది కోపం అణుచుకుంటూ మంజూష.

"ఊహూ! రాదు!"

"ఫొటోగ్రఫీ తెలుసునా? అసలు కెమేరాని ఎప్పుడైనా చూసేవా?" అని అడగబోయి డాడీ మొహం చూసి ఆగిపోయింది.

"ఊహూ!"

"ఎందుకని?"

ఏం మాట్లాడలేదా అమ్మాయి.

బిక్కమొహం వెనుక అర్థంలేని కోపం.

"చూడు! నీ పేరేమిటి? మాధవి అన్నావు కదూ! అన్ని కళలూ అందరికీ రావు. నీకు తెలిసినవాట్ని పట్టుకుని కనబడ్డవాళ్ళందర్నీ ఛాలెంజ్ చేస్తే- ఫూలయిపోతావు! మనుమల్తో మాట్లాడ్డం కాస్త అలవాటు చేసుకో!" అంది టీ తాగిన కప్పు టేబుల్‌మీద పెడుతూ.

"అమ్మో! ఎంత మాటనేసింది?... ఏదో చిన్నపిల్ల... సరదాకి ఏదో అడిగితే...!" ఉక్రోషంగా అంది తల్లి- ఆ అమ్మాయిని దగ్గరికి తీసుకుంటూ.

అమ్మా- నాన్నా కంగారుపడ్డారు.

తనేదో ఇంకా గట్టిగా జవాబు చెప్పబోయి ఊరుకుంది.

అతడు కాస్త ఇబ్బందిగా- కంగారుగా పరిస్థితిని చల్లబరిచే ఉద్దేశంతో అన్నాడు- "అమ్మా! ఏమిటది? మనం ఇక్కడికొచ్చింది అలా ప్రశ్నలు వేసి ఆ అమ్మాయిని హడలగొట్టడానికా?"

చివ్వున లేచి నించుంది తను- "హడలగొట్టడమా? కాదు! అవమానించడం!"

"పరిస్థితి విషమించబోతోందని గ్రహించిన డాడీ అన్నారు- "పోనీండమ్మా...! అమ్మాయి తరపున నేను క్షమాపణ చెప్పుకుంటున్నాను. ఏదో చిన్నపిల్ల. ముద్దుగా పెరిగింది!"

"డా...డీ...!" కోపంగా అరవబోయి లోపలే పళ్ళు నూరుకుంది.

వెంటనే అతడు మాట మార్చేశాడు.

"సాయంత్రం అలా ఎక్కడికైనా వెళ్దామా...? మేం మళ్ళీ రాత్రి మెయిలుకే వెళ్ళిపోవాలి!" తనతో అన్నట్టుగానే అన్నాడు.

తనేం మాట్లాడలేదు. కోపంగా చూసి ఊరుకుంది.

"అన్నయ్యా! అలా షాపింగ్‌కెళ్దాం" మాధవి అంది.

డాడీ అతనివైపు హెల్ప్‌లెస్‌గా చూశారు. అతడు తనవైపు హెల్ప్‌లెస్‌గా చూశాడు.

తను మాత్రం విక్టోరియస్‌గా చూసింది. 'అందరూ కలిసి కట్టకట్టుకుని సముద్రంలో కలవండి' అనుకుంది కసిగా.

అంతా కలిసి ఎటో వెళ్ళివచ్చేరు.

అమ్మా-తనూ ఇంట్లో వుండిపోయేరు.

తన ప్రవర్తన చాలా అసహ్యంగా వుందని వాళ్ళొచ్చేదాకా తిడుతూనే వుంది అమ్మ. జీవితంలో మొట్టమొదటిసారిగా అమ్మ తిట్టడం... అదీ- ఇంత తీవ్రంగా. ఛీ! ఛీ...! మనసంతా పాడైపోయింది. భోంచేయకుండా తన గదిలోకెళ్ళి పడుకుంది.

వెళ్ళేముందు అతడు వచ్చేడు- "అయాం సారీ! ఎక్స్‌ట్రీమ్‌లీ సారీ!"





చివ్వున లేచికూర్చుంది తను.

"మా అమ్మ చాలా వైల్డ్‌గా బిహేవ్ చేసింది. వాళ్లుంటున్నది చాలా చిన్న ఊరు... ఎవరితో ఎలా ప్రవర్తించాలో... వాళ్లకి..." సిన్సియర్‌గా చెప్తున్నాడు.

"ఇట్సాల్‌రైట్" లేచి నించుంది తను.

"వస్తాను!"

చిన్నగా చెయ్యూపింది.

తర్వాత క్రమంగా ఆ విషయం మర్చిపోయింది.

ఇంట్లో కూడా ఎవ్వరూ ఆ విషయం మరి ఎత్తలేదు.

రెండునెలల అనంతరం-

లీజర్‌లో అంతా కాంటీన్ కెళ్దామని క్లాసు బయటికొచ్చేసరికి... ఆశ్చర్యపోయింది.

కారిడార్లో... అతడే!

నిలబడివున్న అతడ్ని చూసి అప్రయత్నంగా ఆగిపోయింది.

అతడు కదిలేడు. తన దగ్గరగా వచ్చేడు.

డార్క్‌కలర్ జీన్స్‌లో వుంది తను.

"హలో! గుర్తున్నానా?"

తనేం మాట్లాడలేదు. చిన్నగా నవ్వి తలూపింది.

"మీతో కొంచెం మాట్లాడాలి"

చాలామంది తనవైపే చూడ్డం గమనించి, అంది- "పదండి! అలా వెళ్లి మాట్లాడుకుందాం"

కాంటీన్‌లో ఇద్దరూ ఓ మూల కూర్చున్నారు.

స్టూడెంట్స్‌తో గొడవ- గొడవగా వుంది. ఎవరెవరో తనను పలకరిస్తూ వెళ్తున్నారు.

"ఇక్కడికన్నా పైన ఏదైనా రెస్టారెంట్‌లో అయితే బావుంటుందేమో! పోనీ! బీచ్‌లో..."

"అక్కర్లేదు! చెప్పండి"

ఒక్కనిమిషం ఆగి అతడన్నాడు- "ఆరోజు జరిగిందానికి మీరింకా బాధపడుతున్నారా?"

"లేదు! ఆ విషయం అప్పుడే వదిలేశాను"

"మీరు నన్నర్థం చేసుకోవాలి!"

"ప్లీజ్! చెప్పదల్చుకున్నదేదో సూటిగా చెప్పండి"

అతనికేం చెప్పాలో, ఎలా చెప్పాలో అసలేం అర్థంకావడంలేదు.

ఎన్నో చెప్పాలని వచ్చేడు. ఇక్కడకొచ్చాక ఈ అమ్మాయి మొహంలోకే చూస్తూ కూర్చోవాల నుంది తప్ప ఏం మాట్లాడాలనిలేదు.

అతని అవస్థ కనిపెట్టి తనే అంది- "ఇక్కడికెప్పుడొచ్చేరు?"

"నిన్న... ఈ రాత్రి వెళ్లిపోతున్నాను..." అన్నాడు వెళ్లడం ఇష్టంలేనట్టుగా.

మాట్లాడలేదు తను. పెన్సిల్‌తో టేబుల్ మీద కనబడని పిచ్చిగీతలు గీస్తోంది.

"ఆరోజు మీ ఇంటికొచ్చి వెళ్లింది మొదలు- అందమైన సాయంత్రాలు బీచ్‌కెళ్లినా, మంచి పిక్చర్‌కెళ్లినా, ఆఖరికి షాపింగ్‌కెళ్లినా ఏదో అర్థంకాని రెస్ట్‌లెస్‌నెస్... ఈ పాతికేళ్ల న జీవితంలో- నా మనసు ఇంత అశాంతికి గురికావడం... ఇదే మొదటిసారి!"

చిత్రంగా చూసింది తాను.

"ఐ మీన్...! నా కింకెలా చెప్పాలో తెలీదు"

ఒక్క నిముషం అతడేం మాట్లాడలేదు.

తర్వాత నెమ్మదిగా అన్నాడు- "మంజూషా! నేనంటే మీ కిష్టమేనా?"

సూటిగా అతని మొహంలోకి చూసింది తను.

నీట్‌గా షేవ్ చేసుకున్న తెల్లని గుండ్రటి మొహం. కళ్లలో ఏదో ఆతృత. లైట్ పీకాక్ బ్లూ టెరీకాట్ షర్ట్‌లో- అదోరకమైన ఆకర్షణ.

కాంటీన్‌లో స్టూడెంట్స్ రద్దీ మరింత ఎక్కువైంది.

వాచ్ చూస్తూ అంది మంజూష... "లంచ్ టైం అయింది. ఇంకా రద్దీ అయిపోతుంది. పదండి! బైటికిపోదాం!"

లేచింది.

అసహనంగా లేచాడతడు.

ఇద్దరూ బయటికొచ్చి నడుస్తున్నారు. ఆడిటోరియం పక్కకొచ్చి ఒక చెట్టుకింద ఆగాడతడు.

మళ్లీ అడిగేడు ఆతృతగా- "ఏం మంజూషా! టెల్‌మీ నేను మీకు నచ్చలేదా?"

నిజానికి తనకేం చెప్పాలో తెలీలేదు.

నవ్వేసింది.

"ప్లీజ్ మంజూషా! నేనడిగిందానికి జవాబు చెప్పండి"

"ప్రస్తుతం నేను ఫైనలియర్లో వున్నాను"

అసహనంగా ఆతృతగా చూసేడతడు.

"పరీక్షలయ్యేసరికి, మరో ఆరేడు నెలలవుతుంది"

ఆశ్చర్యంగా చూసేడతడు- "ఏం మాట్లాడుతోందీ అమ్మాయి?"

"ఆ తరువాత- నేను ఖాళీ. ఇంక పనేంలేదు. చదువు పూర్తయిపోతే...!"

అర్థమైంది.

"ఓహ్! మంజూషా... ఎంత ఇంటెలిజెంట్‌వి నువ్వు" ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని ఆవేశంగా అన్నాడు "ఐ లవ్ యూ మంజూషా! ఐ లవ్ యూ"

ఆటో ఎక్కబోతూ అన్నాడు- "ఆరోజు జరిగిందానికి- మరోసారి రియల్లీ అయాం వెరీవెరీ సారీ!"

"నో! నో! అన్నిసార్లు అనకండి! ఆ విషయం నేనెప్పుడో వదిలేశాను"

తృప్తిగా వెళ్లిపోయాడతడు.

నిజానికారోజు తను హర్టయింది- వాళ్ల ప్రవర్తనవల్ల కానేకాదు... అమ్మ ప్రవర్తనవల్ల...

"ఐ లవ్ యూ!... ఐ లవ్ యూ!! ఐ లవ్ యూ!!"

ఏదో తెలీని ఇన్నాళ్లూ కలగని మధురిమ అతడి స్వరంలో తాను కనుగొన్నది- ఆనాడు...

మరి ఈనాడు!?

ఆ మధురమైన స్వరం, అతడి సుకుమార సున్నిత కంఠధ్వని... ఒక్కసారిగా అంత కరుకుగా కఠినంగా ఎలా మారిపోగలిగింది?

నిన్నటి సంఘటన... ఒక్కసారి మనసంతా కమ్మేసింది!

'ఐ లవ్ యూ' అన్న అర్థమైన గొంతే 'ఆడదెయ్యమా!' అనగలిగిందంటే తానిప్పటికీ నమ్మలేకుండా వుంది.

అతడే ఉద్దేశంతో, అంత కసిగా- అంత మాట అనవలసివచ్చింది?

తానేమీ దెయ్యంలా అతన్ని పీక్కుతినడంలేదే!

వుమెనిష్‌గా ప్రవర్తించడం తప్ప డెమనిష్‌గా ప్రవర్తించడం తనకస్సలు తెలీదే!

ఒకప్పుడు 'ఏంజెల్'వన్న ఆ మనిషికి, తానీనాడు 'డెవిల్'గా కన్పిస్తోందన్నమాట...

ఆవేశంగా నోరుజారిన మాటలా లేదది!

ఎన్నాళ్లనుంచో గూడుకట్టుకున్న గుండెలోని 'అసలు చిత్రం' ఆ మాట రూపంలో వ్యక్తం చేసినట్టు కన్పిస్తోంది.

కానీ... లోపం తనదా?!

అసలు... అసలు నిన్నేం జరిగింది?

ఏమంత ఘర్షణ పడవలసిన విషయం కూడా కాదే!

సడెన్‌గా కన్నీళ్లు ఉబికివచ్చాయి.

అయినా నిన్నటి సంఘటన... ఓహ్! భయానక జ్వాలలతో, కనపడనీయకుండానే మదిని కాల్చేస్తోంది. పొగ కానరాకుండానే కన్నీళ్లు తెప్పిస్తోంది.

దెయ్యం... ఆడదెయ్యం... అదీ- కటువుగా.

నిన్న ఆమాట అతడన్నప్పుడు- ఇద్దరిమధ్యా ఏడడుగుల దూరం కూడా లేదు. అతడితో నేనా తాను ఏడడుగులు నడిచింది?!

నాటినుండి నేటిదాకా కలసి అడుగులేస్తున్న తనని అతడేనా ఇలాంటి మాటన్నది!?... నిన్న ఉదయం-

డైనింగ్ టేబుల్ దగ్గర-

డైరీలో ఆరోజు ఎంగేజ్‌మెంట్స్ బ్రీఫ్‌గా ఓసారి చూసుకొని, డైరీ బ్రీఫ్‌కేస్‌లో పడేసి, టై సర్దుకుంటున్న అతడివంక ఓరగా చూస్తూ... గోముగా అంది తాను "దీపీ! ఈవెనింగ్ బిఫోర్ ఫైవ్ రాగలవా?"

"ఎందుకూ?"

"రావాలి! అంతే!"

"ఏం? శాసిస్తున్నావా?"

తమకం నిండిన కళ్లతో "రావాలి! అన్నానుగా!"

"రాకపోతే?"

"ఛ! ఏం మనిషో? ఎక్స్‌ప్రెషన్స్ అర్థం





చేసుకోవడం కూడా చాతకాదు'' అనుకుంటూనే ''ఓ రొమాంటిక్ వరల్డ్‌టూర్ వెయ్యడానికి నా జతగా నువ్వు రాకపోతే ఎలా?''

''పెళ్లయి, ఇన్నేళ్లవుతూంటే-ఇంకా రొమాంటిక్ టూర్లేంటి?''

''అంటే?!'' ఆశ్చర్యంతో ఆమె భృకుటి ముడిపడింది.

''అర్థం కానంత పసిదానివేం కాదుగా! హాయిగా ఇంటిపట్టున పడుండమే ఆడదానికి- అందునా పెళ్లయిన ఆడదానికి అందం... ఆనందం!''

దివ్యరాం నిజస్వరూపం ఒక్కసారి అవగతమైంది. కళ్లు విప్పార్చి చూసింది.

''అంటే- పెళ్లే ఆడదానికి జీవితపరమావధా?''

''ప్లీజ్ మంజూ! నా కాట్టే టైంలేదు. అనవసరంగా వాదన పెంచకు''

''నో! నాకు రిప్లయ్ కావాలి! చెప్పు! ఎందుకలా అనుకుంటున్నావ్ దివీ?'' ఆతృత- ఆవేదన కలగలిసి ప్రశ్నించింది.

''నా కవతల బిజినెస్ అపాయింట్‌మెంట్స్ చాలా వున్నాయి. తీరిగ్గా రాత్రి డీల్ చేద్దాం- నీ క్వొశ్చన్స్ అండ్ ఆన్సర్స్'' వాచ్ చూసుకుంటూ అన్నాడు.

''నువ్వు మారిపోయావ్ దివీ! బాగా మారిపోయావ్!''

''నీకు అలాగే వుంటుంది! జీవితంలో స్థిరపడడానికి, ఎంత శ్రమించాలో నీకేం తెలుస్తుంది?''

''అంటే!? ఇప్పటికి సంపాయించింది చాలదా?''

''సంపాదన ఒక్కటే జీవితంలో స్థిరపడ్డానికి ముఖ్యంకాదు''

''అలాగే- ముప్పూటలా తిండీ, ఖరీదైన డ్రెస్‌లూ మాత్రమే జీవితంలో థ్రిల్ అనుభవించడానికి ముఖ్యం కావు''

''నానా చెత్తపుస్తకాలూ చదివి, లేనిపోని తలతిక్క తెచ్చుకుంటున్నావ్ మంజూ! ప్లీజ్ అండర్‌స్టాండ్'' ఆగి అన్నాడు దివ్యరాం.

''అర్థం చేసుకోవాల్సింది నువ్వే!'' అంత దూకుడుగానూ అంది మంజూష.

చిలికి చిలికి గాలివానలా మారిన చిన్న విషయం, అకారణంగా పీక్‌స్టేజ్‌కి వెళ్లిపోయిందీ మాటతోనే.

''ఏమిటో అర్థం చేసుకోనేది? రాత్రీ పగలూ అనకుండా కష్టపడుతున్నానుగా! ఇదంతా ఎవరి సుఖంకోసం? ఎవరి ఆనందం కోసం? ఓ పక్క అర్జెంట్ పనిమీద వెళ్తున్నానని చెప్తున్నా అర్థం చేసుకోకుండా ననపెట్టి చంపుతున్నావేమే ఆడదయ్యమా!'' టెంపర్ లూజ్ అయిన దివ్యరామ్ నోట అప్రయత్నంగా అసహనంతో తన్నుకొచ్చిందామాట.

విభ్రాంతితో మ్రాన్పడిపోయింది మంజూష.

దివ్యరాం నోట కలలో కూడా అటువంటి మాటని ఆమె ఊహించనేలేదీనాటిదాకా!

బట్... ఈనాడిది ఊహలో కాదు- వాస్తవంలో జరిగింది.

ఆమాట అతని నోట్లోంచి దూసుకొచ్చిన మరుక్షణం అతడక్కడ లేడు. స్ప్రింగ్‌డోర్ నెమ్మదిగా మూసుకుపోయింది.

ఆ హాల్లో ఆమె ఒక్కతే...
ఎంతోసేపు అలా నిల్చున్నచోటనుంచి కదల్లేకపోయింది.

ఈమధ్య తన చిన్న చిన్న ప్రపోజల్స్‌కి అతడు తిరస్కరించడం ఆమెకేం కొత్తకాదు. అలాగని అతడు తన స్వేచ్ఛకేనాడూ అడ్డురాలేదు. ఎక్కడికి కావాలంటే- అక్కడికి తనను వెళ్లమనేవాడు. ఒక్కోసారి తనకోసం కారు కూడా తీసుకెళ్లేవాడు కాడు. కాని... తోడులేని జర్నీ తనవాడు పక్కనలేని పయనం- ఎంత దూరమైనా దగ్గరైనా ఏమిటో ఏదో వెలితిగా... అది అనిర్వచనీయం. ఎలా చెప్తే అర్థం చేసుకుంటాడీ దివ్యరాం.

వాళ్లమధ్య దూరం పెరగడానికిది నాందీ సూచకమా అన్నట్టు దివ్యరాం వెళ్లిన పావుగంటకే ఇండస్ట్రీనుంచి ఫోన్. ''అయ్‌గారొచ్చేసరికి రాత్రి బాగా పొద్దుపోద్దటమ్మా! ఏదో క్లబ్ మీటింగంట. మిమ్మల్ని వెయిట్ చెయ్యొద్దని చెప్పమన్నారు'' అటెండర్ ఫోన్ చేసినట్టున్నాడు. రిసెప్షనిస్ట్ ఏమైందో. రాగిణిది 'స్వీట్ వాయిస్' అంటూ ఆమెని దివ్యరాం ఎన్నోసార్లు మెచ్చుకుంటూంటే, ఓసారి రాగిణి గొంతు

విన్నాక తానూ అది నిజమేనని ఒప్పుకుంది- మనస్ఫూర్తిగా. కాని దివి... ఈమధ్య మరీ పక్కావ్యాపారాత్మకంగా ఏ పనిచేసినా.

తనతో ఓ చల్లని సాయంత్రం గడపడానికి తీరికలేని దివ్యకి, క్లబ్ మీటింగ్‌కి టైం ఎలా అడ్జెస్టయిందో!? అదీ బిజినెస్‌లో భాగమేమో!

మళ్లీ అంతలోనే, అతడు తన మనసుని తూట్లుగా గాయం చేసిన పదం గుర్తొచ్చి, హృదయం కలుక్కుమంది.

★ ★ ★

ఫ్యాక్టరీ ప్రెమిసెస్‌లోనే, తప్పనిసరి పరిస్థితుల్లో రాత్రులు కూడా వుండిపోవలసివస్తే, కాస్సేపు రిలాక్స్ అవడానికి వీలుగా ఓ చిన్న కాటేజ్ ఎ.సి.తోనహా ఏర్పాటు చేసుకున్నాడు దివ్యారాం. అప్పుడప్పుడు అది వి.ఐ.పి.లకు ఆతిథ్యం ఇచ్చే గెస్ట్‌హౌస్‌గా కూడా పనికొస్తుందని అతడి ఆలోచన.

పన్నెండవుతోంది.

మీట్ అవాల్సిన ఎంగేజ్‌మెంట్స్ అన్నీ చకచకా పూర్తిచేసి, ప్రొడక్షన్ యూనిట్‌లో నంబియార్‌ని పిలిపించి, అతడిమీద వచ్చిన ఫిర్యాదులు విచారించి ఫైనల్‌వార్నింగ్ ఇచ్చి, మరోసారి డైరీ చూసుకున్నాడు దివి.

మధ్యాహ్నం రెండువరకూ రెస్ట్... ఆ తర్వాత ఓ బొంబాయి పార్టీ డిస్ట్రిబ్యూషన్ జోన్ ఫిక్స్ చేసుకోడానికొస్తోంది. వాళ్లతో ఓ టూ అవర్స్ డిస్కషన్ ఉండొచ్చు! తర్వాత- తన క్లోజ్‌ఫ్రెండ్ డాక్టర్ సాధూ, 'నార్త్‌జోన్ డిస్ట్రిబ్యూషన్‌కి తమ వాళ్లెవరో హర్యానాలో వున్నారని వాళ్ళ ఆఫర్ విన్నాకగాని ఏ నిర్ణయమూ తీసుకోవద్దని నాలుగున్నరకి తానే ఫ్యాక్టరీ కొస్తున్నానని, నిన్న ఇంటికే ఫోన్ చేశాడు. అక్కడ్నించి అతడితో క్లబ్‌కి తప్పదు.

తమ ప్రొడక్ట్‌కి మార్కెట్‌లో మంచి గిరాకీ వున్న ఈ తరుణంలో ఆల్ ఇండియా అంతటా డిస్ట్రిబ్యూటర్స్ ఇంట్రస్ట్ చూపించి మరీ తన దగ్గర కొస్తున్న ఈ తరుణంలో తనకి ప్రతీక్షణం విలువైనదే!

పేరుకి రెస్ట్‌టైమేకాని, తనెప్పుడూ దీన్ని వేస్ట్ చెయ్యలేదు. మరో కొత్త ప్రొడక్ట్ పథక రచనమీద కాన్సంట్రేట్ చేస్తూనే వున్నాడు.

అల్మారాలోంచి, న్యూప్రొడక్ట్ మెటీరియల్ సోర్స్ ఫైల్‌తీసి, దీక్షగా చూస్తూ కూర్చున్నాడు.

స్టేట్‌లో 'రామెటీరియల్'కి ఛాన్స్ వున్నా రవాణా సౌకర్యం తక్కువగా వుంది. ప్రత్యామ్నాయ మార్గాలేమిటి? అని ఆలోచిస్తూండగా, చిన్న చప్పుడైతే తల ఎత్తాడు దివ్యారాం.

ఎదురుగా షోకేస్‌లో- మంజూ ఇండస్ట్రీస్‌కి, బెస్ట్ ఇండస్ట్రియల్ స్టాల్ ఆఫ్ ది ఎగ్జిబిషన్‌లో ఇచ్చిన మొమెంట్... ఓ చిన్న తుంటరి చిట్టెలుక, మొమెంటోకున్న చిరుగంటని లాగుతోంది.

'మంజూ ఇండస్ట్రీస్...'

యస్! చాలా వాటిలో బెస్ట్ 'ఎవరిదీ ఇండస్ట్రీ' అని, సాటి పారిశ్రామికవేత్తలంతా నివ్వెరపోయేటంత బెస్ట్.

అవును! ఎవరిదీ పేరు? తన ప్రియాతిప్రియమైన 'మంజూష'ది కాదా?

సిస్టర్ కన్‌సర్న్ కూడా మంజూతోనే స్టార్టవుతాయే- అనుక్షణం ఆమెనే స్మరించేలా.

ఫైలు అప్రయత్నంగానే మూసేసి, అలాగే ఆలోచనలోపడిపోయేడు దివ్యారాం.

గ్రూప్ ఆఫ్ కంపెనీ విస్తరిస్తున్న తొలినాళ్లలో- తానెంత ఉక్కిరి బిక్కిరవుతూ కూడా 'మంజూ'తో సాయంత్రాలు గడిపేవాడు.

కారణం- ఆమెని 'హర్ట్' చెయ్యకూడదనేగా! ఆమె జోవియల్ అట్మాస్ఫియర్‌లోంచి వచ్చిందని ఒంటరితనం ఒక్కసారిగా భరించలేదనీ గ్రహించుకున్నందువల్లేగా!

... ఎంతకాలం? క్రమంగా అలవాటుపడితే, ఆమే సర్దుకుంటుందనుకున్నాడు. కాని సాయంత్రం అయ్యేసరికి వెంటేసుకుని తిరగడం ఎల్లప్పుడూ కుదురుతుందా?

ఇద్దరూ ఒకళ్లనొకళ్లు అనుక్కొర్చుని- ఏ బీచ్‌లోనో, పార్కులోనో పిట్టల్నీ మబ్బుల్నీ పూలవానసల్నీ వెన్నెల గుబాళింపుల్నీ పొగుడుతూ, భావనామయ జీవితమనే ముసుగులో ఆనందిస్తుండడం నిరంతరం సాధ్యమా?

తాను ఆమె ప్రేమని షేర్ చేసుకోలేకపోతున్నాడా? లేక ఆమే తన ధోరణిని వేరే అనుకుంటూ అపార్థం చేసుకుంటున్నదా?

ఎందుకో- ఎప్పుడూ తన చుట్టూ తిరగాలనీ,




తనతో వుండేదే భర్తకి లోకమనీ కోరుకుంటుంది. ఇది తనకి ఫూలిష్ ఫీలింగ్‌గా కనబడుతోంది. ఇది ఆమె దృష్టిలో స్వాంతన... లాలన... తన దృష్టిలో తలతిక్క...!

ఇంతమాత్రానికే తనకి ప్రేమించే దృష్టి ఆవిరైపోయినట్టు బాధపడిపోవాలా? అసలు మంజూకేం తెలుసు? 'ప్రేమ'మీద తనకున్న ప్రేమ ఎంత గట్టిదో!?

ఈరోజు సంఘటనే కాస్త శృతి మించిందేమో!

ఈమధ్య చీటికీ మాటికీ ఇలా గిల్లికజ్జాలు పెట్టుకుంటోందేం? రాన్రానూ మంజూ అలా అర్థం కాకుండా అయిపోతోందేం...?

ఏం కావాలామెకు?

ఒక్కోరోజు ఎందుకంత నిర్లిప్తంగా- నిశ్శబ్దంగా మారిపోతోంది?

తానిలా ఓ డ్యూటిఫుల్ పర్సన్‌లా మిట్టమధ్యాహ్నం అర్ధరాత్రీ ఫ్యాక్టరీలో గడుపుతూ.

అంతకుముందు- తాను బయల్దేరేప్పుడు ఒక్క ముద్దు అయినా ఇవ్వకుండా పంపించేదా? తాను మర్చిపోయినా కాంపెన్సేషన్‌గా ఓ కౌగిలింత.

తను మాత్రం?

తనకీ వస్తూ- వస్తూ ముద్దివ్వాలనీ తీసుకోవాలనీ ఎందుకన్పించలేదు?

ఇంక... ఇలా- నిర్లిప్తంగా ఒకరికొకరు సంబంధం లేనట్టుగా ఒకే ఇంట్లో వుంటూ, అతిసామాన్యంగా గడిపేయాలా...?

తానేదో పోగొట్టుకొంటున్నాడు...

ఏమిటి?.. ఏమిటది?

ఏమిటో అర్థం కావడంలేదు.

మంజూప మామూలు యువతికాదు. అరవిచ్చిన పారిజాత సుమం.. ఒక్కోసారి కాస్త ఆలస్యమైతే చాలు...అలా నిరీక్షిస్తూ విరహోత్కంఠితలా వీధి గుమ్మానికి కళ్లు రెండూ కట్టేసి... అసహనంగా ఎదురు చూపులు.

కానీ మంజూకేం తెలుస్తాయి... ఈ వ్యాపార పారావారంలో ఉవ్వెత్తున ఎగసిపడే అలల్లాంటి రిస్క్‌లు? బిజినెస్‌లో పైకెళ్తున్న కొద్దీ కొన్ని లిమిటేషన్స్ మనకి మనమే విధించుకోవాలని ఆమె ఎలా గ్రహిస్తుంది? అంతంలేని సరదాల ఆకాశంలోకి స్వేచ్ఛగా రెక్కలు విప్పుకొని ఎగిరే విహంగాల్లా విహరించడం కోసం విరజిమ్మగల డబ్బుకి వున్న పవర్ ఆమెకెలా తెలియజెప్పాలి?

తానీ విధంగా మనస్సామెముందు పరిస్తే 'దివీ! యూ ఆర్ నాటె మనీ మెషీన్' అంటుంది.

అదీ తనకి తెలుసు. అంతేకాదు 'డోన్ట్ బి ఏ మని మిషీన్' అని కూడా అనగలదు.

తనకి మాత్రం డబ్బే సర్వస్వమా? కేవలం ఈ హైసొసైటీలో పొజిషన్‌కి ఇదే స్కేల్ అయి కూర్చుంది. ఈ కొలబద్దలో ఎవరికీ అందనంత ఎత్తు ఎవరిదైతే వాళ్లకే గౌరవం, మర్యాదా, మన్ననా అన్నీనూ. బిజినెస్‌లో బిజినెస్‌కి బిజినెస్‌కీ మధ్య ఈ మనీ కేవలం టైమ్‌తోనే లింక్ అయివుంది. అందుకే దీనికింత ఇంపార్టెన్స్ ఇస్తారు బిజినెస్ పీపుల్.

ఈ ఎకనమిక్స్ థియరీలన్నీ ఎవరికెవరు టీచ్ చేస్తూ కూర్చోగలరు? అర్థం చేసుకోగలగాలి అంతే.

ఫ్రస్ట్రేషన్... స్ట్రగుల్... టెన్షన్... నలిగిపోతున్నాడు దివ్యారామ్ ఈ అవస్థల మధ్య.

"మేన్ ఈజ్ బార్న్ ఫ్రీ... బట్.. ఎవ్విరివేర్ హిఈజ్ ఇన్ ఛైన్స్" రూసో అన్నాడా మాట.

ముమ్మాటికీ నిజం! ఎడతెగని బంధనాలు.. ఎటు చూసినా... సన్నగా మెదడులో హెూరు ఉధృతమవుతూన్నట్టు సూచన... నో! ఇక ఆలోచించకూడదు. మళ్లీ ఫైల్ తెరిచాడు స్థిరంగా.

చిత్రం! దృష్టి దానిమీద నిలబడడం లేదు.

★ ★ ★

కాలం నెమ్మదిగా కరుగుతోంది.

తామిద్దరి మధ్యా దూరం త్వరితంగా పెరుగుతోంది.

ఈమధ్య దివి నిరంతరం బిజినెస్ నామస్మరణే చేస్తున్నాడు. జీవితంలో అంతకంటే ముఖ్యమైనవి చాలా వున్నాయని అతనికెలా తెలియజెప్పడం?

ఏ రాత్రికో ఇల్లు చేరితే విడీవిడనట్టు పెదాల చివర ఓ చిర్నవ్వు విసిరిపారేసి... నిస్తే




జంగా కాంక్షా రహితంగా ఫార్మల్‌గా... నార్మల్‌గా.

బెడ్రూంలోకి చల్లగా సువాసనలు మోసుకొస్తున్న పిల్ల తెమ్మెర. గతంలోంచి ఇహంలోకి ఊడిపడింది మంజూష.

ఆల్బమ్‌లన్నీ మళ్లీ బీరువాలో సర్దేసి, పక్క మీద వాలింది చిరాగ్గా.

దూరంగా కారు హారన్... తలెత్తింది.

బాగా దగ్గరై తమ ఆవరణలోనే ఆగిన శబ్దం... లేవబోయింది. మళ్లీ ఆగిపోయింది.

ఎనీవే... తలుపులు తెరిచే ఉన్నాయిగా!

కాలింగ్‌బెల్ మ్యూజికల్‌గా మోగింది. కళ్లు అరమోడ్పులయ్యాయి మంజూషకి.

ఇదివరకు ఆ శబ్దం... తనలోని అణువణువునీ మీటేది.

పట్టలేని ఆనందంతో తాను ఎదురెళ్లి అతన్ని అల్లుకుపోయేది.

అతడూ తననలాగే గట్టిగా హత్తుకొని, ముద్దుపెట్టుకుని లోపలికి తెచ్చేవాడు.

లోపలికి వచ్చేడు దివ్యరాం.

నిశ్శబ్దంగావుంది... ఈమె ఉందా! లేదా! అన్నట్టుగా.

వాతావరణం క్షణంలో అర్థం చేసుకుని, ఒకసారి బెడ్రూంలోకి తొంగి చూసి బాత్రూంలోకి వెళ్లేడు రామ్.

నెమ్మదిగా లేచి, డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చుంది మంజూష అతని కోసం వెయిట్ చేస్తూ.

అది గతం!

మరి ప్రస్తుతం!?

నిట్టూర్చి, మళ్లీ గతంలోకి...

"దివీ డార్లింగ్! భోంచెయ్యవా?" అని అడిగేది తాను.

"ఊహూ!" అలాగే కదలకుండా కళ్లు మూసుకొనేవాడు.

"ఇవాళ నీకిష్టమైన కాలిఫ్లవర్ కర్రీ!"

"ఊఁ!"

"డ్రస్ మార్చుకోవా పోనీ!"

"ఊహూ!"

"నే మార్చనా పోనీ!"

"ఊఁ!"

"లే! మరి!"

లేవకుండా ఇంకా గట్టిగా హత్తుకుపోయేవాడు.

బాత్రూంలోంచి బయటికొచ్చేడు దివ్యరామ్, స్నానం చేసి తల తుడుచుకుంటూ.

"సారీ మంజూ! ఇవాళ అనుకోకుండా నా భోజనం అయిపోయింది! నీకు కంపెనీగా కూర్చుంటాను"

ఆమె లేచింది.

హుఁ! కంపెనీ? తన కంపెనీ లేకుండా స్నానమైనా చేసేవాడా? ఎంత అల్లరి పెట్టేవాడు? ఇప్పుడు దేనికీ తన అవసరంలేదు.

గిన్నెలన్నీ కిచెన్‌లో సర్దేసి మరో గదిలోకెళ్లిపడుకుంది.

నిస్త్రాణగా వెనక్కి వాలేడు రాం.

బెడ్‌లైట్ కాంతి, లైట్ బ్లూ కలర్లో గదంతా ఆక్రమించుకుంది.

మంజూకెంతో ఇష్టం ఈ కాంతి అంటే.

మంజూ... అరె! ఎందుకిలా మారిపోతోందీ మధ్య?

ఈమధ్య తాను కాస్త లేటుగా వస్తున్న మాట నిజమే.

అయినా, ఇప్పుడిప్పుడే విస్తరిస్తున్న ఇండస్ట్రీస్‌నెలా నెగ్లెక్ట్ చేస్తాడు తాను.

ఆ మాటే అంటే "నెగ్లెక్ట్ చెయ్యమన్నానా! దాంతోపాటు అప్పుడప్పుడు నన్నూ గుర్తుపెట్టుకోమంటున్నాను" అందోసారి సరదాగానే నవ్వుతూ.

మరి!?

క్రమంగా ఆమెలో వస్తున్న ఈ మార్పేమిటి?

తానేం తక్కువ చేస్తున్నాడు?

అసలు మంజూ కూడా ఎప్పుడూ తన శ్రమని అప్రిషియేట్ చేస్తుండేది. పోనీ! జలసీయా?

అదీకాదు...

ఆమె స్వేచ్ఛనీ సరదాల్నీ తానెన్నడూ కాదనలేదుగా! మరేం కావాలామెకి? తానేం చె

య్యాలి?

కారు హారన్ వింటూనే పరుగెత్తుకొచ్చి తన చేతుల్లో వాలిపోయేది.

అలాగే ఆమెనెత్తుకొని లోపలికెళ్లేవాడు.

అంత అలసటగా వచ్చిన తనని గుండెల్లోకి తీసుకొని, ఎంత లాలనగా సేద తీర్చేది?

ఈ ప్రపంచంలో తన రాణీ మంజూ, ఆమె ప్రేమా తప్ప ఇంకేమీ అక్కర్లేదనిపించేది.

అలాంటి మంజూ ఎందుకిలా బాధపడుతోందీ మధ్య?

ఎందుకో అర్థంలేని అగాధాలు సృష్టించబడుతున్నాయి తమ మధ్య?

మంజూ! మై క్వీన్! ఎందుకిలా దూరమైపోతున్నావ్?

సన్నగా వణికిందతని హృదయం.

ఏదో చెయ్యాలి తాను... గబుక్కున లేచాడు.

నెమ్మదిగా బెడ్రూంలోంచి బైటికొచ్చి, ఆమె పడుకున్న గదివైపు కదిలాడు.

అక్కడ...

సన్నగా మామూలు బెడ్‌లైట్ కాంతి.

ఈ కాంతి అంటే ఆమెకెంతో చిరాకు.

బ్లూలైట్‌లో మంజూ ఎంతో రొమేంటిగ్గా వుండేది. కర్టెన్ తొలగించి చూసేడు.

హాయిగా కళ్లు మూసుకు నిద్రపోతోందా?

నిద్రపట్టక దొర్లుతోంది మంజూష.

ఆ చిన్న లైటు తన కళ్లలో పడుతూంటే మరింత చిరాగ్గా వుంది.

ఆర్పేద్దామంటే చీకట్లో పడుకోలేదు తాను.

ఆ బ్లూ లైట్... ఆ బ్లూ అట్మాస్ఫియర్... ఎంత రొమేంటిగ్గా వుంటుంది? ఎంత సైలెంట్ అండ్ పీస్‌ఫుల్‌గా వున్నట్లనిపిస్తుంది.

ఏం చేస్తున్నాడీ దివ్యరామ్?

ఎంతో అలసటగా, చిరాగ్గా, నిద్రపట్టక తన లాగే ఫీలవుతున్నాడా?

ఆలోచనలతో అలసిపోతోందామె మనసు.

ఏదో విరక్తితో నిండిపోతోంది.

గది బయట పాదాల చప్పుడు... దివి... తన దివ్యరామ్.

అంతలోనే అతడు వెనక్కి వెళ్లిపోతున్న అడుగుల చప్పుడు.

తన గురించి అతనెందుకాలోచిస్తాడు? క్షణాలు కరిగి గంటల్లో కలిసిపోతున్నాయి.



ఫోన్ మోగుతోంది...

చేస్తున్న ఎంబ్రాయిడరీని పక్కనపెట్టి, లేచి వెళ్లి ఫోనందుకుంది మంజూష.

"హలో!"

"హలో! మంజూ! సాయంత్రం కాదంబినీ దేవి ప్రోగ్రాం వుంది..."

"..."

"చెప్పవేం?"

"...."

"హలో! వస్తావా?"

"రాను!"

"వస్తావా... ట... వస్తావా!" నాన్సెన్స్ మనసు చిరాకుపడింది.

"రావా! అదేం?"

"..."

రడీగా వుండు! వచ్చి తీసుకెళ్తాననొచ్చుగా! లేకపోతే కారు పంపిస్తాననొచ్చుగా! అదీ కుదరకపోతే, తననే ఏ టాక్సీలోనో డైరెక్టుగా ఆడిటోరియానికి వచ్చెయ్యమనొచ్చుగా! అంటే తనొచ్చినా, రాకపోయినా అతడు వెళ్లాలనేగా!

"హలో! మంజూ! వందేసి రూపాయలు పెట్టి రెండు టికెట్స్ కొన్నాను"

'ద హెల్ విత్ యువర్ బ్లడీ టికెట్స్' అర్థం





లేని కసి మనసులో...

"..."

"వంద రూపాయలు వేస్ట్! ఏం చేయను?"

సముద్రంలో దూకు! అనబోయి, అనలేక ఫోన్ పెట్టేసింది.

★ ★ ★

ఎంత పొగరు? ఎందుకిలా మారిపోతోంది మంజూ ఈమధ్య? లోపం ఎక్కడుంది? ఎవరిలో వుంది? దివ్యరామ్‌కి ఆమె స్థితి అయోమయంగా వుంది.

ఓపెనెయిర్‌లో చల్లగా వుందిక్కడ.

చుట్టూ రంగురంగుల లైట్లు డిమ్‌గా వెలుగుతూ ఆరుతూ వున్నాయ్.
వేదిక మీద ఎర్రటి తెర.
ఆ తెర ఎప్పుడు తొలగుతుంది?
అశాంతితో మండుతోందతని హృదయం!
ఎట్టకేలకు
కళ్లు చెదిరేలా, తెర తొలగింది...
అటెన్షన్‌లో కూర్చొని, ఎలర్ట్‌గా ఆసక్తిగా చూసేడు దివ్యరామ్.

సింధూరం రంగు డ్రస్‌లో సత్యభామలా ప్రత్యక్షమైంది కాదంబినీదేవి అందమైన మందారంలా.

అలసిన హృదయాల్ని సేదదీర్చే పిల్ల తెమ్మెరలా సాగిపోతోందామె నాట్యం! ఊహకందని భావతరంగంల్లా నేర్పు, ఆకర్షణ, అందం, ముఖ కవళికలతో ప్రేక్షకుల్ని తనవైపు తిప్పుకుంటోంది. తనలోకి లాక్కుంటోంది ఆమె.

ఎంతోమంది హృదయాల్లో అందంగా నిద్రపోయే ఈ శృంగార నాట్య సజీవ శిల్పాన్ని ఇన్నాళ్లూ తానెందుకు చూడలేదు?

ఈ నిరుపమాన సౌందర్య చైతన్య లహరిని ఇన్నాళ్లూ తానెందుకు దర్శించుకోలేదు?

ఆమె వేస్తున్న ప్రతి అడుగూ... ఆ అందెల రవళీ... తనలో నిద్రపోతూన్న భావతరంగాల్ని తట్టిలేపుతున్నాయి.

సందేహంలేదు...
ఏయే లోకాల్లోంచో తనకోసమే దిగి వుంటుంది.
కావచ్చు!...

తనను గుర్తించి, నర్తనతో తనతో రమ్మని పిలుస్తోంది.

అస్పష్ట భావతరంగాల్లో అతని హృదయం కొట్టుకుపోసాగింది.

నాట్యం ఆగింది!

ఆ తటిల్లత ఆగింది...

తనకోసం వచ్చిన దేవత తెర వెనక్కి వెళ్లిపోయింది...

ఆగకుండా చప్పట్లు...

తప్పదన్నట్టుగా లేచాడు దివ్యరామ్.

ఆడిటోరియం బాల్కనీలో పచార్లు చేస్తూ... అసహనంగా.

నిద్రలో నడుస్తున్న వాడిలా, స్టేజి పక్కనుంచి గ్రీన్‌రూంలోకి అడుగుపెట్టాడు.

డ్రెస్ మార్చుకుని కథక్ డ్రస్‌లో వుందామె.

అద్దం ముందు కూర్చొని హెయిర్ స్టయిల్ మార్చుకుంటోంది.

ముఖం కడుక్కొని, తువ్వాలుతో మెత్తగా అద్దుకుని కనుబొమలు దిద్దుకొని లిప్‌స్టిక్ దిద్దుకోబోతూ అద్దానికి దగ్గరగా మొహం పెట్టింది.

ఇంత దగ్గరగా ఆమెను చూస్తుంటే ఎంత బావుంది?

యుగాల తరబడి ఎడారిలో నడిచొచ్చిన మనిషి చుట్టూ జలపాతాల మధ్య వున్నట్టుగా ఎంత ప్రేమగా పిలుస్తోంది తనలోకి రమ్మని.

"ఎవరు మీరు?"

తుళ్లిపడ్డాడు దివ్యరామ్.

ఎవర్ని?... తననేనా? తనకోసం వచ్చిన దేవతేనా ఇలా ప్రశ్నిస్తోంది?

"ఏమిటలా చూస్తారు? ఎలా వచ్చేరు లోపలికి? వచ్చేటప్పుడు డోర్ కనీసం నాక్ చెయ్యాలని తెలీదూ? ఎవరక్కడా? ఉమా! శోభా!"

అంత ధాటీలోనూ, కోపంగా అరుస్తున్న కోయిలలా వుందామె గొంతు.

"అయాంసారీ! ఎక్స్‌ట్రీమ్‌లీ సారీ!"

వెనక్కొచ్చేశాడు నిరాశగా... మళ్లీ ఈ చీకట్లోకి.

కానీ ఏదో ఒక అద్భుతమైన దృశ్యాన్ని

చూసిన తృప్తి మెరుస్తోందతని ముఖంలో కనీకన్పించకుండా.

అతనికి మళ్లీ సీట్లో కూర్చోవాలనిపించలేదు.

స్టేజీ పక్క క్రీనీడలో నిల్చున్నాడు.

"ఎక్స్‌క్యూజ్‌మీ!"

వెనక్కి తిరిగి చూశాడు.

పరికిణీ, వోణీలోవున్న ఓ పద్దెనిమిదేళ్ల పిల్ల... బహుశా ఏ ఉమ లేదా శోభ అయ్యింటుంది.

"మేడమ్ రమ్మంటున్నారు మిమ్మల్ని"

మంత్రముగ్ధుడిలా ఆ పిల్ల వెనకే నడిచాడు గ్రీన్‌రూంలోకి.

ఫుల్ మేకప్‌లో వల్చటి మేలిముసుగు వేసుకు కూర్చొనివుంది కాదంబినీదేవి.

"కూర్చోండి!"

అక్కడున్న కుర్చీలో కూర్చున్నాడతడు.

"క్షమించాలి! నేనర్థం చేసుకోగలను. స్పందించే ప్రతి హృదయానికీ ఆర్టిస్టుని కలవాలనే వుంటుంది. కానీ అలా నాక్ చెయ్యకుండా వచ్చేస్తే, నాక్కోపం వస్తుంది, ఇంట్లోనైనా సరే!"

"అయాంసారీ! నేనసలు అనుకోలేదు"

"ఇట్సాల్‌రైట్! నేనర్థం చేసుకోగలను. ఆఁ! ఇప్పుడు చెప్పండి మీరేం చేస్తుంటారు?"

"అయాం ఏన్ ఇండస్ట్రియలిస్ట్! మంజూ ఇండస్ట్రీస్ అండ్ 'సిస్టర్‌కన్‌సర్న్సు'"

"ఐసీ!" అని ఇంకేం అడగాలో తోచక, సంభాషణ నాట్యం మీదకి మరల్చింది కాదంబినీదేవి.

"నా నాట్యం చూడ్డం ఇదే మొదటిసారా?"

"అవును! మీ నాట్యంలో ఏదో ఊహాకందని అద్భుతశక్తి వున్నట్టు నాకన్పించింది!"

"అదంతా మీ అభిమానం! మీలాంటివాళ్ల ఆపేక్షాభిమానాలే మమ్మల్ని ముందుకు నడిపించాలి"

స్టేజిమీద ఐటమ్ పూర్తయింది.

తరువాత కాదంబిని కథక్.

లేచి నిలబడ్డాడు రామ్.

"కాదంబినీదేవీ! మిమ్మల్నిలా కలుసుకోవడం ఎంతో ఆనందంగా వుంది. మీతో ఎన్నో మాట్లాడాలని వుంది. మళ్లీ మిమ్మల్నెప్పుడైనా తీరిగ్గా కలిసే అవకాశం ఇస్తారా?"

"తప్పకుండా! మీ పరిచయం నా అదృష్టం!" తన విజిటింగ్ కార్డ్ తీసిచ్చింది.

"వచ్చేముందు ఫోన్ చేసి మరీ రండి! ఓకే!?"

"థాంక్యూ! గుడ్‌నైట్!" ఏదో అపురూపమైన వస్తువుని వదిలి వెళ్తున్నట్టుగా, ఆమెవైపు చూసి గబగబా వచ్చి తన సీట్లో కూర్చున్నాడు.

కథక్ భంగిమల్లో స్టేజిమీద కాదంబిని.

★ ★ ★

రాత్రి ఎనిమిదైంది...

మధ్యాహ్నంనుంచి కంటిన్యువస్‌గా చేస్తున్న ఎంబ్రాయిడరీని సగంలోనే ఆపేసి లేచింది...

లోపలికొచ్చి ఫ్రెష్‌గా స్నానం చేసి, బాల్కనీలో కెళ్లి కూర్చుంది మంజూష.

మత్తుగా నైట్ క్వీన్ పరిమళం.

చల్లటిగాలి...

అలలు అలలుగా దూరంగా సముద్రపు ఘోష.

నెమ్మదిగా ఆమె నరాల్లోని టెన్షన్ సర్దుకుంటోంది. మనసు ఒక ఆర్డర్‌లోకి వస్తోంది.

దూరంగా కారు హారన్.. అరె! తమదే!

ఏమిటీ వింత? ఇంకా ఎనిమిదే అయింది. రామ్ ప్రోగ్రాంకి వెళ్లలేదా మరి!? ఎందుకని? ఏమో!

అవును! తను లేకుండా ఎలా వెళ్తాడు? అంతలోనే చిన్న గర్వరేఖ ఆమె ముఖంలో... ఎంతయినా దివి తన వాడు. తన హృదయం ఎరిగినవాడు.

రామ్! దివీ! నాకోసం వచ్చేశావా రామ్?

ఎంతో అలసటగా వస్తుంటాడేమో! దివీ! నా దివీ! ఏదో ఆక్రోశం.

ఇంటి ముందాగింది కారు.

దిగి, గబగబా లోపలికొచ్చాడు అటెండరు.

ఒక్కసారిగా ఆమెలోని టెన్షనంతా డౌనయి







వాహ్వా - అద్భుతం - ఇది నిజంగా
పళ్ళపొడా లేక పేస్టా -
ఎంతనురుగు ఎంతబావుంది రుచి
అచ్చం పేస్టులా వుందే!

# జెమిని

## పళ్ళపొడి




తయారీదారులు
జెమిని కెమికల్ ప్రొడక్ట్స్ (ఫర్మ్)
పోస్టుబాక్స్ నం. 7, గొడుగుపేట మచిలీపట్నం-521 001

# తెల్లటి మచ్చలు



నిరంతరశ్రమ ఆవిష్కరణ తరువాత తెల్లమచ్చలకు మందు కనుగొనబడినది. వైద్యము ప్రారంభించిన కొద్ది దినములకే మచ్చయొక్క రంగుమారి నెమ్మదిగా శరీరపురంగులో కలిసిపోవును. ''మొదట పరీక్షించి చూడండి'' స్కీముకింద 7 రోజుల మందు ఉచితముగా ఇవ్వబడును. మీరు రకరకాల మందులు వాడి నిరాశ చెందినచో ఒక్కసారి మా మందు వాడిచూడండి. రోగి వయస్సు మరియు మచ్చయొక్క పూర్తి వివరములు వ్రాయండి.

# తల వెంట్రుకలు రాలుట, నెరయుటకు చికిత్స

జుట్టును డై చెయ్యనవసరంలేదు. మా ఆయుర్వేద చికిత్స (ఆయిల్)వల్ల తెల్లవెంట్రుకలు మామూలు నలుపు రంగులోనికి మారి స్థిరంగా నిలుస్తాయి. జుట్టు రాలిపోకుండా కాపాడి జుట్టు రాలిన ప్రదేశాన కొత్త జుట్టు వస్తుంది. ఇది మెదడును చల్లబరుస్తుంది. ఒక కోర్సులో 3 పైల్స్ ధర రూ. **80/-** పోస్టేజి మరియు ప్యాకింగ్ అదనం.

**Shyam Ayurved Bhavan ( C-93)**
**P.O. Katri Sarai (Gaya)**

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✱ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

--- కూపన్ ---

... అక్టోబర్ చతుర నవల 'చైత్రంలో చిరుజల్లు'.........

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................

పోయింది.

"ఏమైంది? ఆయనేరీ?"

"రాలేదు... డాన్స్ ప్రోగ్రాంకి వెళ్లేరు. కారు మీరెక్కడికైనా వెళ్తారేమో అని ఇచ్చి రమ్మన్నారు"

"ఎవరి కారులోనో?" అని అడగబోయి ఊరుకుంది. అయినా ఎవరి కారులో వెళ్తే తనకేం?

బాల్కనీలో అసహనంగా పచార్లు చేస్తోంది ఎవరి మీదో... ఎందుకో... ఏమిటో... అర్థం కానంత కసి.

ఈ నిశ్శబ్దాన్ని... ఈ జడత్వాన్ని... ఈ అశాంతిని బద్దలు చేసెయ్యాలి.

ఈ నక్షత్రాలు... గ్రహాలు... గోళాలతో బిలియర్డ్స్ ఆడాలి.

ఒక్కసారిగా ఈ విశ్వమంత ఎదిగిపోయి ఈ గ్రహగోళాల్ని దగ్గరగా చేర్చి, ఒక్కసారి... ఒకే ఒక్కసారి స్ట్రయిక్ చేసెయ్యాలి. ఒక్క స్ట్రోక్‌కే అన్నీ తుక్కు తుక్కయిపోయి అగాధాల్లో పడిపోవాలి.

ఇది స్పేస్ ఫీల్డా? ఏ డైమన్షనూ లేని స్థితిలో తానెలా నిలబడివుందిక్కడ?

అరె! సుదూరంగా అక్కడ దివి... ఇక్కడ తాను.

ఇద్దరి మధ్యా పెద్ద ఎడారి.

ఎడారికి అవతలి అంచున దివ్యరాం...

ఇవతలి అంచున మంజూష...

ఎడారిలో భూమి చీలిపోతుంది... ఇసుకమేటల స్థానంలో లోతైన అగాధాలు...

ఆ చివర రామ్... ఈ చివర మంజూ...

కలవని సమాంతర రేఖల్లా...

కలిసినందుకు పగిలిన జీవన శకలాల్లా...

శకలాల మధ్య వికలంగా తాను...

చుట్టూ గాభరాగా చూస్తూ జనం... ప్రవాహంలా జనం... ఎటువైపు చూసినా జనం...

తరతరాలుగా ఒక స్త్రీని హింసించడంలో ఆనందాన్ననుభవిస్తున్న జనం...

ఎటుపోవాలి?...

తననెవరూ తీసుకెళ్లడానికి రారేం?...

ఒకరు తీసుకెళ్లేదేమిటి? తానే వెళ్లగలదు...

కాని ఎక్కడికి... ఎవరి దగ్గరికి?

అసలు తన వారెవరు?... అరె చిత్రం! ఇంతకీ తన పేరు!...

ఓహ్! మంజూషకదూ!...

గుప్తనిధిలా ఈ రత్నమంజూష... అలా కాలగర్భంలో, మట్టిపొరలలో కూరుకుపోయి మరుగునపడిపోవలసిందేనా?

నో! అలా పడిపోదు!...

ఒక్కసారి తల విదిలించినా, భరించలేని టెన్షన్‌తో తలగడలోకి మొహం దూర్చింది మంజూష...

ఈ ప్రేమలు, అనురాగాలు, ఆత్మీయతలు... ఇవన్నీ నాన్సెన్స్.

ఈ హ్యూమన్ రిలేషన్‌షిప్ అనేదంతా ట్రాష్!...

సడన్‌గా...

ఏ హిట్లర్‌లాగో... ఓ నెపోలియన్... ఓ చెంఘిజ్‌ఖాన్‌లాగానో విజృంభించి కనబడ్డ వాళ్లందర్నీ చీల్చి చెండాడెయ్యాలి... వాళ్లెందుకలా ఉండేవారో ఇప్పుడర్థం అవుతోంది...

ఏదో చేసెయ్యాలి!...

తనకేవో థ్రిల్స్ కావాలి!

నో... నో... నో...!

అఖండమైన ప్రేమ కావాలి!

మండే తన హృదయాన్ని చల్లగా నిమిరే నిండైన హృదయం కావాలి. తన ఆనందం పంచుకోడానికి స్పందించే హృదయం కావాలి! అర్థం చేసుకుని ప్రోత్సాహపరిచే సహృదయం కావాలి. మనస్ఫూర్తిగా తనని 'ఐలవ్‌యూ' అనగల హృదయం...

లవ్!... లవ్!!... లవ్!!!...

ప్రేమించే హృదయం...

అమ్మానాన్నా తననెంతో ప్రేమిస్తారు... ఇలా అనరుగా!

దివ్యరామ్ అనగలడు... కానీ ఒకప్పుడు... ఇప్పుడూ అంటాడు ఏదో యాంత్రికంగా.

అదికాదు... అలాక్కాదు... తనక్కావలసింది అలాక్కాదు...

మనసావాచాకర్మణా

తన దివ్యరామే దివ్యగంధర్వుడిలా కొత్తగా దిగివచ్చి తన హృదయవీణనిశృతి చేయాలి.

తాను నమ్మలేదు... అతడిది వేరే ప్రపంచం...

ఏమిటో ఈ మాయ!... అలవాటైపోయిన అనురాగపాశాలు వెనక్కులాగుతూనే వుంటాయి.

నో!... తనకిక తిరోగమనమే శరణ్యమా?...

మంజూష వెనుదిరగదు... ఆమె మొదట్నుంచీ ఫార్వర్డే...షి నెవర్ లుక్స్ బ్యాక్!... మార్పు... ది న్యూ ఛేంజ్ విల్ కమ్! రావాలి! ఏదో అద్భుతమైన మార్పు జరిగి, తన జీవితపథాన్ని మార్చెయ్యాలి!

ఈ ఇంట్లో ఇంక ఒక్కక్షణం ఉండకూడదు.

గబగబా బాల్కనీ మెట్లు దిగి, తానెంతో ఆర్టిస్టిక్‌గా తన టేస్ట్ అంతా వ్యక్తమయ్యేలా రూపొందించుకున్న చిన్న గార్డెన్‌లోకి పరుగెత్తింది.

ఈ ఇంటికి సంబంధించిన ఏ జ్ఞాపకం, తనని బాధించని చోటుకెళ్లిపోవాలి.

కారు దగ్గరికెళ్లి ఫోర్స్‌గా డోర్ తెరిచి, స్టీరింగ్ ముందు కూర్చుంది.

ఒక్క ఉదుటున కారు స్టార్ట్ చేసింది మంజూష.

అప్‌లేండ్స్ రోడ్ డౌన్ దిగుతోంది కారు.

రకరకాల లైట్లతో సిటీ అంతా అందంగా మెరిసిపోతోంది.

డౌన్‌దిగి ప్లెయిన్ రోడ్ మీదుగా రైల్వేస్టేషన్ వైపు దూసుకుపోతోంది.

అక్కడ్నించి మళ్లీ వెనక్కితిప్పి, బస్ కాంప్లెక్స్ వరకు రాగానే లెఫ్ట్‌కి టర్న్ చేసింది ఫోర్స్‌గా.

స్పీడ్‌గా అరవైలో పోతోంది కారు.

మళ్లీ సడన్‌గా లెఫ్ట్‌కి తిప్పి, హైవే మీదుగా పోనిచ్చింది.

ప్లెయిన్‌గా విశాలమైన రోడ్డు.

ఏక్సిలరేటర్‌ను మరింత గట్టిగా...

డెబ్భై... ఎనభై... మళ్లీ సడన్‌గా, ఇంకోసారి లెఫ్ట్...

రైల్వే కాలనీ దాటి, న్యూ కాలనీ దాటి.. తిన్నగా...

మళ్లీ లెఫ్ట్... ప్లెయిన్ అండ్ స్ట్రెయిట్ రోడ్... స్పీడ్‌గా... కొంపదీసి ఇది వన్‌వే కాదుగదా!

అయితే మాత్రం? తననేం పట్టుకొని ఉరితీస్తారా? అంతగా అయితే, పట్టుకున్న వాడికెంతో అంత పారేస్తే సరి...

స్పీడ్‌గా... రాష్‌గా...

ట్రాఫిక్ రూల్స్‌తో సంబంధంలేనట్టు వీరవిహారం చేయిస్తోంది.

కాంప్లెక్స్ దాటి, అప్ ఎక్క సాగింది.

జంక్షన్ వరకు వచ్చి రైట్‌కి... నో! నో!... లెఫ్ట్‌కి...

వద్దు! ఇక నో లెఫ్ట్! నో రైట్! గో స్ట్రెయిట్...

యస్...స్ట్రెయిట్‌గా పోవడమే.

కొద్దిగా స్లో చేసి, జంక్షన్‌లో సర్కిల్ చుట్టూ తిప్పి స్ట్రెయిట్‌గా పోనిచ్చింది.

ప్లెయిన్‌గా, నీట్‌గా, విశాలంగా యూనివర్సిటీ రోడ్డు.

బారుగా మెర్క్యురీ లైట్లు..: చక్కని క్వార్టర్లు... ఆర్ట్స్ కాలేజీ దాటి, తిన్నగా డౌన్ దిగింది.

హొటల్ పామ్‌బీచ్... అక్కడ్నుంచి ఒక్క లెఫ్ట్, చిన్న రైట్ టర్న్‌లతో బీచ్ రోడ్డుని అందుకుంది.

భీమిలీ వెళ్లే బీచ్‌రోడ్..

స్పీడ్‌ను మరికాస్త పెంచింది. మున్సిపల్ లైట్లు లేవు. దూరంగా... నల్లగా దయ్యంలా సముద్రం.. హొరుమంటూ.

సముద్రం మీంచొచ్చే చల్లని గాలి.

జుట్టు ముఖం మీద అస్తవ్యస్తంగా ఎగుర్తోంది... ఆమె మానసిక స్థితికి తగ్గట్టుగా.

అక్కడక్కడ జాలరి వాళ్ల గుడిసెలు... పాడుబడ్డ ఏవో శిథిలాలు... ఎదురుగా భారీ లోడ్‌తో వస్తూ ఓ లారీ... వ్యూమిర్రర్‌లోంచి చూస్తే, వెనకనుంచి భీమ్లీ వెళ్లే ఆర్టీసీ బస్సు.

తప్పనిసరిగా స్లో చేసి, బాగా సైడ్‌కి తీసుకెళ్లింది కారు.

మళ్లీ స్పీడుగా స్టార్ట్ చేసింది.

ఈ ప్రపంచమంతా ఏకమైపోయి, తనమీద




యుద్ధం ప్రకటించినా, తనొక్కర్తీ నిలబడగల దు.

తనకెవ్వరి సహాయం అక్కర్లేదు. ఎవ్వరూ తననర్థం చేసుకోడానికి కష్టపడక్కర్లేదు.

ఎవ్వరితోనూ దేనితోనూ పోల్చలేని అద్భుత మైన వ్యక్తిత్వం తనది!

కారు ఘాట్‌రోడ్డు మీంచి పోతోంది.

నల్లటి కాటుక ముద్దలా సముద్రం... రోడ్డు అంచున పిట్టగోడ.

రాష్‌గా పోయి, గోడకి డాష్ ఇస్తే?!

స్మాష్! కారు దొర్లుతూ అఖాతంలోపడి... నో! నో! మధ్యలోనే తల్లక్రిందులై... పెట్రోలు మంటల మధ్య తాను... న...జీ...వ...ద...హ...నం!?

నో! అంత హీనమైన చావు! అన్‌వాంటెడ్!

ఎంతో ఆవేశంగా వున్నప్పటికీ, క్షణకాలంపాటు చిన్నగా జలదరించిందామె.

ఎవరో ఫారిన్ కపుల్‌వున్న ఇంపాలా, పక్క నించి వెళ్లిపోయింది.

ఎదురుగా 100కి.మీ. స్పీడ్‌లో రాష్‌గా వస్తున్న ఓ బులెట్.

తన ఫియెట్‌కి అరంగుళం దూరంలో దూసుకెళ్లిపోయింది.

''బాస్టర్డ్! అంత స్పీడ్‌లో పోతే, కుక్కచావు ఛస్తావురా!'' తనకు తెలీకుండానే పైకే అనేసింది మంజూష.

ఘాట్ దిగి ప్లెయిన్‌గా పోతోంది.

ఎనభై దాటింది స్పీడ్...

ప్రోగ్రాంనుంచి దివి వచ్చేస్తుంటాడా ఈపాటికి?

మళ్లీ ఘాట్‌రోడ్డు... నేర్పుగా మలుపు తిప్పింది... రెండో మలుపులో... అదే స్పీడ్‌తో వస్తున్న స్కూటర్

క్షణంలో... పది గజాల్లోకి వచ్చేసింది... స్పీడోమీటర్లో ముల్లు గబగబా...

సెకన్లు...

నమ్ స్ప్లిట్‌ఆఫ్ సెకన్స్...

ఏక్సిలరేటర్ మీంచి తీసిన పాదం.. గట్టిగా బ్రేక్ మీదకి... ఏది ముందో, ఏది తర్వాతో చెప్పలేనంత స్పీడ్‌గా...

ఎనభై మైళ్ల స్పీడ్‌ని, సెకనులోని వెయ్యోవంతు అటాక్ చేసింది...

పెద్ద జర్క్... కారాగిపోయింది...

బాధగా, భయంగా అయోమయంగా స్టీరింగ్ మీద వాలిపోయింది మంజూష.

స్కూటర్ మీది వ్యక్తి గట్టిగా అరుస్తూ, కొండవైపు పడిపోయాడు. స్కూటర్ క్రాస్‌గా కారు కుడి భాగాన్ని రాసుకుంటూ, మెలికలు తిరుగుతూ పిట్టగోడను గుద్దుకొని పక్కకు పడిపోయింది.

కొన్ని సెకన్లపాటు మహా నిశ్శబ్దం...

తుఫాను ఆగింది...

ఆవేశం చల్లారింది...

యుద్ధ విమానాల రొద తగ్గింది...

వార్ తర్వాత ప్రశాంతత..

కళ్లు తెరిచింది మంజూష...

నిశ్శబ్దంగా, నిశ్చలంగా చుట్టూ చీకటి...

నెమ్మదిగా ఘోషిస్తూన్న సముద్రం...

ఒక్కక్షణంలో...

ఏం జరిగిందో గుర్తుకు తెచ్చుకునేందుకు ప్రయత్నించిందామె.

ఆగిపోయిన ఆమె ఆలోచనలు, నెమ్మది నెమ్మదిగా, చకచకా కదిలాయ్...

చటుక్కున తలుపుతీసి, కారు దిగి గబగబా అతడెవరో పడినవైపు నడిచింది.

చిన్న రాయిపక్కన బోర్లా పడివున్నాడతడు.

అతనిలో చలనం ఉందోలేదో, దెబ్బలేం తగిలాయో చూడాలన్నా చీకట్లో అసలేం కనబడ్డంలేదు.

చెయ్యి అందుకుని పల్స్ చూసింది.

కాస్త వేడిగా చెమటగా తగలడంతో, ముందుకు వంగి భుజం పట్టుకొని పక్కకు దొర్లించింది.

చిన్నగా మూలుగుతూ వెల్లికిలా తిరిగాడు.

హమ్మయ్యా! ఫర్వాలేదు!

నెమ్మదిగా అతని చెయ్యిపట్టి ముందుకు లాగింది, కూర్చోపెడదామని.

అబ్బో! చాలా బరువుగా వున్నాడే.

అతడు కోపరేట్ చేస్తే తప్ప లేపడం కష్టం.

''ప్లీజ్! నెమ్మదిగా లేవండి!'' చెప్పుందించింది.



"ఊఁ!" అని చిన్న మూలుగు.

అతనికి స్పృహ వున్నట్టులేదు.

★ ★ ★

చివరి ఐటెమ్‌గా ఒడిస్సీ నృత్యం పూర్తయింది.

అందరూ ఎవరి వెహికల్స్ మీద వాళ్లు వెళ్లిపోయేరు.

దివ్యరామ్ హృదయంలో, నయనాల్లో కాదంబినీదేవి రూపం...

ఆమె అలా నిలిచిపోయింది...

ఎంత అందం!

ఎంత టాలెంట్!!

ఎన్నిరకాల నాట్యాలు చేసింది!!

వండ్రఫుల్ వుమెన్.

ఆలోచనల నిండా ఆమె! ఆమె!! ఆమే!!!

ఇంటిముందు టాక్సీ ఆగింది.

చిన్నగా ఈలవేస్తూ, హుషారుగా లోపలికొచ్చేడు రామ్.

రెండు కళ్లకీ చెయ్యి అడ్డం పెట్టుకొని, నుదుటి మీదుగా మరో చెయ్యివేసుకుని, వెల్లకిలా పడుకుని వుంది మంజూష.

పూర్ మంజూ... ఎంతమంచి ప్రోగ్రాం మిస్సయిందీవేళ.

కాదంబినీదేవి ప్రోగ్రాం అంటే, ఆమెకెంతో ఇష్టం.

ఏదో సిల్లీగా పంతంతో అంత మంచి ఛాన్స్ పోగొట్టుకుంది.

చిన్నగా కూనిరాగం తీస్తూ, షవర్ ఓపెన్ చేశాడు.

చల్లటి నీళ్లు మీదపడగానే హాయిగా అన్పించింది. మరింత ఉత్సాహంగా అర గంటసేపు స్నానం చేసి, టవల్ చుట్టుకుని బయటికొచ్చేడు.

ఫ్రెష్‌గా, రిలీఫ్‌గా... మైండ్ అండ్ బాడీ...

లుంగీ కట్టుకుంటూ ఆమెవైపు చూశాడు.

ఆమె పక్కనే బెడ్‌మీద కూర్చొని, చేతులు తీసేస్తూ అన్నాడు "మంజూ!" అని ఎంతో స్వీట్‌గా.

"మంజూ! భోంచేద్దామా?" చాలా ప్లెజంట్‌గా అన్నాడు.

ఏం మాట్లాడలేదు మంజూష.

చిన్నగా మూలిగి పక్కకు తిరిగి పడుకుంది.

"నువ్వు భోంచేశావా?" జవాబులేదు. ఫార్మల్‌గా అడిగినట్టే ఫీలైంది.

"మంజూ!" మళ్లీ పిలుపు.

ఒళ్లుమండింది. అతడు లేకుండా తానెప్పుడైనా భోంచేసిందా? తాను లేకుండా కూడా అతడెన్నోసార్లు... అదీ ఈమధ్య.

"ప్లీజ్! అన్నీ టేబుల్ మీదున్నాయి. తినండి! నన్ను విసిగించొద్దు!"

లేచాడు దివ్యరామ్.

టేబుల్‌మీద అన్నీ అమర్చి వున్నాయి. వండిన వంటంతా అలాగేవుంది. కాలిఫ్లవర్... సాంబార్...

అవి చాలు! తనకి ఆకలి కరకరమనడానికి.

కారణం రెండూ తనకి ఎంతో ఇష్టమైనవే!

మరేమీ ఆలోచించకుండా విజృంభించేడతడు.

ఈ రోజు... రాగానే... 'మంజూని... తన మంజూని... తన హృదయరాణిని... ప్రేమరాణీగా చేసుకోవాలి. అర్థం లేకుండా ఆమె పడుతున్న బాధని వేళ్లతో సహా తుంచేయాలి' అనుకున్నాడు.

రైట్... వైనాట్?

గబగబా డ్రస్ చేసుకుని, ఆమె మీదికి వంగి ముద్దుపెట్టుకోబోయేడు.

ఆమె నెమ్మదిగా పక్కకి తిరిగి, అతనివైపు చూసింది.

ఒక్కక్షణం స్పందించిందతని హృదయం

'మంజూ! నా రాణీ! నిన్నొదిలి ఎక్కడికీ వెళ్లను... నీకన్నా నాకింకెవరూ ముఖ్యంకాదు. నాకెవ్వరూ వద్దు!' సన్నగా మూలిగింది మనస్సు.

లేచింది మంజూష.

క్షణం కూర్చొని కళ్లు మూసుకుంది.

మూడ్ మారిపోయింది దివ్యరామ్‌కి... మరో గదిలోకి వెళ్లిపోయేడు విసురుగా.

తను లేకుండా ఎంత హాయిగా భోంచేసే






డు. తనీ ఇంట్లో చచ్చిందో, బతికిందో కూడా అక్కర్లేని మనిషికి, తిండి తిన్నదో, లేదో అన్నది మాత్రం ఏమవసరం?

ఫ్రిజ్ తెరిచి ఏపిల్ తీసుకుంది. ముక్క కొరికింది.

అలాగే వచ్చి మంచం మీద కూర్చుంది.

ఎంతగండం తప్పిందీవేళ?

ఆ సంఘటన తల్చుకోగానే, సన్నగా వణికిందామె హృదయం...

తనకి థ్రిల్స్ కావాలి.

కాని, అలా మనుమల ప్రాణాల్తో ఆడుకొనే థ్రిల్స్ కాదు.

అతడికేమైనా అయితే!?

ఈ జన్మలో తననితాను క్షమించుకోలేకపోయేది.

అలా ఆ కటిక చీకట్లో...

ఆ కొండలకీ, సముద్రానికీ మధ్య నుండి ఎక్కడికి పోదామని?

తానింత ఆదుర్దా పడుతూంటే తన బాధని పంచుకోవాలని ఏమయినా దివ్య ప్రయత్నించాడా? పైగా శుభ్రంగా తినేసి...

ఆమె మనసు విరక్తిగా మూలిగింది.

ఒక్కసారి తనని దగ్గరికి తీసుకుని "ఏం జరిగిందో చెప్పవూ!" అంటే, అతని కళ్లలోకి చూస్తూ తానలా ఉండిపోయేదికాదా?

అతని వొళ్లో వాలి, అంతా వివరంగా చెప్పేదికాదూ!

తన గుండెల్లో ఇలా అర్థం లేకుండా పెరిగిపోతూన్న బాధనంతా పూర్తిగా కన్నీళ్లతో కడిగేసుకొనేది కాదూ!

బలంగా సెక్యూరిటీనిచ్చేలా వుండే అతని కౌగిట్లో వాలి, అంతా మర్చిపోయేది కాదూ!

కానీ, ఏదీ ఆ కౌగిలి? ఏదీ ఆ లాలన? ఏదీ ఆ ఆప్యాయత?

హాయిగా గుండెని తేలిక పరుచుకుందామంటే, ఫ్రీగా కన్నీళ్లయినా రావేం తనకి?

సన్నగా గుండెల్లో నొప్పి...

మైండ్ అంతా గజిబిజిగా వుంది.

ఒక్కసారిగా గంటన్నర కిందటి సంఘటన

ఇంకా కళ్లముందే ఉన్నట్టుంది.



"ఊc!" మూలుగుతూనే అతి ప్రయత్నం మీద లేచేడు.

మళ్లీ వెనక్కి పడిపోకుండా, భుజాల వెనుక చెయ్యివేసి, నెమ్మదిగా నించోపెట్టింది. మెల్లిగా నడిపించుకొచ్చి, ఓ చేత్తో కారు వెనక డోర్ తెరిచి, "ఇందులోకి రండి!" అంటూ లోపల కూర్చోబెట్టింది.

నెమ్మదిగా ఓ వక్కకి వాలేడతడు.

ఏం చెయ్యడం? ఏదైనా వెహికల్ వస్తే బావుండునే!

ఒక్కక్షణం అటూ ఇటూ చూసింది. అయినా ఏ వెహికల్ మాత్రం ఇంత రాత్రి ఏం ఉద్ధరిస్తుందిలే అనుకుంది.

అసలీ కారు ఏ కండిషన్‌లో ఉందో!? అనుకుంటూనే డోర్ తెరిచి, స్టీరింగ్ ముందు కూర్చుంది. స్టీరింగ్‌ను చూడగానే సన్నగా గుండెల్లో నొప్పిలా మొదలైంది.

అబ్బా! ఏమయింది? ఇందాక స్టీరింగ్ మీద ఒక్క జర్క్‌తో పడగానే ఆ ప్రెషర్‌కి ఏమైనా అయిందా? నో! కాదు! దడ! వట్టిదడ!

చిన్నగా నిట్టూర్చి స్టార్ట్ చేసే ప్రయత్నానికి పూనుకొంది.

మూడో ఛాన్స్‌కి స్టార్టయింది.

హమ్మయ్యా! రివర్స్ చేసి నెమ్మదిగా పోనిచ్చింది.

స్పీడోమీటర్లో ముల్లు ముప్ఫయ్ నలభైకన్నా ఎక్కువ చూపించడంలేదు.

ఊళ్లోకి ప్రవేశించి, కాలనీలు దాటి, పామ్ బీచ్ హోటల్ పక్కనుంచి టర్న్ చెయ్యబోయి, సడన్‌గా హోటల్ ముందు కారాపింది.

తలుపు తీసింది.

ఘూర్కా చటుక్కున లేచి నించుని సెల్యూట్ చేశాడు.

గబగబా లోపలికెళ్లింది మంజూష.

కౌంటర్లో తీరిగ్గా కూచుని, ఏదో నవల చదువుకుంటున్న రిసెప్షనిస్ట్ నడిగింది "ఒక్కసారి ఫోన్ చెయ్యాలి"

"యస్ మేడమ్"

డాక్టర్ సాధూ నర్సింగ్‌హోం నెంబర్ తిప్పి, ఆతృతగా రిసీవర్ చెవికి ఆనించుకుంది. రింగ్ అవుతోంది... డాక్టర్ సాధూ సైకాలజీ స్పెషలిస్ట్ అనే విషయం ఆ క్షణాన ఆమెకి గుర్తు రాలేదు.

ఎవరో రిసీవర్ ఎత్తిన చప్పుడు.. కానీ చెయ్యి అడ్డువున్నట్టుంది.

"హలో! నేను మంజూషని మాట్లాడుతున్నాను"

ఎవరో రిసీవర్ ఎత్తిన చప్పుడుమళ్లీ...

"ఏ మంజూ?" అనబోయి, నగంలో ఆపేసి "ఒక్క నిముషమాగండి ప్లీజ్"

రెండు మూడు నిముషాలు...

అసహనంగా వెయిట్ చేస్తోంది మంజూష.

"హల్లో!" డాక్టర్ సాధూ లైన్లోకొచ్చేడు.

గొంతు గుర్తుపట్టింది. ఆయన తమ ఫామ్లీ ఫ్రెండ్ కదా మరి!

"హల్లో సాధూగారూ! నేను మంజూని!"

"వ్వాట్ హాపెండ్?" ఆతృత అటువైపు నుంచి.

"నాకు... నాకేదోలా వుంది"

"అరె! ఏమైంది? ఎందుకంత గాభరాగా వున్నారు?" రెట్టింపు ఆతృత.

"ఏక్సిడెంట్!"

"ఏక్సిడెంటా? ఎక్కడ? ఎవరికి?" ప్రశ్నల పరంపర.

"రుషివేలీ కెళ్లే దార్లో... రెండో ఘాట్ రోడ్ మీద"





"మీరెక్కడినుంచి మాట్లాడుతున్నారు?" మార్దవంతో కూడిన మర్యాద వుందా గొంతులో.

"హొటల్ పామ్‌బీచ్" మంజూష గొంతులో అసహనం.

రిసెప్షనిస్ట్ విచిత్రంగా చూసింది.

డాక్టర్ సాధూకేం అర్థం కాలేదు.

"అసలింత రాత్రిపూట ఒంటరిగా అటు వైపు ఎందుకెళ్లారు మీరు? ఇంతకీ ఏక్సిడెంట్!? ఎలా? ఎవరికి?" చనువుతోపాటు ఆతృత ధ్వనిస్తోంది అవతల.

"ప్లీజ్! డీటెయిల్స్ తరువాత... ముందు మీ నర్సింగ్‌హోంలో ఏవైనా స్పెషల్ వార్డులున్నాయా? పోనీ! జనరల్ అయినా!"

"లేవనుకుంటా... మీరక్కడే వుండండి. నేనిప్పుడే వస్తున్నానక్కడికి"

"తొందరగా రండి. నాకు పిచ్చెక్కేలా వుంది"

బయటికొచ్చి కారు ముందుసీట్లో కూర్చొని వెనక్కి చూసింది. కళ్లు మూసుకొని స్పృహలేనట్టు పడుకొని వున్నాడతడు. పరిశీలనగా చూసింది. మెర్క్యురీ లైట్ల కాంతిపడి, తెల్లగా మెరుస్తోందతని ముఖం. పెరిగిన గడ్డం, తలమీద హెల్మెట్. హెల్మెట్ పక్కనుంచి రక్తం కారుతోంది. తుళ్ళిపడిందామె.

కొంపదీసి హెడ్ ఇంజ్యూరీ కాదుగదా! ఆ చెయ్యి మణికట్టుదగ్గర అలా వాచిందేమిటి? కాళ్ళో! ఏమీ తెలీడంలేదు. కారు వెనకడోరు తెరచి, నెమ్మదిగా హెల్మెట్ ఊడదీసి పక్కన పెట్టింది. తలమీంచి సన్నగా కారుతూన్న రక్తం, మొహాన చెమటతో కల్సిపోతోంది.

ఆమెలో క్షణక్షణం ఆతృత, అసహనం పెరిగిపోతున్నాయి. సన్నగా పశ్చాత్తాపంలాంటి బాధ మొదలైంది. ఉండుండి గుండెల్లో కలుక్కుమంటోంది. పామ్ బీచ్ ఎదురుగా టర్నింగ్‌లో వచ్చి ఆగింది ఆటో. డాక్టర్ సాధూ ఆటోదిగి ఫేర్ చెల్లించి, గబగబా కారువైపొచ్చేడు. స్టీరింగ్‌మీద తలాన్చి కూర్చొనివుంది మంజూష.

"మంజూషగారూ! సమయానికి కారు ఎంగేజ్డ్... టూ మినిట్స్ లేటొ"

తలెత్తింది ఒక్క ఉదుటున. ఆమె ప్రాణం లేచొచ్చింది.

"ముందొకసారి ఇతన్ని చూడండి! ప్రమాదం ఏమీ లేదుకదా!" ఆతృతగా అడిగింది.

డాక్టర్ సాధూ ఓసారి పరీక్షగా చూసి "పైకి పెద్దగా ప్రమాదకరమైన దెబ్బలు తగిలినట్టు లేదు. ఎనీవే! ముందు పక్కకి జరగండి! నేను డ్రయివ్ చేస్తాను"

కారు స్టార్ట్‌చేసి అన్నాడు "కె.జి.కి వెళ్దాం!"

"వొద్దు... కె.జి.హెచ్.కొద్దు! ట్రీట్‌మెంట్ ప్రత్యేకంగా జరగాలి ఇతనికి!"

"నో వర్రీ! మేం ఎలాగూ చూస్తాంగా!"

"అయినా వద్దు!"

బీచ్‌రోడ్డుమీద మెత్తగా జారిపోతోంది కారు.

రామకృష్ణా మిషన్ దాటి, సీ పెరల్ పక్కనించి టర్న్‌చేసి, ఇంకో రెండు టర్న్‌ల తర్వాత ఓ నర్సింగ్‌హోం ముందాగింది.

సాధూ గబగబా లోపలికెళ్ళాడు.

"ఎవరిప్పుడు డ్యూటీ డాక్టర్?" కారిడార్లోనే ఎదురైన డాక్టర్ పీటర్‌ని ప్రశ్నించాడు. ఆ నర్సింగ్‌హోం అతనిదే.

"హలో! ఏమిటిలా?" కరచాలనం చేస్తూనే అడిగాడు పీటర్.

"ఏక్సిడెంట్... మా నర్సింగ్‌హోంలో బెడ్స్ ఖాళీలేవు. అదీగాక హెడ్ ఇంజ్యూరీ ఏమోనని అనుమానంగా వుంది. రా చూద్దువుగాని"

గోడకున్న నిలువెత్తు జీసస్ కరుణామృత దృక్కులు, లోపలికొచ్చే పేషెంట్ల ఆర్తిని దూరంచేసేలా సేద తీర్చేలా వున్నాయి.

సాధూ స్వయంగా ఇంట్రస్ట్ చూపిస్తున్న కేస్ అని గ్రహించాడు పీటర్. గబగబా నడుస్తున్నారిద్దరూ.

నర్సింగ్‌హోం బోర్డ్‌లో నియాన్‌లైట్‌లవంక చూసి మంజూష చిన్నగా నిట్టూర్చింది.

ఎదురుగా వస్తున్న సిస్టర్‌తో స్ట్రెచర్ పంపించమని చెప్పి, కారుదగ్గరకి వచ్చేరిద్దరూ.

లోపలికి తొంగిచూశాడు పీటర్.

"స్కూటర్ యాక్సిడెంటా?"

"అవును!" మంజూష అది కంటిన్యూ చేస్తూ అంది. కొంచెం ఆగి "ఈ కారుతోనే అయింది. స్కూటర్‌ని అక్కడే వదిలేసి"

సాధూ అందుకుని "షి ఈజ్ మిసెస్ దివ్యరామ్! ది బెస్ట్ ఇండస్ట్రియలిస్ట్ ఆఫ్ ది సిటీ!"

"ఐనో! ఐనో!" ఇటుతిరిగి "అన్నట్టు మీరే డ్రయివింగ్..."

"అవును!"

తలని పరిశీలనగా చూస్తూ అన్నాడు, "హెల్మెట్ ఉందా ఇతనికి?"

"ఏమో మరి!!" డాక్టర్ సాధూ!

"ఉంది! నేను తీశాను ఇందాక" మంజూష అంది.

"ఓ! అయితే ఫర్వాలేదు! భయపడాల్సిందేం లేదు!"

స్ట్రెచర్ మోసుకొచ్చేరు బోయ్స్.

అతడ్ని జాగ్రత్తగా పడుకోబెట్టాక వెనుకే నడిచారు ముగ్గురూ.

డాక్టర్లిద్దరూ అతన్ని ఆపరేషన్ థియేటర్లోకి తీసుకెళ్ళగానే అక్కడే వున్న బెంచీమీద కూలబడింది మంజూష.

ఎంతో ఆతృతగా వుందామెకు.

దగ్గర్లోనే వున్న పేషెంట్ రూంలోంచి బైటికొచ్చిన ఓ లేడీ డాక్టర్, పక్కనుంచి వెళ్తూ మంజూషని చూసింది, "హలో! మీరు మిసెస్ దివ్యరామ్ కదూ!"

"ఊఁ" నీరసంగా నవ్వింది - ఫర్ కర్టెసీ సేక్.

"ఐయాం డాక్టర్ వాణి. ఒకసారి మీ వెడ్డింగ్ యానివర్సిరీ పార్టీలో కలిశాను. గుర్తుందా? బైదవే... ఏమిటిలా?"

ఏం మాట్లాడలేదు. నవ్వి ఊరుకుంది.

"రండి! ఆ రూం నాదే! అందులో కూర్చుందాం!"

ఆవిడ కన్సల్టింగ్ రూంలోకెళ్ళింది మంజూష.

"ఆఁ! ఇప్పుడు చెప్పండి! ఏమిటి సంగతి!"

"చిన్న ఏక్సిడెంట్ చేశాను. ఎదురుగా స్కూటర్‌మీద వస్తున్నాడతను. ముక్కుకు సూటిగా ఏకధాటిగా వచ్చేస్తున్నాడు. అప్పటికెన్నో వెహికిల్స్ వెళ్ళాయి పక్కనుంచి. కాని అతడు తప్పుకొనే ఉద్దేశం ఏమాత్రం లేనట్టుగా వచ్చేశాడు. ఆ మూమెంట్లో కారు తప్పించే అవకాశం నాకూ లేకపోయింది!"

"ఈ మగాళ్ళింతేనండీ... లేడీస్ డ్రైవ్ చేస్తుంటే ఏదోవిధంగా టీజ్ చెయ్యాలని చూస్తారు. ఇప్పుడు నష్టపోయిందెవరు?"

"అతనికెలావుందో ఏమో! ఐ ఫీల్ గిల్టీ డాక్టర్!"

"నో! నో! నో!... మీరేం వర్రీ కాకండి. ఇలాంటివన్నీ మామూలే!" మంజూష ముఖంలోకి పరిశీలనగా చూస్తూ అంది, "ఎందుకలా ఉన్నారు? ఒంట్లో బాగోలేదా?"

ఏం మాట్లాడలేదు మంజూష.

కుర్చీలో వెనక్కివాలి అలసటగా కళ్ళు మూసుకుంది.

"ఇంటికెళ్ళగానే, ఓ కాంపోజ్ వేసుకుని పడుకోండి! హాయిగా నిద్ర పడుతుంది. ఫ్రెష్‌గా తెల్లారుతుంది. మైండ్ మీ కంట్రోల్లోకి వస్తుంది"

కళ్ళు విప్పలేదు మంజూష. కదలకుండా అలాగే కూర్చొని వుంది రిలాక్సింగ్‌గా.

నెమ్మదిగా దూరమవుతున్న వాణి అడుగుల చప్పుడు...

అరగంట తర్వాత ఆమె డాక్టర్ పీటర్, డాక్టర్ సాధూలతో కలిసి లోపలికొచ్చింది.

చటుక్కున కళ్ళు విప్పింది మంజూష "డాక్టర్!"

"భయపడాల్సిందేం లేదండీ! చిన్న చిన్న ఇంజ్యూరీస్! అంతే! మణికట్టుదగ్గర మాత్రం చిన్న ఫ్రాక్చర్ అయింది. అదీ ఓ వారంరోజుల్లో హీల్ అయిపోవచ్చు. కాళ్ళు... చిన్నచిన్న స్క్రాచెస్ తప్ప ఏంలేదు"

"థాంక్ గాడ్!" హాయిగా నిట్టూర్చింది మంజూష.

"అయినా... ఎంత అవుట్ స్కర్ట్స్‌లో అయితేమాత్రం? అంత రాష్ డ్రయివింగ్ ఎందుకో అర్థంకాదు. ఈ హెల్మెట్స్ ఉండబట్టి బతికిపో





తున్నారు. కాని స్మాష్ అయిపోను...'' డాక్టర్ వాణీ అతడిని ఉద్దేశించి అంది.

''అన్నట్టు కేసేమీ ఉండదుకదా!''

''ఎందుకు? రిపోర్టెవరిచ్చేరు? మీరేం వర్రీ అవకండి. పదండి! నేను దిగబెడతాను'' వాచ్ చూస్తూ అన్నాడు సాధూ.

మరోసారి అందరికీ థాంక్స్ చెప్పి డాక్టర్ సాధూ వెనకాల నడిచింది మంజూష.

★ ★ ★

మత్తుగా కళ్లు తెరిచింది మంజూష.

మనసంతా హాయిగా, ప్రశాంతంగా, తేలిగ్గా వుంది.

పక్క బెడ్‌రూంలోకి చూసింది. గాఢనిద్రలో వున్నాడు దివి.

ఎంత అమాయకంగా వుందో అతని ముఖం... అతని కళ్ళమీద, పెదవులమీద ముద్దు పెట్టుకుని లేచింది. నిద్రలో తల అటూ, ఇటూ కదల్చి పక్కకు తిరిగి పడుకున్నాడు రామ్. బ్రష్ చేసుకుంటూంటే సడెన్‌గా గుర్తొచ్చింది...

రాత్రి జరిగిందంతా కలా? నిజమేనా...? అతడెలా ఉన్నాడో?!

ఫోన్ చేసి కనుక్కొంటే...?

వద్దు! తనే వెళ్ళాలి. దివీతో అంతా చెప్పి, అతన్ని కూడా తీసుకెళ్ళాలి. తనవల్ల ఎవరో వ్యక్తికి... అపరిచిత వ్యక్తికి... హాని!?

ఆపైన ఆలోచించలేకపోయింది.

ఫ్రెష్‌గా స్నానంచేసి తల చిక్కు తీసుకుంటుంటే రామ్ లేచాడు.

''గుడ్‌మాణింగ్ డార్లింగ్!''

వినిపించుకోనట్టుగా వెళ్ళిపోయాడతడు బాత్రూంలోకి.

బ్రషింగ్, బాత్ ఒకేసారి పూర్తిచేసుకుని రాగానే, కాఫీ రెడీగా వుంచిందతడికోసం.

అతడు అటుకేసి కన్నెత్తయినా చూడకుండా బెడ్‌రూంలోకి వెళ్ళిపోయాడు. హేంగర్స్‌కున్న డ్రస్ తీసుకెళ్ళి అతనికెదురుగా డ్రెస్సింగ్ టేబుల్‌మీద పెట్టింది. షర్ట్ గుండీలు పెట్టుకుంటూ, బీరువాకున్న అద్దంలోకి చూస్తూ తల దువ్వుకోసాగాడు. రోజూ అతడు వేసుకొనే బూట్లు తీసుకుంది. అతని కాళ్ళదగ్గర పెట్టింది. అవి చూడనట్టు, అతడు చెప్పుల రాక్‌దగ్గరికెళ్ళాడు.

ఉక్రోషంగా అతన్ని ఆపింది మంజూష.

''ఏమిటి మీ ఉద్దేశం! నాకేం నీతో సంబంధం లేదన్నట్టుగా ఏమిటలా బిహేవ్ చేస్తున్నారు?''

కోపంగా చూసి సాక్స్ వేసుకోసాగాడు.

''ఏమిటో చెప్పందే నాకేం తెలుస్తుంది?'' ఉడికిపోతూ అంది.

''నువ్వు నాకన్నీ చెప్పే చేస్తున్నావా? కనీసం చేసినవైనా చెప్తున్నావా?''

చురుగ్గా కదిలాయి ఆమె ఆలోచనలు. ఎప్పుడు తెలిసి వుండొచ్చు?

''ఏమిటి మీరనేది? ఆ ఏక్సిడెంట్ గురించేనా?''

''ఏం? ఏక్సిడెంట్ అంటే అంత తేలిగ్గా వుందా?''

చివుక్కుమందామె హృదయం.

''రాత్రి మీరసలు నాకు చెప్పే అవకాశం ఇస్తేనా? రాగానే భోంచేసి పడుకున్నారు. అప్పటికి నాకు చాలా తలనొప్పిగా వుంది. అసలు మీకీ సంగతి ఎప్పుడెలా?''

ఆమె మాట పూర్తికాకుండానే ''స్టాప్ నాన్సెన్స్! ఎవరూ నాకు ఫోన్ చెయ్యరనుకున్నావా? మరీ ఇల్లిటరేట్‌లా తయారౌతున్నావ్'' కోపంగా అన్నాడు.

''ఎనీవే... జరిగిందేదో జరిగిపోయిందిగా! అతన్ని చూద్దాం! మీరూ రండి! పీటర్స్ నర్సింగ్‌హోంలో వున్నాడతడు''

''ఆ వివరాలన్నీ తెలిశాయి. కొత్తగా చెప్పక్కర్లేదు''

''అంటే ఏమిటి మీ ఉద్దేశం? అదంతా మీకు నేను చెప్పనేలేదనేగా మీ బాధంతా. మీరేమన్నాసరే! మీరే నాకా అవకాశం ఇవ్వలేదు''

''అవకాశం ఇవ్వడమేంటి? ఇంటికొచ్చేక ఎంతసేపు మేలుకున్నాను నేను. ఆ టైం అంతా చాల్లేదా? రేపు అతనేదైనా కేసుపెడితే ఏంచేస్తావ్?'' తీవ్రంగా అడిగాడు.



''అంత అవసరం రాదేమోలెండి!''

''అవసరమో, అనవసరమో అంతా అతని మీద ఆధారపడివుంది. కేసు ఫైల్‌చేస్తే కోర్టుల చుట్టూ తిరగాలి!''

''తిరిగితే? అవుతుంది! ఏం ఉరి తీసేస్తారా ఇంతోటి యాక్సిడెంట్‌కీ! అయినా ఇందులో తప్పంతా నాదేనా? అతనిదీ ఉంది'' గట్టిగా అంది.

''అదే! అసలు నీ తప్పు ఉండవలసిన అవసరం ఎందుకొచ్చింది?''

''అంటే... కారు ఎందుకు తీసుకెళ్ళాల్సొచ్చిందనా?''

ఒళ్ళు మండిందామెకి.

''అసలు నాకు కారెందుకు పంపినట్టు? ఇంట్లో ఉండేదాన్ని నాకోసం కారు పంపి, మీరెవరి కార్లో వెళ్ళినట్టు?''

''నువ్విలా సరదాగా నీ థ్రిల్స్‌కోసం మనుమల్ని చంపుతావని''

ఒక్కక్షణం కదిలిపోయిందామె హృదయం. ''డోంట్ బి సిల్లీ రామ్''

బయటికి అలా అన్నా అంతరాంతరాల్లో మరోవిధమైన మూలుగు, 'నీ ప్రేమకీ, నీ ఆప్యాయతకీ, నీ కౌగిలికీ, నీ లాలనకీ దూరమైపోతున్నానే ఓ ఆవేదనతో క్షణక్షణం పిచ్చిదాన్నయిపోతున్నా దీపీ! నా దివ్యరామ్! నన్ను దూరంచెయ్యకు'

లేచి నిలబడ్డాడు దివ్యరామ్.

చాలా సౌమ్యంగా అడిగింది మంజూష, ''అతన్ని చూడ్డానికి వెళ్దాం రండి!''

''అవసరంలేదు''

''అతనికోసం కాదు, నా తృప్తికోసం''

దివ్యరామ్ గబగబా బయటికొచ్చి పోర్టికో వైపు నడిచాడు.

''దివీ! దివీ!'' వెనకాలే పరుగులాంటి నడకతో మంజూష.

అతడు విన్పించుకోనట్టుగా కారు ఒక్క ఉదుటున స్టార్ట్‌చేశాడు.

★ ★ ★

ఎంత పొగరు? ఎంత నిర్లక్ష్యం? భార్య చేసిన పని, ఇంకెవరో వ్యక్తిద్వారా భర్తకి తెలీడమా? ఇంకా నయం! సాధూ తమ ఫామ్లీ ఫ్రెండ్ కాబట్టి సరిపోయింది. ఇంకెవరైనా అయితే? రాత్రి సాధూ ఫోన్‌లో చెప్తూంటే, తనలో ఎంత బాధ? ఎంత అవమానం? ఎంత కోపం? అంత తీవ్రంగా ఆవేదన చెందే మనిషే ఐతే, ఏం రాత్రి రాగానే తన ఒళ్ళో పడుకొని చెప్పొచ్చుగా!

చిన్న పిల్లలాగ ఎంతలా లాలిస్తాడామెను? ఆమె ఇష్టానికి, స్వేచ్ఛకి వ్యతిరేకంగా తానెప్పుడైనా ప్రవర్తించేడా? అసలంత రాత్రిపూట అటువైపెందుకు వెళ్ళాలి? ఛీ! ఛీ! ఇంకా తనే ఛాన్స్ ఇవ్వలేదట! అవకాశం ఇవ్వడం అంటే ఇంకెలా? దివ్యరామ్ మనసు మరిగిపోతోంది.

★ ★ ★

ఎలా?...

ఎలాగైనా తాను నర్సింగ్‌హోంకెళ్ళాలి.

అతడెలా ఉన్నాడో చూడాలి!

ఎంత బ్లంట్‌గా రాననేశాడు.

అదీ తన భార్యవల్ల పేషెంట్‌అయిన ఒక వ్యక్తిని చూడ్డానికి!

ఎంత అహం?

సర్లే... వెళ్ళనీ! హుఁ!!

గట్టిగా తల విదిలించి గబగబా లోపలికెళ్ళింది.

హ్యాండ్‌బ్యాగ్ తీసుకుని అందులో మనీ వుందో లేదో చూసుకుని ఇంటికి తాళం వేసింది.

కొన్ని లిల్లీలు, గులాబీలు, కాస్మస్‌లు, కొన్ని క్రోటన్ ఆకులు చిన్న ప్లాస్టిక్ కాగితంలో చుట్టి బయల్దేరింది.

రోడ్డుమీదికొచ్చింది.

అరగంటలో నర్సింగ్‌హోం ముందుంది మంజూష.

గబగబా డాక్టర్స్ డ్యూటీరూంలోకి వెళ్ళింది. ఎవరో అపరిచిత డాక్టర్. అయినా అడిగింది ఆతృతగా, ''డాక్టర్! రాత్రి ఏక్సిడెంట్ అయిన పేషెంట్ ఎలా వున్నాడు?''

''శుభ్రంగా వున్నాడు. పొద్దున్నే లేచి పాలు తాగి, బ్రెడ్ తిని, ఏవో మ్యాగజైన్స్ చదూకుంటు




న్నాడు ప్రస్తుతం... చూస్తారా?''

''ఇప్పుడే వస్తాను. పావుగంటలో! ఈ పువ్వులు అతని రూమ్‌లో పెట్టించండి'' గబగబా బయటికొచ్చి ఇందాక తనెక్కిన ఆటో అక్కడే వుండడంతో అదే తీసుకుని ''మార్కెట్‌కు పోనీయ్!'' అంది.

ఆపిల్స్, అరటిపళ్ళు, ద్రాక్ష, ఛెర్రీస్, ఖర్జూరం కొని అదే ఆటోలో తిరిగి నర్సింగ్ హోంకొచ్చింది.

డాక్టర్ సాధూ, డాక్టర్ పీటర్ ఇద్దరూ విష్‌చేశారు. తానూ విష్‌చేసి ఒక స్టూల్ లాక్కొని కూర్చొంది.

పక్కనే బల్లమీద చిన్న వాజ్‌లో ఇందాక మంజూష తెచ్చిన పూలు, రెండు ఫిలిమ్ మాగజైన్లు...

చేతికి కట్టు, తలకి కట్టు, రెండో చేతిమీద చిన్న ప్లాస్టర్, కాళ్ళమీద రెండుమూడు ప్లాస్టర్లు, సూటిగా, చురుగ్గా తనవేపే చూస్తున్న అతని కళ్ళలోకి చూసి చిన్నగా నవ్వింది ''ఎలా వుందిప్పుడు?'' అడిగింది.

''ఊఁ! మీరేనన్నమాట... నిద్ర లేచింది మొదలు ఈ రూమ్‌లోకొచ్చినవాళ్ళందరూ మీ నామస్మరణే! ఎంత ఊరించేరో మీగురించి! ఇంతసేపటికైంది మీ దర్శనం!'' అవీ అతడి గొంతులోంచి మొదటగా వెలువడ్డ మాటలు.

''ఐయాం సారీ! పొద్దున్నే రావాలని ప్రయత్నించేను. కానీ...'' ఒక్కక్షణం ఆమె మొహంలో వ్యాపించిన నల్లటి రేఖ అతని దృష్టిని దాటిపోలేదు.

''ఇంట్లో ఏదో పని! బైదవే... డాక్టర్! కేసు విషయం...'' ఇటు తిరిగి అంది డాక్టర్ సాధూతో.

''అదే మాట్లాడుతున్నాం! మీరొచ్చేరు. స్కూటర్ తీసుకురావడానికి పంపించేం!'' సాధూ మాటలు పూర్తికాకముందే అతడందుకున్నాడు.

''ఆ స్కూటర్‌నింకా తీసుకురావడమెందుకండీ! సముద్రంలోకి తోసెయ్యక... ఇంక కేసు విషయమంటారా! నిజానికందులో మీ తప్పేంలేదు. నాదే తప్పంతా''

''నో! నో! మీకు తెలీదు. తప్పు నాదే!'' అప్పటి తన మనఃస్థితిని గుర్తు తెచ్చుకుంటూ అంది.

''సో! ఇద్దరూ కాంప్రమైజ్ అయ్యేరు. ఇద్దరికీ ఓ అండర్‌స్టాండింగ్ వచ్చింది కాబట్టి రిపోర్ట్ అనే ప్రశ్నేలేదు. తేలిపోయినట్టేనా సమస్య? మంజూషగారూ! ఇప్పటికైనా కుదుటపడిందా మీ మనసు!'' సాధూ నవ్వుతూ అన్నాడు.

తేలిగ్గా నవ్వింది మంజూష.

''బైదవే! మీ పేరు మంజూష అన్నమాట! లవ్లీ నేమ్! అయాం కెప్టెన్ సంపత్‌కుమార్. వెరీ వెరీ గ్లాడ్ టు మీట్యూ!'' చెయ్యి జాపాడు అతడు.

అప్రయత్నంగా చెయ్యందించింది మంజూష ''ప్లీజ్‌డ్ టు మీట్యూ!'' అంటూ.

''బైదవే డాక్టర్! నేనిక్కడ ఎన్నాళ్ళుండాలి!''

''ఈ క్షణంలో కావాలంటే వెళ్ళిపోవచ్చు!'' నవ్వుతూ అన్నాడు పీటర్.

''నేనుంటే మీకేం అభ్యంతరం లేదుకదా!''

నవ్వేడు డాక్టర్ పీటర్ ''అభ్యంతరం ఏంలేదు. కాని ఇంట్లో అయితే, ఇంకా హాయిగా, ఫ్రీగా వుంటుందికదా!''

''కాని నేనిక్కడే ఉంటాను... ఓ నాల్రోజులు''

''మీఇష్టం! ఇంక మేం వస్తాం!'' మంజూష వైపు తిరిగి ''అతనికింకేం భయంలేదు మంజూషగారూ! అంటూ డాక్టర్లిద్దరూ వెళ్ళిపోయారు.

''హమ్మయ్య! వాళ్లతోపాటు మీరూ ఎక్కడ వెళ్ళిపోతారో అనుకున్నాను. థాంక్‌గాడ్!'' నవ్వుతూ సంపత్ అన్నాడు.

''ఇంటికి పంపేస్తానంటే వద్దంటారేమిటి?''

''ఇక్కడైతే రోజూ వస్తారు మీరు. ఇంటికైతే రోజూ మీరెక్కడొస్తారు?'' అతడి జోవియల్ నేచర్ ఆమెకెంతో ముచ్చటగా వున్నా, తొలి పరిచయంతోనే అతి చొరవ ప్రదర్శించడంతో చురుగ్గా చూసిందామె - ''వాడ్డూయూ మీన్?''

నవ్వేశాడతను ''ఏంలేదు లెండి!''

బ్యాగ్‌లోని పళ్ళు తీసి పక్కనున్న కప్‌బోర్డులో సర్దసాగింది.



ఖర్జూరం, ద్రాక్షపళ్ళు బైటవుంచి కప్‌బోర్డ్ తలుపేసేసింది. ఓ ఖర్జూరం ప్యాకెట్ కట్ చేసి, ఎలా అందించాలా అని చూడసాగింది.

"అరె! ఖర్జూరం నాకిష్టమని మీకెలా తెల్సు?" ఆమె చేతిలోంచి ఖజూర్ తీసుకోడానికి చెయ్యి కదల్చబోతూంటే, కదలికకి నరాలు కలుక్కుమన్నాయి.

"నాకు చాలా ఇష్టంకనుక!" ముక్తసరిగా అని, ప్యాకెట్ అతనికి అందించింది.

నరాలు స్వాధీనరహితంగా వుండడంతో, "అబ్బా!" అన్నాడు, బాధనణచుకుంటూ.

విలవిల్లాడింది ఆమెలోని స్త్రీ సహజమైన మనసు.

"అరె!" అంటూ చేతిని నెమ్మదిగా రెస్టింగ్ కండిషన్‌లో పెడుతూ, "అయాం సో సారీ! ఎక్స్‌ట్రీమ్‌లీ సారీ! ఆ చెయ్యి ట్రై చేసి చూడండి!" ఆమెనింకా అపరాధ భావన వెంటాడుతోంది.

"నో! ఇట్స్ నథింగ్! పెద్దపెద్ద ఎయిర్‌క్రాఫ్ట్‌లు, జీప్‌లు, టాంకర్‌లు కూడా నడిపేవాణ్ణి! గాల్లోనూ, భూమ్మీదా నడిచే ఏ వాహనాన్నయినా నడపగలను నేను. సాధారణంగా ఏపని చేసినా అలర్ట్‌గా... చాలా ఈజ్‌గా వుంటాను... అలాంటిది..."

"అలాంటిది - ఒక స్కూటర్ ఏక్సిడెంట్ తప్పించలేకపోయారు" నవ్వింది.

"అదీ ఒక పువ్వులాంటి అమ్మాయి చేతిలో"

ఆ మాటలోని ఎడ్మిరేషన్‌కి చిన్నగా నవ్వింది మంజూష. అతన్ని పరిశీలనగా చూస్తూ, నేప్‌కిన్‌తో చెయ్యి తుడుచుకుంటూ అంది, "అంత రాత్రివేళ అంత స్పీడ్‌లో ఎక్కడినుంచి వస్తున్నారు?"

"ఎంతరాత్రేమిటి? తొమ్మిదిన్నర కూడా కాలేదప్పటికి! నిన్న పొద్దున్న నా ఫ్రెండ్ రమణ పెళ్ళయింది. సాయంత్రం అంతా కలిసి భీమ్లీలో పార్టీ చేసుకున్నాం!"

"ఓహ్! అర్థమైంది!" నవ్వేసి, "అయినా అంత ఘోరమైన కండిషన్‌లో ఎందుకు బయల్దేరారు?" చిన్నగా మందలిస్తున్నట్టుగా అంది.

"ప్చ్! అక్కడ ఉండాలన్పించలేదు!"

"చూశారా! ఇప్పుడెంత ప్రమాదం తప్పిందో!"

"ఇంత చిన్నదానికి అంత వర్రీ అవుతారేం?" చాలా తేలిగ్గా తీసేస్తూ అన్నాడు.

'ఏమిటితడి ధైర్యం? నిర్లక్ష్యమా? డిఫెన్స్‌వాళ్ళమన్న ధీమానా? అలా అన్పించడంలేదు ధీరోదాత్త లక్షణమా?'

"నిజంగా మిమ్మల్ని అక్కడ అలా వదలి వచ్చేస్తే, ఏంచేసేవారు?"

"మీరలా రాలేరని నాకు తెలుసు! అలాంటి స్థితిలో ఏ స్త్రీ అయినా అలా చెయ్యలేదు"

స్త్రీ అంటే అతనికున్న సద్భావనకి, ఒక్క క్షణం ఆమె హృదయం మెరిసింది. అయినా రెట్టిస్తూ అంది- "సపోజ్... అలా వదిలేస్తే ఏం చేసేవారు?"

"నేనేం చెయ్యక్కర్లేదు. ఏదో ఒక వెహికిల్ వాడు చూడకపోడు! ఏదో ఓ హాస్పటల్‌కి తీసుకెళ్ళకపోడు. అదర్‌వైజ్... బాగా తెలివొచ్చాక నేనే రిపోర్టిచ్చేవాణ్ణి"

"వ్వాట్!? మీరా?"

"మరి!?" చురుగ్గా చూసి "డామేజీ అయింది నేనుకదా! మీకేం? మీరూ- మీ కారూ శుభ్రంగానే వున్నారు"

అతడి మాటలు పూర్తికాకుండానే "ఇప్పుడైనా మించిపోయింది లేదు. వెళ్ళివ్వండి!" కోపంగా అంది.

"కాని పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం ప్రయోగించడం వీరత్వమనిపించుకోదు"

"యూ ఆర్ ఇన్‌సల్టింగ్ మి"

"నో! నో! అయినా ఇప్పుడింక అక్కర్లేదు. అప్పుడంటే ఏక్సిడెంట్ చేసింది ఒక సున్నితమయిన లిల్లీపువ్వులాంటి అమ్మాయని తెలీదుకదా! తెలిసి, తెలిసి అందమైన అమ్మాయిని కటకటాల వెనక్కి ఎలా పంపిస్తాను?"

"నాన్సెన్స్! మీరుకాదు కదా! మీ తాత వచ్చినా నన్నేం చెయ్యలేరు!"

"మా తాతా?" నవ్వేడతడు. "ఈ సివిలియన్స్‌వల్ల మా కాలిగోరు విరిగినా వాళ్ల అంతుచూస్తారు మావాళ్లు. మాకున్న సెక్యూరిటీముందు మీ కోర్టులెందుకూ పనికిరావు!"






"ఇదీ డిఫెన్స్ అంటే! కంచే చేనుమెయ్యడం అంటే ఇదే!" వ్యంగ్యంగా కసిగా అంది.

హాయిగా నవ్వేడతను. "డోంట్‌వర్రీ! ఒకవేళ వాళ్ళు తీసికెళ్ళినా, నేనూరుకుంటానా? ఏదో చెప్పి విడిపించుకొచ్చేస్తాను..."

"షటప్!" కోపంగా బల్లమీద కప్పుని తీసుకుంది.

"అరెరె! అవి నర్సింగ్‌హోంవాళ్ళవి!" మెరుపులా పట్టుకున్నాడామె చేతిని.

"పాపం! అవేంచేశాయి... హాస్పటల్ కప్పులు బద్దలుకొడితే బావుండదు!"

"బ్లడీ కప్స్! ఆఫ్టరాల్! కప్పుకో వందరూపాయలచొప్పున పారేస్తాను"

"కాని ఇప్పుడు... ఇక్కడ కావలసింది మనీ కాదు, మర్యాద!"

"మీరు నన్ను అవమానపరచాలని చూస్తున్నారు. మీ అధికారాన్ని శిరసావహించడానికి దాసీలెవరూ లేరిక్కడ!"

నవ్వేడతడు...

"నా మాటల్లో ఎక్కడయినా అధికారం వుందా...? అరెరె! లేవకండప్పుడే... కూచోండి ప్లీజ్"

విసురుగా లేచిందామె.

"ఇంతవరకు ది గ్రేట్ మంజూషని ఆజ్ఞాపించేవాళ్లెవరూ పుట్టలేదు"

"ఇకముందు కూడా పుట్టరు"

"ఊఁ...! మైండిట్!" కోపంగా చూసి, బాస్కెట్ అందుకుని విసురుగా దులిపింది. ఖర్జూరం ఒకటి కిందపడింది.

"బైదవే! రేపు మీరొచ్చేటప్పుడు ఖర్జూరం మరిచిపోకుండా..."

"రేపెవరొస్తున్నారు?"

"ఇవాళే వస్తున్నారా?"

"యూ బ్లడీ..." కోపంగా ఓ ఖర్జూరం విసిరి కొట్టిందతని పైకి. మధ్యలోనే అందుకున్నాడతడు ఎడంచేత్తో.

"రేపేకాదు! అసలెప్పుడూ రాను...."

ఫోర్స్‌గా బయటికి నడిచి, వెనక్కి చూడకుండా గబగబా వెళ్లిపోయింది.

టకటకమని హైహీల్స్ దూరమయిపోతున్న ధ్వని.

ఎడంచెయ్యి తలవెనక్కి పెట్టుకొని, మెత్తని దిండ్లనానుకుని... చాలాసేపు ఏదో ఆలోచిస్తూ ఉండిపోయాడు సంపత్!

★ ★ ★

మంచంమీద అడ్డంగా బోర్లా పడుకుని మెత్తని దిండ్లమీద గడ్డం ఆన్చి, దిండ్ల చుట్టూ చేతులేసి శూన్యంలోకి చూస్తోంది మంజూష.

ఆమె కళ్లలో ఏ భావమూలేదు.

కాలింగ్‌బెల్ మోగింది- మ్యూజికల్‌గా.

ఆమె చలించలేదు.

ఎవరో దగ్గరగా వస్తున్న ధ్వని! కళ్లు మూసుకుందామె.

''మంజూ!'' దివి గొంతు. ''మధ్యాహ్నం మీ పేషెంట్‌ని చూసివచ్చానోయ్'' షర్ట్ బటన్స్ విప్పుతూ అన్నాడు.

కళ్లు విప్పింది- కాని కదల్లేదు.

నిర్లిప్తంగా చూసిందలాగే.

బాత్‌రూమ్‌లోని కెళ్లేడు రామ్.

'ఎలా ఉన్నాడతడు? ఏం మాట్లాడేడు? మాటల్లో తన గురించి ఏమయినా వచ్చిందా...?'

రామ్ తన హజ్బెండ్ అని తెలిసి ఎలా రియాక్ట్ అయివుంటాడు?

ఫ్రిజ్‌లోని మంచినీళ్లసీసా తెచ్చి గ్లాసులో వంపుకుంటూ అన్నాడు రామ్.

''నేను వెళ్లేసరికి అతడు సౌండ్‌స్లీప్‌లో వున్నాడు. డిస్టర్బ్ చెయ్యడమెందుకులే అని వచ్చేశాను''

ఒకవిధంగా అదీ మంచిదేలే అనుకుంది మంజూష.

''ఈ నాల్రోజులకీ అయిన హాస్పిటల్ బిల్ మనం ఇచ్చేస్తే మంచిది'' రామ్ అన్నాడు.

చిరాగ్గా మారిందామె మొహం.

మొహం పక్కకితిప్పి కళ్లు మూసుకుంది.

ఫ్యాను గాలికి జుత్తు అస్తవ్యస్తంగా చెంపల మీద పడుతోంది.

పదినిముషాల తర్వాత- స్నానంచేసి లుంగీ కట్టుకుంటూ వచ్చేడు 'మంజూ' అంటూ.

లేచిందామె.

మొహంమీద పడుతున్న జుత్తును వెనక్కి తోసుకుంటూ, తిన్నగా కిచెన్‌లోనికి నడిచింది.

వెనకాలే నడిచి, ఆమె చుట్టూ చేతులేసి, చిన్నపిల్లాడిలా అన్నాడు ''ఆకలేస్తూంది''

ఆమె మాట్లాడలేదు- ఎక్కువగా.

చిన్న స్వరంతో ''పదండి'' అని మాత్రం అంది.

ఆమె ఉద్దేశమేమిటో అర్థంకాక, ఆమెవైపే చూస్తుండిపోయాడతడు.

భోంచేసి బిజినెస్ వ్యవహారాల్లో పడబోయేడు దివ్యారామ్- ఏవో ఫైళ్లు చూసుకుంటూ.

మనసు నిలవడంలేదు.

ఏదో అర్థంకాని అశాంతి! క్రమంగా పెరుగుతున్న గుండెల్లో బరువు టేబుల్‌మీద పెన్‌స్టాండ్! సన్నటి ఫ్లవర్‌వాజ్. ఏవో పేపర్స్ అవి ఎగిరిపోకుండా అందమైన గాజుపేపర్ వెయిట్‌లు.

అప్రయత్నంగా డ్రాయర్ తెరిచాడు.

డైరీ...

ఒకొక్క పేజీ తిప్పుతున్నాడు. కళ్లు వాటిని చూస్తున్నాయి. కాని ఏమాత్రం గ్రహించడంలేదు.

సడన్‌గా చిన్న స్లిప్ జారిపడింది. లేచి చూశాడు. మెదడు నరాల్లోని రక్తమంతా కళ్లలోకి ప్రవహించేటంత ఆతృత- అదేమిటో గ్రహించడానికి.

యస్! అది కాదంబినీ దేవి ఫోన్‌నెంబర్.

అంతే!

తుఫాన్ వెలిసినంత ప్రశాంతత. మనసు తేలికైంది. సముద్రం మధ్య తుఫాన్‌లో చిక్కుకున్న మనిషికి- అనుకోనివిధంగా ఆధారం దొరికిన భావన.

కాదంబినీదేవి!

ఎంత రిలాక్సింగ్‌గా, రిలీఫ్‌గా అనిపిస్తోంది ఆమె పేరు తల్చుకుంటూంటే.

మరుక్షణంలో- ఫోన్ దగ్గరగా లాక్కుని రిసీవరెత్తి నెంబర్ తిప్పాడు.

రెండు నిమిషాలు...





ఆతృతగా ఓ మధురమైన స్వరంకోసం ఎదురుచూపు.

ఫోనెత్తిన వాయిస్.

"హలో! కాదంబినీ హియర్!"

అతని గుండె వేగంగా కొట్టుకుంది.

"కాదంబినీ! నేను దివ్యరామ్‌ని"

"దివ్యరామ్?" ఏదో గుర్తు తెచ్చుకుంటున్నట్టుగా ఆగింది.

"అయాం... మంజూ ఇండస్ట్రీస్ ఓనర్ దివ్యరామ్. మీ ప్రోగ్రాంలో ఆరోజు"

"ఓహ్! అయాం సారీ.. మీరా ఏమనుకోకండి. చటుక్కున గుర్తురాలేదు"

"ఇట్సాల్‌రైట్! ఇప్పటికైనా గుర్తొచ్చినందుకు ధన్యుణ్ణి" సిన్సియర్‌గా అన్నాడు నిష్టూరంలో.

"అయాం సారీ! రియల్లీ" కొద్దిగా నొచ్చుకుంటున్నట్టుగా అంది.

"ఆఁ... అన్నట్టు మా ఇంటికొస్తానన్నారుగా! రాలేదేం"

ఏం చెప్పాలా అని ఆగాడు.

"క్షణం తీరిక దొరకడంలేదు. రాత్రి పదివరకు చాలా బిజీ అయిపోతోంది. ఈమధ్య అసలు ఇంటి దగ్గర లంచ్ తీసుకోవడం కూడా పడడంలేదు. కాస్త తీరిక దొరికేది రాత్రి పదకొండు తర్వాతే! పోనీ! మీరైనా ఫోన్ చెయ్యలేకపోయారా?"

చిన్నగా నవ్వు!

"మీ అంత బిజీ కాకపోయినా- నాకూ టైమ్ దొరకదు"

"టైమ్ లేకా? గుర్తు లేకా?"

మళ్లీ నవ్వు!

"మీరు నన్ను చాలా ఇబ్బందిలో పెట్టేస్తున్నారు. ఏమయినా కానివ్వండి. మీ దగ్గర్నించీ లేదు. నా దగ్గర్నించీ లేదు- ఫోను... ఇంక 'సారీ'లు మర్చిపోదాం... లెటజ్ బి ఫ్రెండ్స్!"

"థాంక్యూ!" రిలీఫ్‌గా అన్నాడు.

అట్నుంచి- ముత్యాలు ఒలకబోసినట్టు నవ్వు.

"ఏం చేస్తున్నారిప్పుడు?"

"రాధాకృష్ణన్ 'అవర్ హెరిటేజ్' చదువుతున్నాను"

"........"

"ఓహ్! రాధాకృష్ణన్! ఇండియన్ థాట్‌లో గొప్ప స్కాలర్. మన భారతీయ సంస్కృతినీ తత్వశాస్త్రాన్నీ ఎంతో డీప్‌గా అధ్యయనంచేసి సంస్కృతంలోంచి ఇంగ్లీష్‌లోకి ట్రాన్స్‌లేట్ చేసి, ప్రపంచానికంతటికీ అందించిన మహామేధావి... గలగలా మాట్లాడేస్తోంది.

ఒక్కక్షణం బిక్కచచ్చిపోయాడు.

"నా ఫీల్డ్ పూర్తిగా వేరండి. ఈ ఇండస్ట్రీ బిజినెస్ తప్ప మరో ప్రపంచాన్నే మర్చిపోతున్నాను. పొద్దున్న లేచింది మొదలు- మాన్యుఫేక్చరింగ్, మార్కెటింగ్ షేర్లు, డిబెంచర్లు... ఇదే లోకం! ఎప్పుడూ లాభనష్టాల్లో మునిగే మాలాంటివాళ్లు పెళ్లి చేసుకున్నా భార్యల్ని సుఖపెట్టలేరు" గొంతులో సన్నటి విషాదరేఖ.

"సారీ దివ్యరామ్‌గారూ! ఎనీవే! వృత్తిలో అంకితమైన ఒక సిన్సియర్ పర్సన్‌గా మిమ్మల్ని అభినందిస్తున్నాను. అలాంటివాళ్లంటే చాలా ఇష్టం నాకు"

"థాంక్యూ! బట్- ఈ ఫీల్డ్‌లో మాకన్నా సీనియర్లున్నారు. వాళ్ల దృష్టిలో మేం ఇంకా జూనియర్లం మాత్రమే కాదు! లెర్నర్లం కూడా! నిజానికి మమ్మల్ని మనిషిగా అర్థం చేసుకుని సేదదీర్చే ప్రేమమూర్తులు మాకెవ్వరూ ఉండరు. మేం నిర్మించుకున్న ఈ మినీ ప్రపంచంలో మేం ఒంటరివాళ్లం. చుట్టూవున్న ప్రపంచానికి దూరంగా మెకానికల్‌గా బతికేస్తుంటాం" అతని కంఠంలో ఏదో విరక్తి- ఏదో డ్రైనెస్.

"ఐ అండర్‌స్టాండ్ యూ మిస్టర్ రాం!" మెత్తగా స్నేహపూరితంగా పలికిందామె గొంతు. మీరెప్పుడు ఫోన్ చేసినా పలుకుతాను. మీకెప్పుడు రావాలనిపించినా నిస్సంకోచంగా వచ్చేయండి మా ఇంటికి"

"కాని... చెప్పేనుకదా! సాధారణంగా రాత్రి తప్ప వీలవదు"

"అప్పుడే రండి" ఫోన్ పెట్టేసిందామె.

★ ★ ★

ఉదయం పదిగంటలు.

బెంగాల్ కాటన్‌శారీ కట్టుకొని, జుట్టు దువ్వి

కుంటోంది మంజూష. ఈమధ్య సరైన సంరక్షణ లేక ఎగుడుదిగుడుగా పెరుగుతూ రఫ్‌గా తయారైందేమిటీ జుట్టు...?

చిన్నగా నిట్టూర్చి, రబ్బర్ బేండ్‌తో బిగించి, నెమ్మదిగా బైటికొచ్చింది.

పోర్టికో ఖాళీగా వుంది- తన మనసులాగే!

పువ్వులు కొన్ని కోసి, అందంగా 'బొకే' చుట్టి, అలాగే బైటికి నడిచింది.

హాస్పిటల్‌ముందు ఆటోదిగి కారిడార్లో కొచ్చింది. గబగబా నడిచి, మెట్లెక్కి కుడి చేతి వైపు తిరిగి, కారిడార్లో నడిచి ఆ గది ముందాగింది.

ఆతృతననుచుకుంటూ నెమ్మదిగా తలుపు తీసింది

అంతే! స్థాణువులా వుండిపోయింది.

అరవయ్యేళ్ల ముసలమ్మ-

పక్కకితిరిగి హాయిగా నిద్రపోతోంది.

గదికి అటువైపు బాల్కనీలోంచి పొడవైన చెట్లూ సముద్రమూ...

చటుక్కున వెనక్కితిరిగి, దాదాపు పరిగెడుతున్నట్టుగా మెట్లుదిగి, కారిడార్లో నడిచి, ఆఫీస్‌రూంలో కొచ్చింది.

డాక్టరూ, స్టెల్లాసిస్టరూ సీరియస్‌గా కూర్చొని రిజిష్టర్లో విషయం ఏదో చర్చించుకుంటున్నారు.

"సిస్టర్! సిస్టర్" ఆతృతగా పిలిచింది.

"ఆ రూంనెంబర్ వన్నాట్‌ఫైవ్‌లో పేషెంట్ వెళ్లిపోయేడా?"

సన్నటి గోల్డ్‌రిమ్డ్ కళ్లద్దాల్లోంచి మొహం ఎత్తకుండా కళ్లు మాత్రం ఎత్తిచూసింది- "అక్కడ ఇండెక్స్ బోర్డ్ చూళ్లేదా?"

"లేదు. ఎప్పుడు వెళ్లిపోయాడు?"

"నిన్న సాయంత్రం"

"ఎలా వెళ్లేడు? ఎవరైనా వచ్చేరా అతన్ని తీసుకెళ్లడానికి." ఆతృతగా అడిగింది.

"ఎవరో ఇద్దరు ఫ్రెండ్స్ వచ్చేరు"

"పోనీ! అతను వెళ్లేటప్పుడు ఎలా వున్నాడు? హాయిగానే ఉన్నాడా?"

"వెళ్లేటప్పుడు అన్నీ టెస్ట్‌లు చేసే పంపిస్తాం! హి ఈజ్ పెర్‌ఫెక్ట్‌లీ ఆల్‌రైట్"

"ఓహ్ అది కాదు"

"మరో రెండ్రోజులుంటానన్న వ్యక్తి" అర్థోక్తిలో ఆగింది.

"సడెన్‌గా తనే వెళ్లిపోతానన్నాడు" సిస్టర్ అంది.

'అరె! ఎందుకని? వెళ్లేముందు తనని చూడాలనుకోలేదా? తనొస్తుందేమోనని వెయిట్ చెయ్యలేదా? కనీసం ఫోన్లోనైనా తనకి చెప్పాలన్న కర్టెసీ లేదా?' ఊహ చకచకా సాగి చిరుకోపం వచ్చేసింది.

బరువుగా నిట్టూర్చి "డాక్టర్! ఈ నాల్రోజుల బిల్లివ్వండి"

ఆశ్చర్యంగా తలెత్తింది సిస్టర్- "చూడండమ్మా! బిల్ పే చెయ్యకుండా, పేషెంట్ ఎలా డిశ్చార్జ్ అవుతాడు?"

"కరెక్ట్! ఎవరు పేజేశారు బిల్లు?"

"అతడే! కెప్టెన్ సంపత్‌కుమార్"

మెదడులో సన్నగా హోరు... వెయ్యి సముద్రాలు ఒక్కసారిగా పొంగి, తనని ముంచేస్తున్న భావన.

"థాంక్యూ సిస్టర్!" నెమ్మదిగా వెనక్కితిరిగి "ఓహ్! ఈ పువ్వులుంచండి"

మరుక్షణం ఆమె అక్కడలేదు.

ఆటోదిగి గబగబ ఇంట్లోకొచ్చి బెడ్‌మీద బోర్లాపడింది.

"సంపత్! ఎంతపని చేశావ్ సంపత్? చావుదెబ్బ తీశావు నామీద. నిన్ను నేను క్షమించలేను సంపత్. కాని... నిన్ను నేను అప్రిషియేట్ చెయ్యకుండా వుండలేకపోతున్నాను" రెస్ట్‌లెస్‌గా మొహం అటూ ఇటూ కదల్చి తలగడలో దూర్చింది.

★ ★ ★

సాయంత్రం ఆరుగంటలు.

కాలింగ్‌బెల్ మూడోసారి మ్యూజికల్‌గా మోగేసరికి లేచి తలుపుతీసింది మంజూష.

"ఏమిటంత నిద్ర?" లోపలికొస్తూ అన్నాడు రామ్ "మా ఫ్రెండ్ వినోద్ వెడ్డింగ్ ఏనివర్సిరీ పార్టీ ఉంది. తొందరగా తయారవ్వు! వెళ్దాం"

"సారీ దీవీ...! నేను రాలేను. పార్టీ





ఎంజాయ్ చేసే మూడ్ ఏమాత్రం లేదు''

''కమాన్! బయటకెళ్తే కాస్త ఛేంజ్ వస్తుంది. లే! లే! పద! పద!'' చెయ్యి పట్టుకొని లేవదీయబోయేడు.

కదల్లేదామె. నెమ్మదిగా చెయ్యి విడిపించుకుంది.

''ప్లీజ్ దివీ! నన్నిలా వదిలెయ్! బలవంత పెట్టకు?'' స్థిరంగా అంది.

ఒక్కక్షణం డీప్‌గా ఆమె ముఖంలోకి చూసి, బెడ్రూంలోకి వెళ్లిపోయాడు దివ్యరాం. రెండు నిమిషాల్లో డ్రెస్ చేసుకొచ్చేడు.

''కాఫీ తాగి వెళ్లండి'' మంజూష.

కాఫీ తాగుతూ ఆమెవైపు చూశాడు. అలాగే కూర్చొనిఉంది- మొహంలో ఏ భావమూ లేకుండా.

ఖాళీకప్పు టేబిల్‌మీద పెట్టేడు

''వెళ్తున్నాను''

కారు స్టార్టయిన శబ్దం... దూరంగా... దూరంగా ఆ ట్రాఫిక్ శబ్దాల్లో కలిసిపోయింది.

గుమ్మందాకా వచ్చిన మంజూష అద్దాల తలుపుమీద తల ఆన్చి నిశ్శబ్దంగా అలా ఉండిపోయింది.

అప్‌లేండ్స్ డౌన్ దిగింది కారు.

సడన్‌గా ఒంట్లో శక్తంతా ఆవిరైపోయినట్టు అన్పించింది దివ్యరామ్‌కి. పార్టీకి వెళ్లాలన్పించలేదు. ఇంటికి తిరిగివెళ్లాలనీ లేదు. విండోలోంచొస్తున్న చల్లటిగాలికి మండుతున్న మనుస్సు మరింత రాజుకుంటోంది.

తనని అక్కున చేర్చుకుని, అర్థం చేసుకొనే చల్లని స్పర్శకోసం ఆక్రోశిస్తోందతని హృదయం. అనుక్షణం అలసిపోతున్న అతనిలోని అణువణువునీ ప్రేమగా ఆప్యాయంగా లాలించే వెచ్చని ఒడికోసం కలవరిస్తోంది.

అయినా, అతడి ప్రయత్నం లేకుండానే కారు వినోద్ ఇంటికెళ్లే రోడ్డుమలుపు తిరిగింది.

★ ★ ★

సాయంత్రం ఆరయింది.

ప్లాస్టిక్ ట్యూబ్‌తో మొక్కల్నీ లాన్నీ తడుపుతోంది మంజూష. మనసులో ఏ ఆలోచనలూ లేవు.

తడిసిన మట్టివాసన... గాలి చల్లబడింది.

ఆనందంగా నాట్యం మొదలెట్టాయి పువ్వులు.

అప్రయత్నంగా గేటువైపు చూసిన మంజూష- చటుక్కున ఆగిపోయింది. కెప్టెన్ సంపత్‌కుమార్. క్షణంపాటు సంభ్రమం.

ద్వితీయ సమాగమం ఇంత త్వరగా జరుగుతుందని తానూ ఊహించలేదు. థాంక్ గాడ్!

సంపత్ నవ్వుతూ లోపలికొచ్చి, ఆమె ముందు నించుని చిన్నగా వంగి సలాంచేశాడు స్టైల్‌గా. చిన్నగా నవ్విందామె.

''లోపలికి రావొచ్చా?''

''ఓహ్! సారీ... రండి'' ట్యూబ్‌ని వదిలేసి ఇంట్లోకి దారితీస్తూనే ''ఎలా ఉందిప్పుడు?'' అడిగింది మంజూష.

''ఫర్వాలేదు. చాలావరకు తగ్గిపోయాయి''

సోఫాలో కూర్చోబోతూ, చేతిలోని లిల్లీలగుత్తి ఆమెకు అందించాడు.

''థాంక్యూ... నాకు లిల్లీలంటే ఇష్టమని మీకెలా తెలుసు?''

''ఎలాగంటే-? అంతే! నాకు చాలా ఇష్టం కాబట్టి''

''గుడ్... గుడ్ టేస్ట్!'' పువ్వుల్ని వాజ్‌లో పెడుతూ, దానిమీద తాపడం చేసివున్న చిన్న అద్దంలో మొహం చూసుకుంది. మొహం జిడ్డుగా- అలసటగా.

''మొత్తానికి ది గ్రేట్ సంపత్‌నే సాధించేరు'' అడ్మైరింగ్‌గా అన్నాడు.

''ఎలా?'' అద్దంలోంచే అతడ్ని చూస్తూ అంది.

''ఆరోజు- 'ఇంకెప్పుడూ రాను' అని వెళ్లిపోయిన మీరు మళ్లీ రానేలేదుగా''

చటుక్కున వెనక్కితిరిగింది. ఆశ్చర్యంగా చూసింది.

''చాలా ఎదురుచూసేను మీ కోసం. ఆఖరికి ఆరోజు నా ఫ్రెండ్స్ ఎవరో వస్తే వాళ్లతో కలిసి వెళ్లిపోయాను'' ఒక్కక్షణం ఆగి అన్నాడు ''ఐ ఎప్రిషియేట్ యూ ఎ లాట్''



నెమ్మదిగా ఆమె పెదవులమీద ఓ చిర్నవ్వు అరవిరిసింది.

"అయిదు నిమిషాల్లో వస్తాను. ఈ మేగజైన్స్ చూస్తుండండి" స్టీరియో ఆన్‌చేసి వెళ్లింది.

సన్నగా- స్పష్టంగా వెస్టర్న్ మ్యూజిక్- ఈవెనింగ్ బీట్స్.

లైట్ ఎల్లో డిస్టెంపర్‌మీద, మేచింగ్ పెయింటింగ్స్.

ఎడారిలో- సూర్యాస్తమయంలో- ఒంటెమీద ఓ ఒంటరి అరేబియా బేహారి.

ఫోర్స్‌గా పరుగెడుతున్న గుర్రాలమీద మరో చోట, బ్రౌన్ అండ్ ఎల్లో కలర్స్ కాంబినేషన్‌లో.

ఇంకోవైపు- స్నఫ్ ఆరెంజ్ కాంబినేషన్‌లో ఓ పెద్ద బాతిక్ పెయింటింగ్.

షోకేస్‌లో రకరకాల బొమ్మలు. రకరకాల మెటల్స్‌తో చేసిన ఇమేజెస్ రకరకాల షేప్స్‌లో సీ షెల్స్, కోరల్స్.

బాత్రూంలోంచి సన్నగా షవర్ చప్పుడు.

ఐదు... పది... పదిహేను.

మంజూష వచ్చింది- స్వచ్ఛంగా, కడిగిన స్ఫటికంలా, మెరుస్తున్న తెల్లని షిఫాన్‌చీరలో.

"బ్యూటిఫుల్! వండ్రఫుల్ టేస్ట్" ప్రశంసగా అన్నాడు.

ఏమిటన్నట్టు తలెత్తి చూసింది.

"ఈ పెయింటింగ్స్! ఎరేంజ్‌మెంట్, డెకరేషన్ ఆల్సో!"

"థాంక్యూ!" చిన్నగా నవ్వి లోపలికెళ్లి రెండు నిమిషాల్లో ట్రేతో వచ్చింది.

"ఓహ్! ఐస్‌క్రీం అంటే నా కిష్టమని మీకెలా తెలుసు?" ట్రేలో డిష్ అందుకుంటూ అన్నాడు.

"ఎందుకంటే... ఎందుకంటే- నాకు చాలా ఇష్టం కాబట్టి..."

"పెయింటింగ్స్ చాలా బావున్నాయి. ప్రతి దాంట్లోనూ మీ ముద్ర కన్పిస్తోంది"

"సంతకం చూశారా?"

"అరె! చూడకుండానే పోల్చుకున్నానంటే నమ్ముతారా?"

"ఐసీ! ఆర్ట్ లాంగ్వేజ్ చదివారన్నమాట!"

"అయితే, ఆర్ట్ మీకు బార్న్ గిఫ్ట్ అన్నమాట!"

"ఏమో! కాని ఆర్ట్‌కి సంబంధించిన ఏ పుస్తకమైనా కొంటాను. ఐ లవ్ పెయింటింగ్"

"ఈ ఇంట్లో మీరుకాక ఇంకెవరుంటారు?" అడిగాడు సంపత్ ఎటో చూస్తూ.

"నేనూ- దివీ..."

"దివి! ఎవరు...? ఆడా? మగా?" ఆలోచిస్తున్నట్టు బైటికి కన్పించకుండా ఉండాలని మరో ప్రశ్న.

"ఎగ్జిబిషన్స్‌లో ఏమైనా పార్టిసిపేట్ చేశారా?"

"రెండుసార్లు... రెండుసార్లూ ఫస్ట్ ప్రైజులొచ్చాయి"

ఇంటిముందు కారు హారన్.

దివ్యరాం లోపలికొచ్చేడు.

"హలో! ఎలా వుందిప్పుడు? తగ్గేయా?" అక్కడక్కడ ప్లాస్టర్స్‌ని చూస్తూ అన్నాడు.

ఆశ్చర్యంగా చూస్తూ- అతనితో కరచాలనం చేశాడు సంపత్.

"అయాం దివ్యరాం! మీరు కెప్టెన్ సంపత్ కుమార్ కదూ!"

"అవును. మీకు... నేను" ఎలా తెలుసునని అడగాలనుకొనేలోగానే దివ్యరామ్ అనేశాడు.

"మిమ్మల్ని చూడ్డానికి వొచ్చేను హాస్పటల్‌కి. మీరు నిద్రపోతూంటే, డిస్టర్బ్ చెయ్యడం ఇష్టంలేక వచ్చేశాను. మంజూ ఏం చెప్పలేదా...? ఏవోయ్! చల్లటి మంచినీళ్లు"

మంజూ లేచింది. అయోమయంగా చూసేడు సంపత్.

మంచినీళ్లు, ఓ కప్‌తో ఐస్‌క్రీం తెచ్చింది.

తింటూ అడిగేడు దివ్యరాం "మీరెక్కడుంటున్నారు?"

"అస్సాం బోర్డర్స్‌లో ఉంటున్నాను. ప్రస్తుతం లీవ్‌లో ఉన్నాను. జూలైలో లీవూ బాండూ కూడా అయిపోతాయి"

"ఐ.సీ"

కిచెన్‌లో ఏవో గిన్నెల చప్పుడు...




"నేవెళ్తాను" లేచాడు సంపత్.

"మంజూ!" పిలిచాడు దివ్యరామ్. అదేం పట్టించుకోనట్టు గబగబా మెట్లుదిగి వెళ్లిపోయాడు సంపత్.

బయటికొచ్చిన మంజూష ఆశ్చర్యంగా చూస్తుండిపోయింది.



ఉదయం పదకొండు అయింది.

బయట ఎండ మండిపోతున్నా ఎత్తయిన ప్రదేశంలో విశాలమైన వెంటిలేషన్‌తో తన ఆఫీస్‌రూం కట్టడంవలన చల్లటిగాలి వస్తోంది లోపలికి.

లేచాడు రామ్.

కాదంబిని ఇంటికి ఫోన్ చెయ్యబోయి, అప్రయత్నంగా ఫోన్ అందుకున్నాడు- ఫోన్ మోగడంతో.

"హలో! దివ్యరామ్ హియర్!"

"ఓహో! కాదంబినీ! ఏమిటి విశేషం?"

"విశేషమేముంది? అంతా రొటీన్"

"మీకేం డిస్టర్బెన్స్ లేకపోతే, ఇప్పుడు మీ ఇంటికొద్దామనుకుంటున్నాను"

"నో! నో! అదేంలేదు. రండి! తప్పకుండా" అవతలినుంచి కాదంబిని చిర్నవ్వు.

ఫోన్ పెట్టేసింది.

అప్‌లేండ్స్ డౌన్‌దిగి, నెమ్మదిగా ఈల వేసుకుంటూ కారు సాగుతోంది. చిన్న జర్క్‌తో అందమైన ఇంటిముందాగింది. హార్న్ కొట్టి కారు దిగాడు.

పరికిణీ- ఓణీ వేసుకున్న ఒకమ్మాయి వచ్చింది- "రండి" అంటూ.

ఆరోజు మేకప్‌రూంలో చూసిన పిల్ల... అసిస్టెంట్ కాబోలు.

నెమ్మదిగా లోపలికడుగుపెట్టేడు- ఇంటి ఆవరణ పరిశీలనగా చూస్తూ.

ఆలివ్‌గ్రీన్ కలర్ బంగళా. ఇంటి ముందు భాగపు చూరుకు చిన్న చిన్న పూలకుండీలు వేలాడుతూ... డార్క్‌గ్రీన్ పెయింటెడ్ కుండీలు అవి. అందమైన పూలతోట. ఓ పక్కగా పోర్టికో.

గ్రీన్‌కలర్ సోఫాలు.

ఆకుపచ్చని ఖటావ్‌వాయిల్ చీరలో వనకన్యలా కూర్చొనివుంది కాదంబిని.

దివ్యరామ్‌ని చూడగానే చటుక్కున లేచి ముందుకొచ్చింది.

"రండి! ఇన్నాళ్లకి పావనమైంది మా ఇల్లు"

నవ్వుతూ వచ్చి కూర్చున్నాడు. బాటిల్‌గ్రీన్ కలర్డ్ కర్టెన్స్ దగ్గరగాలాగి వచ్చికూర్చుంది.

క్లోజ్‌గా వుంది రూమ్.

"ఒక్క నిమిషం" అని లోపలికెళ్లింది కాదంబిని.

లైట్‌గ్రీన్ డిస్టెంపర్స్ కాంబినేషన్‌తో విశాలమైన డ్రాయింగ్‌రూం. ఒకపక్కగా షోకేస్... రకరకాల నాట్యభంగిమలున్న బొమ్మలు.

ట్రేలో రెండుగ్లాసుల నిమ్మరసం పట్టుకొచ్చింది కాదంబిని. పైన ఐస్‌క్యూబ్స్ తేల్తున్నాయి. ఒకగ్లాసు అందుకున్నాడు రామ్.

"ఓ జర్నలిస్ట్ కోసం చూస్తున్నాను. పదికల్లా వస్తానన్న మనిషి ఇంతవరకూ రాలేదు" అంది గడియారంవైపు చూస్తూ.

కాలింగ్‌బెల్ మోగింది.

"అతనే అయ్యుంటాడు. అతనొచ్చి వెళ్లిపోతే ఆ డ్యూటీ తీరిపోతుంది. నాల్రోజుల కిందటే అపాయింట్‌మెంట్ తీసుకున్నాడు"

"అయితే నేనే సడన్‌గా వచ్చి డిస్టర్బ్ చేస్తున్నానన్నమాట!"

"నో...నో... నెవర్"

ఆమె అసిస్టెంట్ తలుపు తీసింది.

మరో గ్లాసుతో నిమ్మరసం పట్టుకొచ్చిందా అమ్మాయి.

"బైదవే- హి ఈజ్ మై ఫ్రెండ్ దివ్యరామ్. ఇతడు రాఘవ... జర్నలిస్ట్. 'ది డైలీ టెలిగ్రాఫ్'

కి లోకల్ రిపోర్టర్''

ఇద్దరూ కరచాలనం చేశారు.

రాఘవ చుట్టూ చూస్తూ, గ్లాసు టీపాయ్ మీద పెడుతూ అన్నాడు- ''మీ ఇల్లూ- అందులోకీ ఈ డ్రాయింగ్‌రూం చెప్తోంది. మీలో ఎంత ఈస్తటిక్ సెన్స్ ఉందో...''

నవ్వింది కాదంబిని. స్వచ్ఛంగా హృదయంలోంచి వచ్చిన నవ్వు.

ఇంటర్వ్యూ చాలా కాజువల్‌గా ప్రారంభమైంది...

''మీరు నాట్యం ఎవరి దగ్గర నేర్చుకున్నారు?''

''ఒకరి దగ్గర అని లేదు... చాలామంది దగ్గర నేర్చుకున్నాను''

''ఎన్ని రకాల నాట్యాలు చేస్తారు మీరు?''

''కూచిపూడి, కథక్, ఒడిస్సీ- ఈ మూడూ చాలా ఇంట్రస్ట్''

''అంటే- ఇంట్రస్ట్‌ని బట్టే ఆ మూడూ నేర్చుకున్నారా?''

''అవును! సాధారణంగా నా కిష్టమైన పనులూ- నాకు అభిరుచి వున్న పన్లే నేను చేస్తుంటాను. అఫ్‌కోర్స్! అవకాశం కూడా అలాగే కలిసొచ్చిందనుకోండి. ఇష్టంలేని పనులజోలికిగాని, మనుషుల జోలికిగాని పోను నేను. అలా వెళ్లడంవల్ల మనలోనే మనకి ఏదో తెలీని అన్‌ప్లెజెంట్‌నెస్ క్రియేటవుతుంది. కాదంటారా?''

''మీ అకడమిక్ క్వాలిఫికేషన్?''

''ఎమ్మే... సంస్కృతం''

''ఎక్కడ చేశారు?''

''ఇక్కడే... గ్రాడ్యుయేషన్ కలకత్తాలో. స్కూలింగ్- ఢిల్లీ పబ్లిక్ స్కూల్లో...''

కళ్లు విశాలంచేసి చూస్తున్నాడు దివ్యరామ్.

''మీ ఫాదర్...''

''ఇంగ్లీష్ ప్రొఫెసర్ ఎ.యు.లో. రెండేళ్ల కిందటే రిటైర్ అయ్యారు''

''ఇప్పుడెక్కడున్నారు?''

''ఢిల్లీలో... స్కూల్ ఆఫ్ లాంగ్వేజెస్‌వారు డైరెక్టర్‌గా తీసుకున్నారు''

''మీరిక్కడే ఉండిపోతారా?''

''నాకీ వైజాగ్ చాలా నచ్చింది. ఎన్ని ప్రాంతాలు తిరిగినా, ఇక్కడే సెటిల్ అయిపోదామనుకుంటున్నాను''

''ఒక విషయం అడుగుతాను. ఏమనుకోకపోతే- ఇది ప్రచురణకి ఇవ్వనులెండి''

''అడగండి''

ఒక్కనిమిషం నిశ్శబ్దం. రామ్ ఆతృతగా చూస్తున్నాడు.

''మీ నాన్నగారు ఎవరో దేవదాసీని ఉంచుకున్నారని... అహఁ! విన్నాన్లెండి. తప్పుగా అనుకోకండి! ఎంతవరకు నిజం?''

చురుగ్గా, చిరాగ్గా, అసహ్యంగా చూసింది కాదంబిని.

''మీ దయవల్ల ఎవర్నీ ఉంచుకోలేదు. మీలాంటి వారందరి ఎదుటనే ధైర్యంగా పెళ్లి చేసుకున్నారు. ఇది మీరు పబ్లిష్ చేసుకున్నా నాకేం చిన్నతనం లేదు. ఆవిడ భోగంజాతి స్త్రీ కాదు. సంగీత నాట్యశాస్త్రాల్ని ఎంతో అధ్యయనం చేసి జ్ఞానతృష్ణతో అలమటించిపోయిన కళాకారిణి. ఆ కళలు నేర్చుకోడానికి తగిన ఆర్థిక స్తోమత లేక, ఎవరూ ప్రోత్సహించేవారు లేక నిరాశానిస్పృహలతో తపించిపోతున్న సమయంలో మా తండ్రిగారు పరిచయమయ్యారు. అప్పట్నుంచీ అమ్మ జీవితం మరో మలుపు తిరిగింది. తర్వాత అంతా స్వయంకృషి... పైకి వచ్చిన వాళ్లమీద ఏవో గుసగుసలు... అఫ్‌కోర్స్! మామూలే అనుకోండి! అతిచిన్న వయసులోనే సంగీతనాట్యాల్లో నాకింత ఆసక్తి కలగడానికి కారణం మా అమ్మే! వాటిల్లో నేనెంతో ప్రావీణ్యం సంపాదించి, గొప్పదాన్ని కావాలని మా అమ్మ ఆశయం. కాని అవి ఏంటో అర్థంకూడా నాకు తెలీని వయసులోనే పోయింది మా అమ్మ...''

''ఎక్కడికి?'' ఆతృతగా అడిగాడు.

''కుళ్లిపోయిన పురుగులున్న ఈ ప్రపంచానికి దూరంగా చాలా దూరంగా తన కిష్టమైన లోకంలోకి- తనక్కావలసింది వెతుక్కుంటూ''

''అయాం సారీ! తర్వాత మీ నాన్నగారు మరో పెళ్లి చేసుకోలేదా?''

''పెళ్లిమీద పెళ్లి చేసుకోవడం మా నాన్న




గారి జీవితాశయం కాదు'' కాస్త గట్టిగానే అంది. మళ్లీ అంతలోనే కూల్‌డౌన్ అవుతూ ''నా కళకి సంబంధించిన ప్రశ్నలడగండి! మరీ పర్సనల్ విషయాలు నేను చెప్పదల్చుకోలేదు''

కొద్దిగా చిన్నబుచ్చుకున్నాడతడు. వెంటనే ఫీలింగ్ మార్చుకుంటూ ''కళ అంటే ఏమిటి మీ ఉద్దేశం?''

''ఎంతో జాగ్రత్తగా పరిశీలిస్తే, సృష్టిలోని అణువణువూ ఎంతో అందంతో తొణికిసలాడుతుంది. ఆ అందాన్ని చూసి, అనుభవించి, స్పందించే మానవుడు తన అనుభూతిని అవకాశం వస్తే ఆ ఆవేశాన్ని ఏదోవిధంగా వ్యక్తం చెయ్యాలనుకుంటాడు. ఆ ఎక్స్‌ప్రెషనే కళ. కళ అనేది ఒక తీరని దాహం. ఈ కళలోకి ఇన్‌వాల్వ్ అవడం ఒక తపస్సు! కళాకారుడికి ఆత్మతృప్తి అనేది ఉండదేమో! కళాకారుడికి సంతృప్తి ఒక జన్మలో పూర్తిగా లభించదు!''

''అనుభూతికి మీరు విలువిస్తారా?''

''చాలా... అనుభూతి లేందే కళేం వుంది?''

''రసన- రసజ్ఞత అంటే...?''

''సంస్కృతంలో రస అంటే అందం. కళా సంస్కృతిలో అనుభూతి వుంది. ఈ రెండూ సమ్మిళితమైతే అదే 'రసజ్ఞత'. లిటరల్‌గా చెప్పాలంటే రసజ్ఞత అంటే ఈస్తటిక్ సెన్స్ అన్నమాట. నా దృష్టిలో నిజమైన అందం అనుభూతికి అందేలా ఏ చిత్రకారుడూ చిత్రించలేనిది, ఏ కళాకారుడూ వ్యక్తం చెయ్యలేనిది...''

''అంటే...?''

నవ్విందామె.

''మిష్టర్ రాఘవా! నిజంగా మీ క్కావలసిందేమిటో, ఎలా నా జవాబు వుంటే మీకు సంతృప్తిగా వుంటుందో నాకర్థం కావడంలేదు. నేనొక డాన్సర్‌నన్న విషయం గుర్తుపెట్టుకోండి''

''అయాం సారీ! ఇంకా మీకు చిత్రకళ, శిల్పం, కవిత్వం వంటి వాటిమీద ఇంట్రెస్టుందా?''

''సాధారణంగా, ఒక కళనభిమానించే ప్రతి కళాకారుడూ అన్ని కళలనూ అభిమానిస్తాడు. అర్థం చేసుకుంటాడు. కాని- అన్నీ నేర్చుకోవడం కుదరదుగదా!''

''సంగీతం- ఏం నేర్చుకున్నారు?''

''సితార్''

''సంగీత నాట్యాలమీద మీరేదో రీసెర్చ్ కూడా చేస్తున్నారని విన్నాను. నిజమేనా?''

''సంగీతంమీద లేదు. నాట్యంమీద చేస్తున్నాను. కాని- అదీ ఏ యూనివర్శిటీ తరఫునా చెయ్యడంలేదు''

''ఎందుకని?''

''ఏదో అవార్డ్సు తీసుకుని, నేను పడ్డ కష్టమంతా లైబ్రరీల్లో మురగబెట్టడానికి కాదు. కళ అంటే అభిమానం- ఆసక్తి వున్న ప్రతివారికీ, నేను రీసెర్చి చేసి రాసే పుస్తకం ఉపయోగపడాలి''

''మీరు రాయబోయే గ్రంథానికి సోర్సెస్ ఏమిటి...? మెటీరియల్ కలెక్షన్‌కి ఫీల్డ్‌వర్క్ లాంటిదేమైనా చేస్తున్నారా?''

''ఆఁ...! ప్రాచీన నాట్య శాస్త్రగ్రంథాలు, దేవాలయాల మీదా కొన్ని కోటల్లో ఇంకా కొన్ని చారిత్రాత్మక భవంతుల్లోనూ ఉన్న నాట్యశిల్పాలు- వాటి చరిత్ర... అంటే ఆర్కియలాజికల్ సోర్సెస్...''

''మతం, దేవుడు, కులం... ఇత్యాది వాటి మీద మీ అభిప్రాయం?''

ఒక్కక్షణం మాట్లాడలేదామె. వేర్వేరు అంశాలు కట్టగట్టి అడిగాడేమిటా అనుకుంది.

''నా దృష్టిలో పైవి అన్నీ మనమే సృష్టించుకుని, మనమే నాశనం చేసుకున్నాం- వైల్డ్ ఏనిమల్స్‌లా. ఒకమంచి పర్పస్‌కోసం- లోకకల్యాణం కోసం నిలబడాల్సిన విలువల్ని మన స్వార్థంకోసం, ఈనాడు వాటిని నామరూపాల్లేకుండా నాశనం చేశాం.

దివ్యారామ్‌కి సంభాషణలో, చాలా సంగతులు అంతుబట్టలేదు.

కొంత ఆసక్తిగా, కొంత బోర్‌గా వుంది. ఆమె మాటల ద్వారా ఆమె వ్యక్తిత్వాన్నీ లోతైన ఆమె స్వభావాన్నీ అంచనా వేస్తున్నాడు.

''మీరు రాయబోయే గ్రంథంకోసం- ఇంతవ

రకు కలెక్ట్ చేసిన విషయాలేమిటో చెప్పగలరా?''

''ఏదీ...! ఇంకా హిస్టారికల్ కలెక్షన్ స్టేజ్ లోనే వున్నాను. నాట్యశాస్త్రం అతి ప్రాచీనమైంది. సోర్సెస్, ప్రూఫ్స్ దొరకడం చాలా కష్టం. దాదాపు సెకెండ్ సెంచురీ బిఫోర్‌క్రీస్ట్, భరతుడు నాట్యశాస్త్రం కనుక్కున్నాడు. ఇక్ష్వాకులు, శాతవాహనులు నాట్యకళని బాగా పోషించేరు. అమరావతి, నాగార్జున కొండమీద శిల్పాలు వీటికి నిదర్శనాలు. ఆ తర్వాత ఎలా ఉండేదో తెల్సుకోడానికి ఆధారాలున్నా ప్రూఫ్స్ లేవు. కాకతీయుల కాలంలో కూడా మంచి ప్రచారంలో వుందీ కళ. దీనికి ప్రూఫ్స్ శాసనాల్లో దొరుకుతున్నాయి. శిల్పరచనలు- సాహిత్యం కొంతవరకు నిదర్శనాలుగా చెప్పొచ్చు! రామప్పలోని నాట్యశిల్పాలు, ఇంకా వరంగల్ కోటలోనివీ...''

''ఆ రోజుల్లో నాట్యశాస్త్రంమీద గ్రంధాలేమైనా వున్నాయా?''

''ఉన్నాయి. కాకతీయ గణపతిదేవ చక్రవర్తి దగ్గర ఉండే జాయపసేనాని 'నృత్త రత్నావళి' అనే గ్రంథం రాశాడు. నాట్యశాస్త్రానికి సంబంధించి అదో ఉత్తమ ప్రమాణగ్రంథం. ఆనాటి దేశీనృత్యరీతులన్నీ వివరించాడందులో...''

''ఇంకా...?''

''అతడే గీతరత్నావళి కూడా రాశాడు. ఇందులో గీతాలు, అందులో నాట్యాలకి అప్లయ్ చేస్తూ రాసివుండాలి. అదివ్వుడు లేదు. దొరకదు. ''

''నాట్యంలో మీ స్వంత స్టయిల్‌నేమైనా తీసుకొద్దామనుకొంటున్నారా? లేక పాతవాటినే, అదేస్టయిల్లో అదే భావంతో...''

''నో! నో! అదేంలేదు. స్వంత స్టయిల్‌కోసం ప్రయత్నిస్తున్నాను''

''నాట్యం నేర్చుకుందామనుకునేవారికి మీ సలహా!''

''ఇది చాలా చిన్నప్పట్నుంచే మొదలు పెట్టమని. అలాగే ఎంతో సిన్సియర్‌గా- డివోటెడ్‌గా నేర్చుకోవలసివుంటుందని. అంటే- ఏదో పెళ్లి కోసమో, మరిదేనికోసమో, ఓ క్వాలిఫికేషన్‌గా చెప్పుకోడం కోసమో కాకుండా వుండాలని''

''చివరి ప్రశ్న! ఏమీ అనుకోవద్దు. మీరు వివాహం చేసుకోదలుచుకోలేదా? కళకే అంకితమయిపోతారా...?''

''వివాహమయినా, కాకపోయినా కళకే అంకితమవుతాను. నా కళనీ ఆదర్శాల్నీ- ఆశయాల్నీ గౌరవించి, నన్ను నన్నుగా ప్రేమించి అర్థం చేసుకొనేవ్యక్తి తటస్థపడినప్పుడు తప్పకుండా పెళ్లి చేసుకుంటాను''

''అలాంటివారెవరైనా తటస్థపడ్డారా?'' దివ్యరామ్‌ని ఓరకంట చూస్తూ అడిగాడు రాఘవ.

అది గమనించని కాదంబిని నవ్వేస్తూ- ''నా పెళ్లంటూ జరిగితే, మీలాంటి వారందరి సమక్షంలోనూ జరుగుతుంది...''

''థాంక్యూ!''

లేచాడతడు.

''మిమ్మల్ని చాలా విసిగించినట్టున్నాను'' వెళ్తూన్న సూచనగా అన్నాడు.

''అదేంలేదు. మంచినీళ్లేమైనా...''

''థాంక్స్! వద్దు... నమస్తే!'' అని కాదంబినికి చెప్పి, దివ్యరామ్‌తో కరచాలనం చేసి, అతనివైపు అదోలా చూస్తూ వెళ్లిపోయాడు.

తలుపువేసి వచ్చింది కాదంబిని.

ఆమెలోని ప్రతి కదలికనీ గమనిస్తున్నాడు రామ్. సన్నటి కాలిఅందెల శబ్దం. అది అతని చెవులకు అమృతంలా సోకుతోంది.

''రామ్! ఏమిటాలోచిస్తున్నారు?''

''ఏంలేదు''

''చాలా బోర్ అయిపోయివుంటారు. ఆఁ...! నాకు చాలా ఆకలిగా వుంది. రండి భోంచేద్దాం!''

''లేదు! నేను వెళ్లాలి!''

''అప్పుడే? అసలేమీ మాట్లాడనేలేదు''

''అవును! ఏమీ మాట్లాడలేదు''

''రండి!'' చొరవగా అంది మళ్లీ.

★ ★ ★

డోర్ లాక్‌చేసి, రెయిలింగ్స్ పట్టుకుని స్పీడ్‌గా




వరండా మెట్లు దిగుతున్న మంజూష చటుక్కున ఆగిపోయింది.

చిన్నగా నవ్వుతూ లోపలికొస్తున్నాడు సంపత్.

అప్రయత్నంగా ఆమె పెదవులు విచ్చుకున్నాయి.

"హాయ్ సంపత్! సరిగ్గా టైమ్‌కి వచ్చేరు"

ఆమె ముందుకి వంగి నవ్వుతూ, చిన్నగా సలామ్ చేశాడు.

"బయల్దేరుతున్నారా ఎక్కడికైనా?" అడిగాడు.

ఊఁ! మీరూ రండి!"

తలూపాడు సంపత్- నవ్వుతూ.

"అది సరే! ఏమిటంత సడన్‌గా పారిపోయారు ఆరోజు?"

అతని మొహంలో నవ్వు మాయమైంది... "ఏం లేదు. ఎందుకో... అలా వెళ్ళిపోవాలన్పించిది! అంతే!"

"వాడ్డూ యూ మీన్?"

"అంటే- ఇంక ఉండాలనిపించలేదూ అని అర్థం!"

నవ్వింది ఆమె. ఇద్దరూ బయటికొచ్చేరు.

"అరె!... ఈ బుల్లెట్? ఇదెక్కడ సంపాదించేరు?"

"నాదే ఇది. ఆ స్కూటర్ నా ఫ్రెండ్‌ది"

"వ్యాట్?" ఆశ్చర్యంగా అంది. "ఎంత ధైర్యం?"

"రండి!... ఎక్కడికెళ్ళాలి?"

"బ్లూ హెవెన్"

"అదెక్కడ? ఏమిటసలు?"

"బ్యూటీ క్లినిక్"

"ఓ.కే! పదండి!"

ఒక్క జర్క్‌తో స్టార్టయింది ఎన్‌ఫీల్డ్. ముందుకి పడబోయి చిన్నగా అరిచింది. చటుక్కున ఆపాడు.

"ఎన్‌ఫీల్డ్ అంటే- రిలాక్సింగ్‌గా వాలి వెనక్కి జారబడే మారుతీకారులో కూర్చున్నట్టుకాదు. జాగ్రత్తగా నన్ను పట్టుక్కూర్చోండి!" ఒక కాలు కింద ఆన్చి, కొద్దిగా తల వెనక్కి తిప్పి అన్నాడు.

అతని భుజంమీద చెయ్యి వెయ్యబోయి ఆగిపోయింది. ఒక్క ఉదుటున స్టార్ట్ చేశాడతడు. అనుకోకుండానే గట్టిగా పట్టుకుందతని భుజాన్ని.

రివ్వున సాగిపోయింది మోటైక్.

జగదాంబ జంక్షన్‌కి రాగానే అన్నాడు "ఎటెళ్ళాలి?"

"డాల్ఫిన్ ఎదురుగా!..."

బ్లూ హెవెన్ ముందు ఆపి- లోపలికి నడిచారిద్దరూ.

"అంత భయపడతారేం బుల్లెట్‌కి?"

చురుగ్గా చూసింది మంజూష. జవాబేమీ ఇవ్వకుండా లోపలికెళ్ళింది.

మిసెస్ షాంప్లీ "యస్ ప్లీజ్" అంటూ మర్యాదగా విష్ చేసింది.

"మీరిక్కడే కూర్చోండి ఈ మాగజైన్స్ చూస్తూ..." కెప్టెన్ సంపత్ కుమార్‌ని ఫ్రంట్ ఆఫీస్‌లోనే ఆపేసి, మంజూషతో లోపలికి నడిచింది.

పావుగంట తర్వాత బయటికొచ్చింది.

సోఫాలో వెనక్కి వాలి చెయ్యి కళ్ళకడ్డం పెట్టుకుని కూర్చున్నాడు సంపత్.

"బాగా బోర్ అయిపోయారా సంపత్?"

లేచి నిలబడ్డాడు సంపత్.

"ఇట్సాల్‌రైట్! కాని కాంపెన్సేషన్ తీసుకోందే వదలను"

బయటికి రాగానే మంజూష అంది.

"ఏమిటా కాంపెన్సేషన్?"

"నాతో డాల్ఫిన్ కొచ్చి లంచ్ తీసుకోవడం"

నవ్వింది మంజూష.

"అంతేనా? పదండి!"

★ ★ ★

కాందబిని అసిస్టెంట్ టేబుల్‌మీద అన్నీ అమర్చి వెళ్ళిపోయింది.

"ఇలా ఉంటాయండీ ఈ రిపోర్టర్ల ప్రశ్నలు... అసలు విషయాలకన్న పర్సనల్ విషయాలే ఎక్కువగా కావాలి..." నెయ్యి వడ్డిస్తూ అంది కాదంబిని.

''మధ్యమధ్య నావైపు అలా చూస్తాడేం?... కొంపదీసి అసహ్యంగా ఏం రాయబోడు కదా!'' దివ్యరామ్ ప్రశ్న.

జర్నలిస్టులకి గాసిప్ కాలమ్‌మీద ఎక్కువ ఇంట్రస్టుంటుందని, ఆమధ్య ఎప్పుడో ఎక్కడో చదివిన విషయం గుర్తొచ్చిందతడికి.

''రాయడు లెండి!'' ఒక్క క్షణం ఆగి అంది- ''రాసినా నష్టం లేదు''

ఏమీ అనలేదు రామ్.

''కొంతమందికైతే కేవలం నా కులం-మతంమీదే దృష్టంతా. అవేమీ నాకు లేవంటే నమ్మరే?!... ఇంకొందరికి నా ఫామిలీ బ్యాగ్రౌండూ- స్టేటస్సూ కావాలి!... నేనేం చెయ్యను! అమ్మ, నాన్న నాకవేమీ తెలీకుండా పెంచేరు...''

రామ్ ఆశ్చర్యంగా చూశాడామెను.

''అవునండీ! ఈ రిపోర్టర్ల సైకాలజీ గమ్మత్తుగా ఉంటుంది. ఎలాగూ అతడు మనతో మాట్లాడిన ప్రతిమాటా పబ్లిష్ చెయ్యడు. బాగా కుదించేసి, క్రిస్పుగా రాస్తామంటూ నగానికి పైగా మింగేస్తారు.''

''అసలు- కులాలు, మతాలమీద మీ అభిప్రాయం ఏమిటి?''

సూటిగా చూసింది కాదంబిని దివ్యరామ్‌ని.

అతడిముఖం నిర్మలంగా ఏ భావమూలేకుండా వుంది.

''కులాలనేవి ముఖ్యంగా వృత్తుల్నిబట్టి వచ్చేయి... మరో అర్థంలో చెప్పాలంటే ఈక్వల్ డిస్ట్రిబ్యూషన్ ఆఫ్ లేబర్ అన్న మాటే!... నాగరికత పెరిగేకొద్దీ మన అవసరాలు ఎన్నో పెరిగాయి. కాని మనక్కావలసినవన్నీ మనమే తయారుచేసుకోలేం కదా! సో... అవసరాలు ఎక్స్ఛేంజ్ జరిగాయి. ఒక్కొక్క పనిలో ఒక్కొక్కరికి ప్రావీణ్యం వుంటుంది. ఈవిధంగా అవసరాలతో మ్యూచ్‌వల్ డిపెండెన్స్‌తో దగ్గరగా అల్లుకుపోయిందీ సంఘం... ఎవరి ప్రావీణ్యాన్నిబట్టి వారితో ఏర్పడ్డ వృత్తులే ఈనాడు కులాలుగా చెలామణీ అవుతున్నాయి నిత్యజీవితంలో... ఈ రోజుల్లో... కులాలకున్న ఈ అర్థంలేని ప్రాధాన్యత చూస్తూంటే ఆశ్చర్యంవేస్తుంది. ఇంక మతం అంటారా!?''

ఎలా చెప్పాలో తెలియదన్నట్టుగా ఆగింది. ఆసక్తిగా చూస్తున్నాడతడు.

''మన గమ్యాన్ని చేర్చే మానవత్వపు మార్గం''

దివ్యరామ్ ఏమీ మాట్లాడలేదు. ఇంట్రస్టు లేనట్టనిపించింది.

ఆ టాపిక్‌కి అంతటితో కర్టెన్ వెయ్యడం మంచిదనిపించింది కాదంబినికి.

''అరె! ఏం తినడం లేదు మీరు! నచ్చడం లేదా ఏమీ!... ఈసారి మీరొచ్చినపుడల్లా నేనే చేస్తాను... ఈసారేదో- మా అసిస్టెంట్ పాకప్రావీణ్యం మరి!''

''అబ్బే! అదేం లేదు. హాయిగా తింటున్నాను... అది సరే! మీ నేటివ్- ఇదేనా అసలు?''

''ఒక ఊరు అనిలేదు. చెప్పేనుగా! అలా ఊళ్లూ- రాష్ట్రాలూ అన్నీ మనవే! ఇక్కడైనా ఎన్నాళ్ళుంటానో తెలీదు. కాని, ఇక్కడే ఎందుకో సెటిల్ అయిపోవాలనిపిస్తోంది... ముఖ్యంగా ఈ వాతావరణం...''

రామ్ చటుక్కున తలెత్తాడు.

క్షణం సేపు ఇద్దరి కళ్ళూ కలుసుకున్నాయి...

''అసలు నేను పుట్టింది శ్రీకాకుళం- మా అమ్మా- నాన్నా కలవడం అక్కడే! నాకు పదేళ్ళొచ్చేదాకా అక్కడే వున్నాం!... ఆ ఊరూ- పక్కనే ఉన్న అరసవల్లి, శ్రీముఖలింగం, శ్రీకూర్మం, శాలిహుండం... ఇవన్నీ తల్చుకుంటే ఏదో హాయిగా ఉన్నట్టనిపిస్తుంది'' పెరుగు వడ్డిస్తూ అంది.

''బ్రదర్స్, సిస్టర్స్ మీకు...?'' దివి ప్రశ్న.

''ఎవరూ లేదు. అలా ఒంటరిగానే పెరిగాను'' గొంతులో సన్నగా బాధ.

వాచ్ చూసుకుంటూ అన్నాడు దివ్యరామ్- ''ఇంక నే వెళ్తాను...''

''కాస్సేపు రెస్ట్ తీసుకుని వెళ్ళండి!''

''ఏమిటి! రెస్టా?'' నిర్లిప్తంగా అని ''లేదు!'' అంటూ లేచాడు రాం. అనంతభావాలు గోచరించాయి కాదంబినికి.

★ ★ ★





రెస్టారెంట్‌లోని 'వెజ్ సెక్షన్'...

సంపత్ మంజూష ఎదురెదురుగా కూర్చు న్నారు.

ఆమెకెదురుగా పెద్ద అద్దం. అందులో కెప్టెన్ తల వెనుక భాగం కన్పిస్తోంది.

అప్రయత్నంగా తన తలమీద చెయ్యిపెట్టి నిమురుకుంది మంజూష.

సాఫ్ట్‌గా, సిల్కీగా తగిలింది. నీట్‌గా చెక్కిన ట్టున్న ఐబ్రోస్.

"ఇంతకీ ఏం ఛేంజ్ చేయించారేమిటి లోపల?"

"ఏమీ డిఫరెన్స్ కనబడ్డంలేదా?" ఆశ్చ ర్యంగా అడిగింది.

"ఏం లేదు!" ఇంకాస్త పరిశీలనగా చూస్తూ అన్నాడు.

"చూడండి! ఎంత సాఫ్ట్‌గా వుందో!" జుట్టు చివర్లని అందించింది.

బేరర్ చల్లటి మంచినీళ్ళు తెచ్చిపెట్టాడు.

"పెళ్ళవక ముందు మీరేం చేసేవారు?"

మళ్ళీ నవ్వింది. "ఏం ప్రశ్న అది? ఏదో సినీతార నడిగినట్టు?"

"ఇందులో నవ్వడానికేముంది? మరింకెలా అడగాలో నాకు తెలీదు"

చిన్నపిల్లాడిలా అనిపించాడొక్క క్షణం.

"మద్రాస్ యూనివర్సిటీలో ఎమ్మే ఎకన మిక్స్ చేస్తుండేదాన్ని!"

"నిజం?!"

రెండు ప్లేట్లలో భోజనం తెచ్చిపెట్టేడు బేరర్.

"ఎమ్మే అవగానే పెళ్ళయిపోయిందా?"

"ఊఁ!"

"మీ ఇండివిడ్యువల్ ఇంట్రస్టా? అరేంజ్‌డా?"

"అరేంజ్‌డే!"

కొద్దిగా ఆశ్చర్యంగా చూశాడతడు.

"హౌ డూ యూ లైక్ దివ్యరామ్?"

"దివికేం?! హి ఈజ్ ఎ సిన్సియర్ ఇండస్ట్రి యలిస్ట్!"

"ఐ మీన్! ఒక మనిషిగా... భర్తగా..."

"మిష్టర్ సంపత్! ప్లీజ్ డోంట్ ఎక్సీడ్ యువర్ లిమిట్స్!" ఆశ్చర్యంగా చూసేడతడు...

నవ్వేసి అన్నాడు- "సరే! ఇంకా మీ హాబీ లేమిటి?"

"పెయింటింగ్స్ కాకుండానా!?... ఊఁ!... ఫొటోగ్రఫీ. ఐ లైక్ ఫొటోగ్రఫీ యూ నో! ఎంబ్రా యిడరీలు, చిన్నచిన్న హేండీక్రాఫ్ట్స్, పుస్తకా లు, మ్యూజిక్ ఎప్రిసియేషన్, మంచి సిన్మాలు చూడ్డం"

"వెరీగుడ్ టేస్ట్! నాకూ అవన్నీ చాలా ఇష్టం!"

"ఏవన్నీ?" ఫ్రూట్‌సలాడ్ తింటూ అంది.

"అదే! మ్యూజిక్, పిక్చర్స్, ఫొటోగ్రఫీ... మిగ తావేం రావు. బట్ ఐ అప్రిషియేట్ ఎనీ ఆర్ట్"

"అదుంటే చాలు ముఖ్యంగా!" మెరిసే కళ్ళతో అంది.

"స్పోర్ట్స్ అంటే ఇష్టమేనా?"

"చాలా!... ముఖ్యంగా ఇండోర్ గేమ్స్. క్షణం ఆగి, "బైదవే- మీకు స్విమ్మింగ్ వచ్చా? అసలు ఏయే స్పోర్ట్స్ ఆడతారు?" ఇంట్రస్టింగ్‌గా అడి గింది.

"ఫుట్‌బాల్, క్రికెట్, టి.టి. ఛెస్, కార్డ్స్ ఆడతాను. ఆరేళ్ళకిందట వెస్ట్ బెంగాల్ స్వి మ్మింగ్ ఛాంపియన్‌షిప్ గెలుచుకున్నాను"

"నిజమా?" ఎగ్జయిటింగ్‌గా అంది. "ప్లీజ్! నాకు టేబుల్‌టెన్నిస్, స్విమ్మింగ్ నేర్పరూ?"

"తప్పకుండా"

వాచ్ చూసుకుంది మంజూష. మూడవుతోంది.

"ఆఁ!... ఒక్క విషయం చెప్పండి! మీకు పెళ్ళయిన విషయం నాకు ఎందుకు చెప్పలే దు?"

మంచినీళ్ళు తాగుతూ అతనివైపు చూ సింది.

ఏం మాట్లాడలేదు.

"చెప్పండి!"

"ఏం చెప్పమన్నారు?... చెప్తే ఏం చేసేవా రు?"

అతనేం జవాబు చెప్పలేదు.



"డాల్ఫిన్‌కి మీతో రమ్మని ఇంత ఈజీగా అడిగేవారు కాదు... అంతేనా? నిజానికిప్పుడు నా అంతట నేనే వచ్చేను. మీరడక్కపోయినా నేను తీసుకొచ్చేదాన్ని లంచ్‌కి. ఎందుకంటే- ఇంట్లో వంటచేసి రాలేదు కాబట్టి!"

అర్థంకానట్టుగా చూసేడతను.

"కమాన్! లెట్స్ మూవ్..." లేచాడు.

బుల్లెట్ బుల్లెట్‌లాగానే దూసుకుపోయింది.

★ ★ ★

రాత్రి ఎనిమిదయింది-

బెడ్‌మీద బోర్లాపడుకుని, రస్సెల్ 'మేరేజ్ అండ్ మోరల్స్' చదువుతోంది మంజూష.

గదిలో ఫ్యాన్ తిరుగుతున్న చప్పుడు తప్ప- అంతా నిశ్శబ్దం.

సడన్‌గా ఎక్కడినుంచో మంచి మ్యూజిక్... నిశ్శబ్దాన్ని సన్నసన్నగా చీల్చుకుంటూ.

మత్తుగా కళ్ళు మూసుకుంది.

దగ్గరగా... మరింత దగ్గరగా... చాలా దగ్గరగా వచ్చి- ఆగిపోయిది.

వెనక్కి తిరిగి చూసింది. సంపత్ గుమ్మంలో నిలబడి వున్నాడు. చటుక్కున లేచింది.

"ఓహ్! సంపత్!... ఇప్పుడే- ఇప్పుడే నీ గురించి ఆలోచిస్తున్నాను"

"ఏమని?"

"ఇప్పుడే ఏదో మంచి మ్యూజిక్ వినిపిస్తుంటే, ఎందుకో నువ్వే గుర్తొచ్చేవు"

"మ్యూజిక్‌కీ- నాకూ ఏం సంబంధమబ్బా?"

"ఏమో మరి?" చిన్నగా నవ్వుతూ బెడ్ మీంచి లేచింది.

"వండ్రఫుల్! నిజంగా బ్లూ హెవెన్ లా వుంది!"

"ఏమిటి?"

"ఈ రూమ్... లైట్ బ్లూ డిస్టెంపర్... లైట్ బ్లూ కర్టెన్లు... ఆ పెయింటింగ్స్... బ్లూ లైట్... లైట్ బ్లూ బెడ్‌మీద ఆకాశంలోంచి దిగుతున్న దేవతలా మీరు..."

గలగలా ప్రవహిస్తున్న సెలయేరులా నవ్వింది మంజూష.

అతని చేతిలోని లిల్లీలగుత్తి అందుకొని "థాంక్యూ! థాంక్స్ ఎలాట్ సంపత్" అంది.

అంతలో ఎదురుగా అద్దంలో తన మొహం జిడ్డుగా, జుట్టు అస్తవ్యస్తంగా... కనిపించింది.

"ఎవరైనా చూస్తే జడుసుకొనేట్టుగా వుంది నా రూపం... ఓన్లీ ఫైవ్ మినిట్స్... స్నానం చేసి వస్తాను" గబగబా బాత్రూం వైపు వెళ్లింది.

బెడ్‌మీదున్న పుస్తకాన్ని చేతిలోకి తీసుకున్నాడు.

బాత్రూమ్‌లోంచి షవర్ చప్పుడు...

పగలంతా పెద్దగా పనేంలేకపోయినా, ఎగ్జాస్ట్ అయిపోయిన శరీరం- చల్లటి జల్లు మీదపడుతూంటే, హాయిగా మేఘాల్లో తేలిపోతున్నట్టు వెన్నెల్లో తడిసిపోతున్నట్టు మంచులో జారిపోతున్నట్టుగా వుంది.

ఆ మ్యూజిక్... ఓహ్!... వండ్రఫుల్!

మళ్ళీ ఎక్కడినుండి వస్తోంది? ఎంత హాయిగా గాలితోపాటు అలలు అలలుగా తేలి... అరె! ఇంత దగ్గరగా.

షవర్ ఆగింది...

సంగీతం ఆగలేదు...

చిన్నచిన్న పువ్వులున్న తెల్లటి ఆర్గండీ చీరలో ట్రేతో వచ్చింది-మంజూష.

"ఓహ్! ఎక్సలెంట్!...మౌత్ ఆర్గన్ వాయిస్తారని ఎప్పుడూ చెప్పలేదేం? ఐలవ్ మౌత్ ఆర్గన్"

"చూశావా మరి! నీ కిష్టమైన మౌత్ ఆర్గన్ వాయించినందుకు మరి నాకు ప్రెజెంటేషన్ ఏమిటీ?"

"ఇదుగో!" ట్రే ముందుకి జాపింది.

రంజన ఇంటికెళ్ళేసరికి ఒకసారిలాగే స్నానం చేస్తోంది. అంతసేపు నేనేం చేస్తాను?... మౌత్ ఆర్గన్ వాయిస్తూ కూర్చున్నాను. బాత్రూంలోంచి వచ్చేక రంజన ఎంత మంచి ప్రజెంట్ ఇచ్చిందో తెలుసా?..."

"ఏమిటదీ?" ఆసక్తిగా అడిగింది.

"నువ్వూ ఇస్తానంటే చెప్తాను"

"ఎందుకివ్వలేను?" కాస్త ఉక్రోషంగా అంది.

ఆమె మొహంలోకి డీప్‌గా చూసి నవ్వేశాడ




తడు...

"వద్దులే!.... ఇంకెప్పుడైనా చెప్తాను"

"అబ్బా! ఇప్పుడే చెప్పాలి!"

"తర్వాత చెప్తాను. ఇక్కడ చాలా ఉక్కగా వుంది. బాల్కనీలో కూర్చుందామా! పద!"

లేచారిద్దరూ.

బాల్కనీలో టీపాయ్‌మీదా అదే రస్సెల్ నవల... కాకపోతే కాస్త పాత ఎడిషన్... తదేకంగా చూడసాగాడు సంపత్.

"రస్సెల్ చాలా ఇష్టం నాకు. అతని ఫొటో చూడు! ఎంతో ఫాదర్లీ ఫీలింగ్ వస్తుంది. అలాంటి ఇంటలెక్చువల్ అండ్ అండర్ స్టాండింగ్ ఫాదర్ వుంటే ఎంత బావుంటుందో కదా!"

"ఇంతకీ ఏమంటాడు మేరేజ్‌లో మోరల్స్ గురించి?"

"మోరల్స్‌కోసం మనిషి బతకడం లేదు. మనిషి స్వేచ్ఛని బాధించే మోరల్స్ అనవసరం. ఏమాత్రం మనసులు కలవకపోయినా, హృదయాలు స్పందించకపోయినా, ప్రేమ-అండర్‌స్టాండింగ్ లేకపోయినా ఒకరంటే ఒకరికి ఏ మాత్రం పడని వ్యక్తులు, తప్పని సరిగా ఒకే రూఫ్‌కింద కలిసి బతకనక్కర్లేదంటాడు.

గట్టిగా నవ్వేడు సంపత్.

"ఇది తెలుసుకోడానికి -ఆ బుక్ అంతా చదివి బుర్ర పాడుచేసుకోవాలా? ఈ మాట చెప్పడంకోసమేనా మీ రస్సెల్ అంత కష్టపడ్డాడు?... కాస్త బుర్ర వున్నవాడెవడైనా చెప్పేది చేసేది, కూడా అదే! అయినా డైవోర్స్‌దాకా వెళ్ళినపుడు అసలు పెళ్ళెందుకు చేసుకోవాలి?"

ఆశ్చర్యంగా చూసింది మంజూష.

"అంటే?.... మరెలా?...."

"ఏమిటి... ఎలా...? మనకిష్టమయినవాళ్ళతో హాయిగా కలిసి- ఫ్రీగా వుండొచ్చుగా!"

"కాని... మరి సొసైటీ!"

"ది హెల్ విత్ యువర్ బ్లడీ సొసైటీ! సొసైటీకోసం పెళ్ళి. సొసైటీలో స్టేటస్ కావాలి! పొజిషన్ కావాలి. మరి ఆ సొసైటీ పెట్టే రూల్స్ మాత్రం వద్దు! అసలు- నిజం చెప్పాలంటే, ఎవరు పెడుతున్నారు రూల్స్? ఎవరికి వాళ్ళే పెట్టుకుంటున్నారు. తమనితామే బంధించుకుంటున్నారు... తమ నీడని చూసి, తామే భయపడుతున్నారు. ఎంతో సిన్సియర్‌గా- ఎవ్వరికీ హానికలగనివిధంగా నీ ఇష్టం వచ్చిన పనిచేస్తే ఎవరు కాదంటారు?"

ఆగాడతడు...

అతడ్నే చూస్తోంది- మంజూష.

"దేనికయినా ధైర్యం ఉండాలి... నిజాయితీ ఉండాలి... రియలైజేషన్ వుండాలి. ఇష్టంలేని సొసైటీకి తలవంచేకన్నా, సొసైటీని కాదని వచ్చేయొచ్చుగా! సొసైటీలోంచి బయటికి వచ్చేస్తే, ఇంక దానికి సంబంధించిన రూల్స్ పాటించక్కర్లేదుగా!"

"ప్రతివాళ్ళూ నీలాగే అనుకొని, సొసైటీ బయటికి వచ్చేశారనుకో. అదో సొసైటీ ఫాం అవుతుంది"

"అవనీ... కాని అప్పుడా సొసైటీ షేప్ మరోలా వుంటుంది. అది ఫ్రీ సొసైటీ! మనిషిమీద మనిషి చూపించే అర్థంలేని అధికారపు సొసైటీకాదు. సొసైటీ విత్ రియలైజ్డ్ పీపుల్"

"నిజమే! బలహీనుడి స్వాతంత్ర్యాన్ని బంధించే బలవంతుల అనాగరిక సొసైటీ"

ఆమె మాట పూర్తికాకుండానే నవ్వేడతడు-

"బలహీనుడికి అసలు స్వాతంత్ర్యం ఎక్కడుంటుంది?"

"కరెక్టే అనిపిస్తోంది"

"అన్పించడమే కరెక్ట్! జీవితాన్నీ స్వేచ్ఛనీ, ప్రేమించే వారెప్పుడూ అర్థంలేని రూల్స్‌కీ ప్రెషర్స్‌కీ లొంగిపోరు. తమ శరీరంలో ఆఖరి రక్తపుబొట్టు కూడా కరిగిపోయేంతవరకూ స్వేచ్ఛకోసం పోరాడుతూనే ఉంటారు. ఆ పోరాటమే స్వేచ్ఛ. పోరాడ్డంలోనే ఉంది లైఫ్"

డీప్‌గా- అడ్మైరింగ్‌గా చూస్తోంది మంజూష.

"నువ్వింత లోతుగా ఆలోచించగలవని నాకు తెలీదు సంపత్?"

"ఐ లవ్ ట్రూ అండ్ ఫ్రాంక్ ఫ్రెండ్షిప్"

"నాకూ అంతే! ఫ్రెండ్షిప్‌లో ఆడా-మగా, గొప్పా-బీదా, మేరీడ్- అన్ మేరీడ్... ఇలాంటి తేడాలుండకూడదు. స్నేహంలో మనసులు

కలవాలి. రెండు హృదయాల మధ్య డైరెక్ట్‌గా ప్రేమ 'అండర్ స్టేండింగ్' అనే వంతెన ఆలంబనగా బలంగా నిలవాలి''

చల్లటి గాలి, నైట్‌క్వీన్ పరిమళం... నల్లటి ఆకాశంమీద నక్షత్రాల వెలుగును దోచేయాలని చూస్తున్న అర్ధచంద్రుడు.

సంపత్ జేబులోంచి సిగరెట్ పేకెట్ తీశాడు- ''విత్ యువర్ పర్మిషన్'' అగ్గిపుల్లతీసి వెలిగించాడు.

''ఐ డిడింట్ పర్మిట్ యూ'' నవ్వుతూనే అంది.

నోట్లోంచీ, ముక్కులోంచీ పొగ వదుల్తూ నవ్వేడు.

లోపలికెళ్లి యాష్ ట్రే తెచ్చి టీపాయ్‌మీద పెట్టింది.

అందంగా పాలరాతి డస్ట్‌తో చేసిన డిజైన్డ్ యాష్ ట్రే.

''ఇంత మంచి ఏష్‌ట్రే... పాపం! ఇవాళ మూడింది'' నవ్వుతూ అంది.

''మరి- యాష్‌ట్రే పర్పస్ ఏంటీ?'' యాష్ దులుపుతూ అన్నాడు.

బాల్కనీలోని పింగాణీ కుండీల్లో రంగు రంగుల గులాబీలు చిన్నగా నాట్యం చేస్తున్నాయి.

సిగరెట్‌పీక యాష్‌ట్రేలో కుక్కాడు సంపత్.

మరో సిగరెట్ పెదవుల మధ్య ఉంచుకోబోతూండగా లాక్కుంది మంజూష- ''ఇంక పర్మిషన్ లేదు''

''ఇచ్చెయ్! దగ్గరలో ఏమీ షాపులు కూడా లేవు. అంతదూరం వెళ్లే ఓపికలేదు మరి నాకు'' చెయ్యి ముందుకిజాపి అన్నాడు.

''ఊహూం... నేనివ్వను. ఐ డోంట్‌లైక్ స్మోకింగ్''

అప్పుడు చూశాడు ఆమె చేతిలో లిల్లీని. అంతసేపూ ఆమె వాటిని వాసన చూస్తూ కూర్చుందని గ్రహించాడు.

''అయినా నిన్ను కాల్చమనలేదుగా'' అన్నాడు కొంటెగా.

''సరేలే! ఐ డోంట్ లైక్ యూ టూ స్మోక్'' 'యూ' మీద స్ట్రెస్ చేస్తూ అంది.

''సీ బేబీ! నేను కావాలంటే, నీ దగ్గర్నుంచి ఎలాగైనా తీసుకోగలను. తర్వాత మరి నన్ను తిట్టకూడదు'' కుర్చీలోంచి లేచి ఆమెముందు కొచ్చేడు.

మంజూష మరింత గట్టిగా రెండు చేతుల మధ్య పట్టుకొని అంది. ''ఒక షరతుమీద అయితే... నాకిష్టమైన పాటలు- మౌత్ ఆర్గన్‌లో వినిపించాలి''

ఒక్కక్షణం ఆలోచించి, చిన్నగా నవ్వి మళ్లీ కూర్చున్నాడు.

''ట్యూనా? స్మోకా? ఏది ముందు?'' అడుగుతూనే ఆర్గన్‌మీద పాటందుకున్నాడు.

తర్వాత- అలా, అలా ఒకరికొకరికి ఇష్టమైన పాటలు ఒకదానివెంట ఒకటిగా...

అతని మొహంలోకే డీప్‌గా చూస్తోంది మంజూష.

పెద్ద కళ్లు, విశాలమైన నుదురు, ఆర్మీ కట్- హెయిర్, స్నఫ్‌కలర్ ప్యాంట్‌పై క్రీమ్‌కలర్ షర్ట్, వయొలెట్ మిక్స్‌డ్‌బ్లాక్ పెదాలమధ్య చిత్రంగా కదుల్తున్న ఆర్గన్... చాలా కాన్సెంట్రేటెడ్‌గా వాయిస్తున్నాడతడు...

సంతోషంగా చప్పట్లు కొడుతూ అంది... ''మార్వలెస్''

''థాంక్యూ! నేనింక వెళ్తాను... పదవుతోంది!''

ఉలిక్కిపడింది మంజూష.

''పదా!?... ఆc...! ఇవాళ నాతో డిన్నర్ తీసుకో. చాలా రాత్రయింది కదూ!''

''లేదులే... పదిగంటలకి నిన్నిబ్బంది పెట్టడం...''

''ఇబ్బందేముంది? పదినిముషాల్లో చేసేస్తాను...''

''ఇప్పుడింకా చెయ్యాలా?''

''అరె! ఎంతసేపు...? నువ్వలా కబుర్లు చెప్తూ ఉండు. ఈలోగా రామ్ కూడా వచ్చేస్తాడు''

పరుగెడుతున్నట్టుగా వెళ్లింది లోపలికి. వెనకే నడిచాడు సంపత్.

స్టౌమీద కుక్కర్ పడేసి వచ్చింది.

''నీకేం ఇష్టం?'' అంది స్టీరియో ఆన్‌చేస్తూ.

''ఏ గడ్డి అయినా తినగలను నేను...''




రిలాక్సింగ్‌గా సోఫాలో వెనక్కివాలి, కళ్లు మూసుకున్నాడు.

వంటింట్లోంచి- చిన్నగా గిన్నెలచప్పుడు... డొమెస్టిగ్గా ఏవో పోపుల వాసనలు...

ఒక్కక్షణం- ఎంతో హాయిగా, సెక్యూర్డ్‌గా అనిపించింది.

దాదాపు ఓ నలభై నిముషాల తర్వాత...

దగ్గరగా మంజూష అడుగుల శబ్దం...

కళ్లు విప్పాడు.

నవ్వింధామె- "పద! భోంచేద్దాం!"

"మరి దివ్యరాంగారు?"

"ఫోన్‌చేస్తానుండు!" రిసీవరెత్తింది.

★ ★ ★

నెంబర్ డయల్‌చేసి రిసీవర్ చెవిదగ్గరగా పెట్టుకున్నాడు రామ్.

"హలో! దివ్యరామ్ హియర్!"

కాదంబిని కూడా ఇంకా మాట పూర్తికా కుండానే దివ్య ఫోన్ అని గుర్తుపట్టగలిగింది వెంటనే.

"మీరు... ఆరోజునుంచీ రాలేదేం?"

నవ్వేడు- "మీకు తెలుసుకదా!"

"ఏం చేస్తున్నారిప్పుడు?"

"ఏంలేదు. ఆడిటింగ్ ఇందాకే పూర్త యింది. ఇంటికి వెళ్దామనుకుంటున్నాను. వెళ్లే ముందు మీకోసారి ఫోన్ చెయ్యాలని పించింది"

"మంచిపని చేసేరు. వెళ్లేముందు ఇక్కడికో సారి వచ్చి వెళ్లండి"

"ఎందుకు?"

"మీకో స్వీట్ సర్‌ప్రయిజ్"

వాచ్ చూసుకున్నాడు దివ్యరామ్.

తొమ్మిదవుతోంది.

కారిడార్లో గబగబా నడిచి పోర్టికోలోకొచ్చి, కారులో కూర్చున్నాడు.

రివ్వున కారు దూసుకుపోయింది కాదంబిని ఇంటివైపు...

ట్యూనింగ్‌గా కాలింగ్‌బెల్ మోగడంతో, కాదంబిని ఇంటి తలుపులు తెరుచుకున్నాయి.

గుమ్మంలోనే ప్రత్యక్షమయిన ఆ సౌంద ర్యాధి దేవతని చూసి, ఒక్కక్షణం నోటమాట రాక అలాగే నిలబడిపోయాడు దివ్యరామ్.

వెండిజరీ పువ్వులున్న తెల్లటి షిఫాన్ చీరలో. ఏంజెల్‌లా విశాలమైన ఆ నుదుట మెరుస్తున్న సింధూరం...

"ఏమిటలా చూస్తున్నారు?" ముందుకు కదుల్తూ అంది. సన్నటి కాలిఅందెల శబ్దం.

"ఏ దేవలోకాల్లోంచో నాకోసం దిగివచ్చిన- ఈ దేవత ఎవరా అని చూస్తున్నాను"

నవ్వింధామె- జలతరంగిణిలా.

"ఈమెనే కాదంబిని అంటారులెండి" సోఫాలో కూర్చుంటూ అంది.

"ఐ.సీ! కాదంబిని అనే ఈ దేవతకి నేనేం చెయ్యవలసివుంది? వాట్ కెన్ ఐడూ ఫర్ దిస్ ఏంజెల్ కాదంబినీ?"

"ఇవాళ నా పుట్టినరోజు..."

"నిజమా? ముందే ఎందుకు చెప్పలేదు?"

"చెప్తే ఏం చేసేవారు?"

"అప్పుడే పుట్టిన పాపాయిని ఎవరైనా సరే ఏం చేస్తారు?"

కొద్దిగా ఆశ్చర్యంగా చూసి, మళ్లీ నవ్వింది- స్వచ్ఛంగా... స్ఫటికంలా... రామ్ హృదయంలోకి దూసుకుపోయిందా నవ్వు.

సడెన్‌గా లేచి నించున్నాడు రామ్.

"నాతో రండి!"

"ఎక్కడికి?" ఆశ్చర్యంగా అడిగింది.

"రండి! చెప్తాను"

కాదంబిని కారెక్కగానే ఒక్క ఉదుటున స్టార్ట్ చేశాడు రాం.

అరవైలో దూసుకుపోతోంది మారుతీ. తొమ్మిది దాటిపోవడంవల్ల షాపులన్నీ మూసేశా రు. చిన్న చిన్న షాపులు కూడా అప్పుడే మూసేస్తున్నారు. మరింత స్పీడ్‌గా పోనిచ్చాడు రామ్.

చిన్న నగలషాపు... ఈమధ్యనే ఓపెన్ చేసిన షాపు అది. సిటీలో అంతగా పాపులర్ కాలేదింకా. అయినా దివ్యరామ్‌కి తెలీని షాపులుగాని, దివ్యరామ్‌ని తెలియని షాపువాళ్లు





గాని లేనట్టే చెప్పాలి- ఆ బజార్‌లో.

"కొత్తరకం నగలేమైనా చూపించండి"

"రామ్! ఎందుకు రామ్! ఇప్పుడివన్నీ?! నగలంటే నాకు పెద్ద ఇంట్రస్టు కూడా లేదు" నెమ్మదిగా అంది.

ఏవేవో చూపిస్తున్నాడు షాపు యజమాని.

"దీవీ! ప్లీజ్..."

"ప్లీజ్! నాకోసం..."

ఒక్కక్షణం అతని ముఖంలోకి చూసి, చిన్న వెండిఉంగరం తీసుకుంది- సింపుల్‌గా, ఆర్టిస్టిక్‌గా.

"థాంక్యూ!" పేజేసి బైటికొచ్చారు.

"నేనే చెప్పాలి థాంక్స్"

'జగదాంబ'వరకు రాగానే అంది కాదంబిని. "రైట్‌కి తిప్పు రామ్"

చల్లటిగాలి సముద్రంమీంచి రివ్వున లోనికొచ్చింది. కారు స్లో చేశాడు.

'సాగరోద్యానవనం' దాటి ఒకపక్కగా పార్క్ చేసి దిగాడు రామ్. ఆమెవైపు డోర్ తెరిచిపట్టుకున్నాడు.

సన్నటి వెండిపట్టీలున్న తెల్లనిపాదం బైటికొచ్చింది.

ఇద్దరూ ముందుకి నడిచారు.

"ఇసుకలోకి వద్దు రామ్! ఈ పార్క్‌లోనే కూర్చుందాం!"

జేబులోంచి పేకెట్‌తీశాడు రామ్. ఎర్రటి కాగితంలో- తెల్లగా మెరుస్తోంది వెండి వుంగరం.

కాదంబిని చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. తెల్లని పొడవైన వేళ్లచివర- ఎర్రటిగోళ్ల రంగు మెరుస్తోంది.

అతని మొహంలోకే చూస్తోంది కాదంబిని. ఆమె వ్రేలికి తొడిగాడు- ఉంగరం.

"నాకు చాలా సంతోషంగా ఉంది కాదంబినీ! కనీసం ఈ చిరుకానుకనయినా స్వీకరించినందుకు"

"దీవీ!" ఎగ్జయిట్‌మెంట్‌నణుచుకుంటూ అంది.

గాలికి మొహంమీద పడుతున్న ముంగురులు సున్నితంగా వెనక్కితోసుకుంటూ "దీవీ! అసలు- ఇవాళంతా నీతోనే గడుపుదామనుకున్నాను దీవీ!"

"ఫోన్ చెయ్యలేకపోయేవా?" మధ్యలోనే అన్నాడు.

"రెండు మూడుసార్లు ప్రయత్నించేను. అన్నిసార్లూ ఎంగేజ్‌డ్‌గానే ఉండింది. ఎలాగైనా ఇవాళ నిన్ను చూడాలనుకున్నాను... చివరిసారిగా ప్రయత్నించాలనుకునేంతలో నువ్వే చేశావ్"

అలసటగా వెనక్కివాలేడు రామ్- "ఏమిటో ఇవాళంతా చాలా చిరాగ్గా గడిచింది కాదంబినీ. చాలాసేపు ఆడిటర్స్ రాలేదు"

కాదంబిని మౌనంగా 'అలాగా' అన్నట్టు తలూపింది.

"ఏమిటో... బిజినెస్ అనుకుంటారేగాని... ఎన్నెన్ని లెక్కలు? ఎన్నెన్ని చిక్కులు! ఇంతేనా జీవితం! ఈ సర్కిల్‌నించి మరి నేను బయట పడలేనా?"

ఫ్లాష్‌లా అందుకుంది కాదంబిని- "ఇంత సెల్ఫ్‌పిటీ వుండకూడదు మనిషికి. అంతకన్న ఘోరమైంది, భరించలేనిదీ మరోటిలేదు"

కళ్లుతెరిచి ఆమె ముఖంలోకి చూశాడు- "ఒక్కోసారి చాలా విరక్తిగా అన్పిస్తుంది కాదంబినీ. ఎక్కడా నాకు మనశ్శాంతి లేదు" ఆర్తి ధ్వనించింది అతడి గొంతులో.

కదిలిపోయిందామె హృదయం.

చటుక్కున అతడి చేతిని గట్టిగా పట్టుకుని, ఆవేశంగా అంది- "దీవీ! నీ కోసం నేనున్నాను దీవీ! నీ అశాంతిలో భాగం పంచుకోడానికి నేనెప్పుడూ ఉన్నాను" హృదయంలోంచి ఎవరో గట్టిగా లాగేసినట్టు వచ్చాయి ఆ మాటలు.

"కాదంబినీ!" గబుక్కున తన చేతిలో వున్న ఆమె చెయ్యిని గుండెకానించుకున్నాడు.

"నన్ను... నువ్వు... సరిగ్గా అర్థం చేసుకున్న తొలి స్త్రీవి కాదంబినీ! నీలాంటి సహచరి అండగా ఉంటే ఎలాంటి- ఎలాంటి పరిస్థితుల్నాయినా అవలీలగా ఎదుర్కుంటాను కాదంబినీ!"

మౌనంగా అతని కళ్లల్లోకి చూస్తోంది కాదంబిని.

అతిపల్చని వెన్నెల్లో ఆమె వెండిజూకాలు వింతగా ఊగుతూ మెరుస్తున్నాయ్. ఆకాశంలోని అర్ధచంద్రుడు అప్పుడే వెలసిన ఆశా దీపంలా వున్నాడు. జడలోని మల్లెలు ఆనందాల సౌరభాలు రువ్వుతున్నాయ్.

నన్నని సముద్రపు హెూరు- చల్లగా... హాయిగా... ప్రశాంతంగా.

నెమ్మదిగా లేచి నిలుచుంది కాదంబిని- "ఇంక వెళ్దామా!"

నెమ్మదిగా లేచాడు రామ్!

ఆమె చేతిని పట్టుకొని కారువైపు నడిచాడు.

అరగంటలో కాదంబిని ఇంటికి చేరుకున్నారు.

కారాగగానే, ఆమెవైపు తలుపు తెరిచాడు.

ఆమె దిగి అతడివైపుకొచ్చింది.

"అదేమిటి? దిగరా... ఇవాళ మీకోసమని నేనే స్వయంగా వంటచేశాను రామ్!"

ఏం మాట్లాడలేదు దవ్వరామ్.

"ప్లీజ్ దివీ!... డిసప్పాయింట్ చెయ్యకు..." ఆమె కళ్ళలో ఎంత ప్రేమ? ఎంత ఆప్యాయత?... వీటిని దూరం చేసుకుని తాను ఏ ఎడారుల్లోకి పారిపోతాడు?

చటుక్కున డోర్ తెరిచి కిందికి దిగాడు రామ్.

* * *

"దివి లేదుట! చాలాసేపయి వెళ్ళిపోయేట్ట!" అంది రిసీవర్ హుక్‌కి తగిలిస్తూ మంజూష.

చిత్రంగా చూసేడు సంపత్.

మళ్ళీ తనే అంది- "ఆడిటింగ్ అన్నార్లే! ఏ ఆఫీసర్స్‌తో ఏం పన్లలో మునిగి వున్నారో!?...

మనం భోంచేద్దాం!... ఆయనిప్పుడు రారు!"

మౌనంగా వడ్డిస్తోంది. ఆమె మూడ్ ఆఫ్ అయిందని అర్థమైంది సంపత్‌కి. ఎలాగైనా ఆమె మూడ్స్‌మీద కంట్రోల్ సంపాదించాలి. ఓ ప్రయత్నం చెయ్యాలి.

మటర్, బంగాళాదుంపల కూరలేసుకుంటూ అన్నాడు- "చాలా టేస్టీగా వున్నాయ్ మంజూ! ఇంత బాగా చెయ్యగలవని నేననుకోలేదు"

"రియల్లీ!" ఆశ్చర్యంతో కూడిన ఆ ప్రశ్నతో కొద్దిగా కరగడం ప్రారంభించినట్టుంది.

"ఊరకే పొగడ్డం ఈ సంపత్‌కి అలవాటులేదు"

"కుకింగ్ కూడా మంచి ఆర్ట్! ఎప్పుడైనా కొత్త ఎక్స్‌పెరిమెంట్స్ చెయ్యడం భలే థ్రిల్లింగా వుంటుంది"

"నామీద ఎప్పుడూ చెయ్యకు సుమీ!"

"వాడ్యూయూమీన్?" నవ్వింది మంజూష- "ఫర్వాలేదులే! నా వంటమీద నాకా మాత్రం నమ్మకముంది!"

హమ్మయ్య! మళ్ళీ మూడ్ ట్యూన్ అయిందనుకోవచ్చు!

సాంబారు కలుపుకుంటూ అతని ప్లేటువైపు చూసింది- పెరుగు ఒక్కొక్క స్పూన్ తింటున్నాడు.

"సంపత్! నువ్వసలేం తినడం లేదు!"

"కమాన్! డోంట్ బీ టూ వుమనిష్!..." చివరి స్పూన్ నోట్లో పెట్టుకుని, మళ్ళీ బాటిల్‌లో నీళ్ళు వంపుకున్నాడు.

"కనీసం... ఇవన్నా తిను!" ఉడెన్ బౌల్‌లోని ఖజూర్- 'యు'షేప్ బాంబూ బౌల్లో అరటిపళ్ళు -ద్రాక్షపళ్ళు అతని ముందుకి జరిపింది. వాటిని తీసుకుని నవ్వుకుంటూ అన్నాడు- "ఇంత ప్రేమగా తినిపించేవాళ్ళుంటే దేశంలో క్షామం మరింత పెరిగిపోతుంది"

"చాల్లే ఊరుకో!... అసలు నువ్వేం తినలేదు. ఎంతయినా డొమెస్టిక్ ఫుడ్ ఆరోగ్యం. ఎపిటైట్ కూడా పెరుగుతుంది"...

మరో డ్రైఫ్రూట్ తీసుకున్నాడు- "నిజమే! కాని... రోజూ నాకెలా వస్తుంది?"

"ఎలా అంటే- పెళ్ళి చేసుకుంటే వస్తుంది"

నవ్వేశాడు సంపత్ బాదం పలుకులు నోట్లో వేసుకుంటూ,

"నిజంగా చెప్తున్నాను. ఇప్పుడు పెళ్ళి చేసు




కనే వయసేకదా?''

''ఒకవిధంగా చూస్తే దాటిపోయినట్టే! ము ప్ఫయ్‌ఐదప్పుడే నాకు. పాతికేళ్ళకే చేసేసు కుంటే బావుండేది. వయసు పెరుగుతున్నకొద్దీ మరింత ఇండివిడ్యుయాలిటీ పెరుగుతుంది. అప్పటికెన్నో వెరైటీలు రుచిచూసి మాన సికంగా ఒక స్టేజ్‌కొచ్చేక.... పర్మనెంట్‌గా ఒక రితో ఉండిపోవాలనిపించదు. పెళ్ళంటే అప్పు డు నిజంగా సంకెళ్ళే అవుతాయి''

ఆశ్చర్యంగా వింటోంది మంజూష.

''నువ్వు నిజంగా చాలా మంచిపని చేశావ్ -. తొందరగా పెళ్ళి చేసుకోవడం''

''నో... సంపత్! నో...!'' చిన్నగా అరిచింది. ''తెలిసీ తెలీని ఏజ్... భావాలు గట్టిగా స్థిరప డని వయస్సు. పెళ్ళంటే సరైన కాన్సెప్షన్ లేని స్టేజ్. అతడంటే ఇష్టమవునో- కాదో తెలీని... నో.... అర్థం కాని వయసన్నమాట అది. అలాంటి మెంటల్ స్టేట్‌లో పెళ్ళి చేసేస్తే ఎదిగీ ఎదగని మనసుల్తో- తెలిసీ తెలియని భావాల్తో... ఎంతోమంది అలా హాఫ్ నాలెడ్జ్ పీపుల్ తయారవుతున్నారు!''

ఏం మాట్లాడలేదు సంపత్. నెమ్మదిగా తలాడించేడు.

''పెళ్ళయేముందు వరకు ఒక విధంగా ఎంతో ఎంజాయ్ చేశాను. చాలా లైవ్లీ ఫ్రెండ్స్ ఉండేవారు నాకు. అయితే అదే అసలైన ఎంజాయ్‌మెంట్ అనీ- నిజమైన లైఫ్ అదే అనీ... తృప్తిపడిపోలేదు. ఆ ఏజ్‌కి ఆ ఆనందం 'తృప్తిగానే వుండాలి... నో! అలా అన్పిస్తుందంతే! అసలు- చిన్నప్పట్నుంచి ఏ విషయంలోనూ తృప్తిపడే స్వభావం కాదు నాది సంపత్! తరువాత కూడా... దివ్యరామ్ ఎప్పు డూ నన్ను నిర్బంధంలో జీవించమన్లేదు. తను ఇచ్చిన స్వేచ్ఛలో నా భావాలూ వ్యక్తిత్వం...మ రింత పెరిగేయి....''

డీప్‌గా చూస్తున్నాడు సంపత్. అతని ము ఖంలో ఏ భావమూ లేదు.

''ఏమయినాసరే- పెళ్ళి అనే కాన్సెప్ట్... సరి గ్గా అర్థమయ్యేదాకా స్త్రీగాని, పురుషుడుగాని ఇద్దరూ చేసుకోకూడదు. 'యూజెనిక్స్' థీమ్ తెల్సా?''

''ఊహూం! నువ్వే చెప్పు!''

''యూజెనిక్స్ అంటే- ఇంటలెక్ట్యువల్ కపుల్ కలవడంవలన ఇంటలెక్ట్యువల్ జనరే షన్ డెవలప్ అవుతుంది అని చెప్పే థియరీ''

''గుడ్‌నైట్'' వరండా మెట్లు దిగేడు సంపత్.

''గుడ్‌నైట్''

''గుడ్‌నైట్ అలాగేనా చెప్పడం?''

''మరెలా?'' నవ్వుతూ ఆసక్తిగా అడిగింది.

రెండు మెట్లెక్కి ఆమె ముందు నిల్చున్నా డు. ఇద్దరి కళ్ళూ కలుసుకున్నాయి.

నవ్వేశాడతను. ''ఏం లేదులే!'' వెనక్కి తిరిగి మెట్లుదిగి గబగబ వెళ్ళిపోయేడు.

ఆశ్చర్యంగా చూస్తూ నిల్చుండిపోయింది.

క్షణంలో బుల్లెట్ శబ్దం దూరమైపోయింది. నెమ్మదిగా లోపలికి నడిచి తలుపులు మూ సింది మంజూష.



రైఫిల్‌లోంచి ఫోర్స్‌గా బయటికొచ్చిన బుల్లె ట్‌లా దూసుకుపోతోంది ఎన్‌ఫీల్డ్- బీచ్ రోడ్ మీంచి. మెలికలు తిరుగుతూ ఘాట్ రోడ్ మీంచి పోతోంది. కొద్దిగా డౌన్ దిగి, తిన్నగా పోయి రెండో ఘాట్ రోడ్ మీదికెక్కింది.

''సంపత్!... ఇక్కడాపు'' గట్టిగా అరిచింది మంజూష.

''సంపత్! ఇదే!... ఇక్కడే- జరిగింది!''

''ఏమిటి?''

''అదే!... మనిద్దరి పరిచయం...'' కిందకి వంగి సంపత్ పడిన ప్రదేశాన్ని చేత్తో

స్పృశించింది.

"ఎంత చిత్రంగా కలిశాం మనం... కదూ!"

"య్యా... యాక్సిడెంటల్‌గా ..."

"నీ కారు ఎక్కడాగింది?"

చూపించిందామె.

ఆ ప్రదేశంలో నించుని అన్నాడు- "ఆ రాత్రి నేనంతలా తాగి ఉండకపోతే, ఇలా జరిగి వుండేది కాదు..."

"నో సంపత్! అప్పటి నా మెంటల్ కండిషన్ ఎలా ఉందో నీకు తెలీదు..

లేకపోతే అంత ఘోరం జరిగి వుండకపోను"

"అదిఘోరం కాదు!... అదేగా మనిద్దర్నీ పరిచయం చేసింది!"

"యస్! ఐ లవ్ దిస్ ప్లేస్!" పక్కనున్న రాతిమీద కూర్చోబోతూ అంది.

"కమాన్! డోంట్ బీ టూ సెంటిమెంటల్!" ఆమె చెయ్యి పట్టుకుని లేవదీసి బుల్లెట్‌వైపు నడిచాడు.

సన్నటి తెల్లటి ఆమె చేతివేళ్ళు అతని చేతిలో మెత్తగా నలిగిపోతున్నాయి.

క్రిమ్సన్‌రెడ్ గోళ్ళరంగు- అదే రంగు లిప్‌స్టిక్- అదేరంగు బొట్టు చిన్నదిగా.

నడక... ఎక్కడిదాకా?

ఆకాశం పడమటి భాగం- ఆరెంజ్‌లోంచి పసుపులోకి మారి... ఇంకా ఇంకా ఫేడ్ అయిపోతోంది. ఆ రంగులమధ్య ఆకాశాన్ని చీల్చుకుని - ఒకే ఒక్క నక్షత్రం విజయగర్వంతో ప్రపంచ విజేత అయిన మహారాణిలా వెలిగిపోతూ...

"అబ్బ!... ఎంతబావుందో ఆ నక్షత్రం?"

"దాని పేరేమిటో చెప్పుకో చూద్దాం?"

"ఊఁ!" ఆలోచిస్తోంది. "చెప్తే మరి నాకేమిస్తావ్?"

"చాలా మంచి కానుక ఇస్తాను... చెప్పలేకపోతే నువ్వే ఇవ్వాలి!" సంపత్ ప్రపోజల్ కొంటెగా వుంది.

డీప్‌గా చూసి అంది మంజూష "అసలది నక్షత్రం కాదు... గ్రహం!"

"ఓ.కే! అదేదో చెప్పాలి!"

"వీనస్"

"కరెక్ట్! వీనస్ దేనికి సింబల్?"

ఒక్కక్షణం ఆగింది. అతని మొహంలోకి చూసింది. ఛార్మింగ్‌గా నవ్వుతున్నాయి అతని కళ్ళు... మళ్ళీ ముందుకి నడిచింది "లవ్" నడుస్తూనే అంది.

ఆగేడు సంపత్. ఆమె చెయ్యి అందుకుని, కొద్దిగా ముందుకి వంగి- చేతిమీద ముద్దుపెట్టుకున్నాడు.

"ఏమిటిది?" ఎంత కఠినంగా అందామనుకున్నా సాఫ్ట్‌గా ధ్వనించిందామె గొంతు.

"ఏం చెయ్యను?... నువ్వు గెలిచావ్. ఏదో ఒకటిస్తాననేశాను కదా!... ఈ క్షణంలో నా దగ్గర నా శరీరం హృదయం తప్ప- ఇంకేం లేవు. అందుకని..."

మాట్లాడలేదు మంజూష. ఆవేశంగా పైకి లేస్తున్న అలను చూసింది.

ఒక్కక్షణం స్పందించిందామె హృదయం... సముద్రపు హోరుని చీల్చుకుంటూ సన్నగా మ్యూజిక్...

మళ్ళీ నడక ప్రారంభించేరు...

క్రమంగా నీడల్లా మారిపోతూన్న కొండలు... నల్లగా మారుతున్న ఆకాశం... ఆ కాస్త ఛాయపడిన సముద్రం.

"సంపత్!... ఇంక వెళ్దామా?"

"అప్పుడేనా?"

మెదడులోకి మెరుపులా రామ్‌రావడంతో 'ఇంక పోదాం!' అంటోంది మనసు. కాని,

దివ్యరామ్‌తో తాను పామ్‌బీచ్‌లో గడిపిన వెన్నెలరేయి గుర్తొచ్చింది.

"ఈ వెన్నెల్లో- ఈ కెరటాల ధ్వని వింటూ... ఈ మెత్తటి ఇసుకలో- ఇలా పడుకోవాలని పిస్తోంది..."

"వాయ్ మంజూ! పెళ్ళికి ముందు నువ్వెవరినైనా ప్రేమించావా?" సడన్‌గా సంపత్ ప్రశ్న.

"లేదు"

"తరువాత?" ఏ భావమూ లేదతని ముఖంలో.

నవ్వింది మంజూష.

"ఈ ప్రశ్న... ఇంకే పెళ్ళయిన అమ్మాయిని





అడిగినా ఏం చేస్తారో తెలుసా?''

''ఏం చేస్తారు?''

''చెంప పగలగొడతారు?'' నవ్వింది.

''అబ్బా! అంత ప్రేమా మొగుళ్ళంటే?''

''ఏమో మరి!?''

''మరి నీ విషయమేమిటి?''

''నేను చెంప పగలగొట్టలేదుగా!''

''అంటే!''

''నేనింక నడవలేను' చటుక్కున కూర్చుంది.

''సరే! నువ్విక్కడే ఉండు. ఎన్‌ఫీల్డ్ నిక్కడికే తేవడానికి ప్రయత్నిస్తాను''

మత్తుగా కళ్లు మూసుకుందామె.

వెనకనుంచి ఆమె భుజాలమీద చేతులు పడ్డాయి. నవ్వుతూ తలెత్తి వెనక్కివంచి చూసింది...

అంతే! అదిరిపడింది...

చటుక్కున లేవబోయింది...

ముందునుంచి మరో రెండు చేతులు వచ్చి, ఆమెను లేవనీయలేదు...

కెవ్వుమని అరిచింది మంజూష.

వాడు గట్టిగా నవ్వుతూ ముందుకి వంగేడు...

వెనుక వాడు ఆమె నోటిని మూశాడు...ఒకడు ఆమె కాళ్ళు కదలకుండా పట్టుకున్నాడు. రెండోవాడు ఆమె చేతుల్ని రెండిట్నీ ఓ చేత్తోనే పట్టుకొని, వెకిలిగా నవ్వుతూ ఆమె చీర కుచ్చిళ్ళమీద చెయ్యి వేశాడు.

సంపత్‌కి తనకేక అందినట్టు లేదు...

ఆమె మెదడులోకి రక్తం వేగంగా ప్రవహిస్తోంది. ఆవేశంతో తల ఇటూ అటూ విదిలిస్తూ లేవడానికి ప్రయత్నిస్తోంది.

''నవగ్గా దొరికిన పిట్టని, తేరగా వదిలెయ్యడానికి నవట్లమనుకుంటున్నావేటి బుల్లీ?'' వెకిలిగా నవ్వుతూ ముందుకొంగేడు ఆమె మీదికి.

★ ★ ★

వాడిలాల్ కోన్ తింటూ, నెమ్మదిగా ఇసుకలో నడుస్తున్నారు కాదంబినీ, దివ్యరామ్‌లు.

''ఎలా వుంది దివీ! నీ బిజినెస్ ఇంప్రూవ్‌మెంట్ సైడ్‌లో...''

మాట్లాడలేదు దివ్యరామ్.

సమ్మర్ సాయంత్రాల్ని చల్లగా అనుభవిస్తున్న జనాన్ని చూస్తూ నడుస్తున్నాడు.

''కాదంబినీ!''

మౌనంగా ఎటో చూస్తోంది.

''కాదంబినీ! ఏంటాలోచిస్తున్నావు?''

''ఏం లేదు!''

ఆమె మూడ్ ఆఫ్ అయిందని గ్రహించాడు.

''అన్నట్టు ఇవాళ నేను ఫోన్ చేసేసరికి ఏం పుస్తకం చదువుతున్నావ్?''

''కుమారసంభవం''

''ఎవరూ? కాళిదాసుదా?''

''అబ్బో! కాళిదాసెవరో తెలునన్నమాట!'' నవ్వింది.

''తెలియకపోవడానికేముంది? . నిత్యం బిజీ... బిజినెస్... వాటి వెనుక ఇలాంటి అభిరుచులన్నీ నీడలా ఉండిపోతున్నాయి''

''కాళిదాసు నాకు చాలాఇష్టం. ఆయన సృష్టించిన నాయికా నాయకులంటే మరీ ఇష్టం! ఇందులో పార్వతిని ఎంత సుకుమారమైన పుష్పంలా, శివుణ్ణి ఎంత మేన్లీ హీరోలా... ఎంత అద్భుతంగా సృజించాడో తెల్సా? వాళ్ల మధ్య ఎంత నిజాయితీగా అందంగా రూపొందిన స్ట్రాంగ్ లవ్! అలాగే శాకుంతలం. అందులో ప్రేమగురించి ఎంత ఎఫెక్టివ్‌గా రాస్తాడంటె ఓహ్! నిజంగా కాళిదాసు ప్రేమించిన అమ్మాయెవరోగాని... అతడ్ని అంతలా కదిలించిందంటే''

''కాళిదాసుకో లవర్ ఉండేదా? ఊహ?!'' రామ్ ఆశ్చర్యం.

''ఏం? ఆయన మాత్రం మానవుడు కాడా? ప్రేమించే అర్హతలేదా?'' కాదంబిని ప్రశ్న.

విచిత్రంగా చూశాడు దివ్యరామ్.

లోకాన్ని చీకట్లో ముంచేసి వెళ్లిపోతున్న సూర్యుడికి ఛాలెంజింగ్‌గా చంద్రుడుదయించాడు నిండుగా.

చంద్రుణ్ణి చూడగానే అందమైన ఆడ

పిల్లల మరింత అందమైన నవ్వుల్లా మెరిసిపో తూన్నాయ్ సముద్రపునీళ్లు.

కెరటాల అంచున వెన్నెల్లో నీడల్లా రామ్, కాదంబిని.

బీచ్‌లో సందడి కాస్త తగ్గింది.

సమ్మర్ సాయంత్రం అవడంవల్ల పదవుతు న్నా ఇంటికెళ్లేమూడ్ రాని ప్రేమ జంటలు అక్కడక్కడా వున్నాయ్.

కాదంబిని లేవబోతూ, పక్కకి చెయ్యిపెట్టి చూసింది. బ్యాగ్ తగల్లేదు. చుట్టూ చూసింది.

"ఏమైంది?"

"నోబ్యాగ్"

దూరంగా తడి ఇసుకలో... గబగబా పరుగె డుతూ నల్లటి చిన్న ఆకారం..

గబగబా లేచిన దివి... రెండు నిముషాల్లో వాణ్ణి అందుకున్నాడు.

బ్యాగ్ లాక్కుని ఈ చెంపా ఆ చెంపా వాయించసాగాడు.

వాడు ఏడుస్తూ బతిమాలుకుంటున్నాడు... "బాబూ! నాకేం తెలీదు" ఈలోగా అక్కడికి వచ్చింది కాదంబిని.

"దివీ!" వెనకనుంచి పిలిచిన పిలుపుకి ఆగాడు దివ్యరామ్.

★ ★ ★

"సంపత్ !" కొండలు దద్దరిల్లేటట్టుగా అరి చింది మంజూష.. కానీ, సన్నగా వణుకుతున్న ఆమె స్వరాన్ని సముద్రపు హోరు మింగే స్తోంది.

"యూ బాస్టర్డ్" విదిలించుకోడానికి ప్రయ త్నిస్తూ కసిగా అంది.

అనహ్యంగా, బండగావున్న వాడి పెదవులు సున్నితమైన ఆమె పెదవులను అంగుళం దూరంలో అందుకోబోతూన్నాయ్.

అంతే!

సమ్ స్ప్లిట్ ఆఫ్ సెకెండ్స్...

ఒక్కసారి వాడి శరీరం గాల్లోకి లేచింది.

మరోపక్కకి ఎగిరి పడ్డాడు రెండోవాడు...

చక్‌చక్‌మని మెరుస్తున్న మెరుపుల్లా వెన్నెల చీకటయిపోయేలా కెప్టెన్ సంపత్‌కు మార్ హస్తలాఘవం.

పక్కకి పడ్డవాడు లేచి గబగబా వచ్చేడు. సంపత్ మీదకి కలియబడబోయేడు. సంపత్ బలమైన చేతులు ఇనపగుండుల్లా, వాడి కడుపులోకి దూసుకుపోయాయి. అమ్మా! అని అరుస్తూ వాడు వెళ్లి ఒక రాయి మీదపడ్డా డు. ముక్కు, నుదురు చితికి రక్తం కారసా గింది.

"ఏం? అమ్మ గుర్తొస్తోందా? అమ్మాయితో ఆడుకుందామనుకున్నప్పుడు రాలేదా?" వాడి షర్ట్ కాలర్ పట్టుకుని లేవదీసి కసిగా గుద్దాడు. గట్టిగా అరుస్తూ వెనక్కి పడ్డాడువాడు. అంతే! కళ్లు చీకట్లుకమ్మాయి వాడికి. వాణ్ణి జుట్టుప ట్టుకుని ఈడ్చుకొచ్చి మంజూష కాళ్ల దగ్గర పడేశాడు.

భయంగా చూసి, రెండడుగులు వెనక్కి వేసిందామె.

"చెప్పు! వీణ్ణేం చెయ్యమన్నావ్!"

నోటమాట రావడం లేదామెకి... సంభ్రమ, ఆశ్చర్యం.

"చెప్పు!" పళ్లు నూరుతూనే వాణ్ణి చూస్తూ మళ్లీ అడిగాడామెను.

క్షణంలో మంజూ మొహం గంభీరంగా మారింది.

"కాళ్లూ, చేతులూ కట్టేసి ఇద్దర్నీ సము ద్రంలో పారెయ్... ఆ తర్వాత అందులోని జంతువులే చూసుకుంటాయ్ వాళ్లని"

"బాబోయ్" కాళ్లమీద పడిపోయేడు వాడు వణుకుతూ.

ఇద్దర్నీ ఫట్‌ఫట్‌మని బంతుల్లా వెంటవెంటనే తన్నాడు. వెళ్లి కెరటాల అంచున పడ్డారు.

స్థాణువులా నిలుచుండిపోయిన మంజూష ఒక్క పరుగున వచ్చి అతడ్ని కరుచుకుపో యింది.

"సంపత్! సంపత్!..." వణుకుతున్న కంఠంతో విష్పరింగ్‌గా అంది.

భయంతో సన్నగా వణుకుతున్న ఆమె శరీ రాన్ని గట్టిగా అదుముకుని అభయమిస్తున్న ట్టుగా నెమ్మదిగా ఆమె వీపు నిమిరాడు.

సంపత్‌నభినందిస్తున్నట్టుగా హోరు పెడు తున్న సముద్రం...






ఒక్కసారి ఆగింది ఆమె... "సం ....ప...త్! నా... హార్ట్..." కలలోలాగ అతనివైపు చూస్తూ తన్మయంగా అంది.

"నేనిక్కడ ఉన్నాను డియర్! నేనున్నంతవరకు నిన్నెవ్వరూ ఏమీ చెయ్యలేరు" మరింత గట్టిగా హత్తుకొని నడుస్తున్నాడు.

ఎన్‌ఫీల్డ్ స్టార్టయింది. ఊరివైపు దూసుకుపోతున్న ఆ బుల్లెట్‌పై సంపత్, మంజూష.

* * *

ఏమిటన్నట్టు ఓసారి కాదంబినివైపు చూసి "వీణ్ణిలాకాదు!" అంటూనే, మళ్ళీ వాడినెత్తిమీద మరొకటి వేస్తూ "దొంగరాస్కెల్! పద! నిన్ను పోలీస్ స్టేషన్‌లో పారెయ్యాలి... వేలెడంతలేవు..."

"దివీ!..." మృదువుగా విడిపించింది కాదంబిని వాణ్ణి దివ్యరామ్ చేతుల్లోంచి. "పదేళ్ళయినాలేని ఇంత చిన్నవెధవ... దొంగతనానికి పాల్పడ్డాడంటే, అది వాడి తప్పా దివీ!... ఈపని వెనక వాడి పేరెంట్సు ప్రోత్సాహంలేదంటావా?"

"ఇపుడు నీ ఫిలాసఫీలు చెప్పకు కాదంబినీ! వాడు చేసిన పనెలాటిదో వాడికి తెలియాలంటే... దానికి తగిన శిక్ష అనుభవించందే లాభంలేదు..."

వినిపించుకోలేదు కాదంబిని. నెమ్మదిగా వాడి చెయ్యి పట్టుకొని ముందుకు లాక్కొచ్చింది.

"నీపేరేమిటి?"

"ఫకీరు" వెక్కుతూ, మోచేత్తో కళ్ళు తుడుచుకుంటూ అన్నాడు.

"సరైన పేరేలే!" వెటకారం ధ్వనించిన గొంతు దివ్యరామ్‌ది.

అదేం పట్టించుకోకుండా, కాదంబిని మళ్లీ అడిగింది "ఇలాంటి పని చెయ్యమని ఎవరు చెప్పేరు నీకు?"

"మా నాన్న..."

దివ్యరామ్‌వైపు చూసింది కాదంబిని- 'నేచెప్పలేదూ' అన్నట్టుగా.

"మీ నాన్నేం చేస్తాడు?"

''ఓడలోంచి సామాన్లు తెచ్చి అమ్ముతుంటా డు''

''నేను చదువు చెప్తాను, వస్తావా మా ఇంటి కి?'' కాదంబిని...

వాడు భయం భయంగా దివ్యరామ్ వైపు చూశాడు.

''ఇప్పుడు నాతో తీసుకెళ్తాను... వస్తావా?''

రానన్నట్టు తలూపాడు వాడు.

''ఏం?''

''మాయమ్మ... నాన్న''

''పోనీ! రేపు సాయంత్రం ఇక్కడికొస్తావా మీ ఇంట్లో వాళ్లకి చెప్పి...''

తలూపాడు వాడు.

''సరే! వెళ్లు'' ఒదిలేసిందామె.

ఆమాటకోసమే ఎదురు చూస్తున్నట్టుగా పరుగులంకించుకున్నాడు వాడు.

రోడ్డు పక్కగా ఆపిన కారును సమీపించేరి ద్దరూ.

* * *

బెడ్‌మీద బోర్లా పడుకొని, ఫిడ్జెరాల్డ్ 'ఉమర్‌ఖ య్యాం' చదూతోంది మంజూష.

ట్రింగ్... ట్రింగ్... ట్రింగ్...

వినిపించుకోలేదామె.

ట్రింగ్... ట్రింగ్... ట్రింగ్...

కదల్లేదు.

ట్రింగ్... ట్రింగ్... ట్రింగ్...

విసుగ్గా లేసింది. గబగబా వెళ్లి రిసీవ రందుకొని ''ఏమిటి?... రాపడానికి కుదర దంటారు. అంతేగా! దానికి ఫోనెందుకు కొ త్తగా!...''
విసురుగా కోపంగా అంది.

ఫోన్ చేసింది దివ్యరామ్ కాదని ఆమె గ్రహించలేదు.

''సారీయార్! రెండ్రోజుల్నించి అనుకో కుండా బిజీ అయిపోయిందిలే! ఎప్పటికప్పు డు నీకు ఫోన్ చేద్దామని కూడా చెయ్యలేకపో యా! అయినా మరీ అంత కోపమా?''





క్షణంసేపు ఆమె హృదయంపై సన్నజా జుల జల్లు కురిసింది.''అరె!... పతీ! నువ్వా? అసలు నీకు ఫోనున్నట్టు ఎప్పుడూ చెప్పలే దేం?''

''ఏదీ ఇంతవరకు ఆ అవసరం రాలే దుగా''

''ఏమిటమ్మా పెద్ద!... ఫోన్ చెయ్యడాని క్కూడా తీరిక లేనంత బిజీ?''

నవ్వు... ఛార్మింగా...

''ఏంలేదు! నిన్నా మొన్నా వైస్ ఎడ్మిర ల్‌తో గడపాల్సి వచ్చింది''

''ఎక్కడ?''

''ఒడ్డుకు వందమైళ్ల దూరంలో... సము ద్రంలో... మధ్యన''

''రియల్లీ!... సో థ్రిల్లింగ్... ఏమంటాడా యన?''

''ఇక్కడ నేవీ ఫ్రెండ్స్ అంతా కలిసి నన్ని క్కడికి కనీసం డెప్యుటేషన్‌మీదయినా సరే వచ్చేయమని నా ఎదురుగానే ఆయనికి రిక మెండ్ చేస్తున్నారు...''

''నిజంగానా!'' ఎక్సయిటింగ్‌గా అంది. ఆప్యాయంగా ఫోన్ చేతిలోకి తీసుకుని అప్ర యత్నంగా బెడ్‌రూమ్‌లోకి నడిచింది.

''నువ్వేమన్నావ్?'' ఫోన్ బెడ్‌మీద పెట్టి బోర్లా వాలింది.

''డెప్యుటేషన్ ఎందుకు? ఆర్మీ వదిలేశా నుగా!... అయితే ఫ్రెష్ అపాయింట్‌మెంట్ ఎక్స్‌టెన్షన్‌కి అప్లయ్ చేశానుగాబట్టి... అదొస్తే అది

చూస్తాను ఇంకా రెండు నెలల మాట కదా!... బైదవే... ఆరోజురాత్రి నిద్రపట్టిందా?''

''లేదు''.

''భయమే?''

''కాదు''

''మరి!?''

మాట్లాడలేదు మంజూష.

''అయినా నాలుగ్గోడలమధ్యా కూర్చొని అడ్వెంచరస్ నావెల్స్ చదువుకోవడంకాదు లైఫ్ అంటే... అడ్వెంచర్‌గా బతకడంలో వుంది థ్రిల్...''

"సంపత్!... నీలాంటివాడు పక్కనుంటే, అమ్మాయిలు హాయిగా ఆరుబైట కూడా అద మరిచి నిద్రపోవచ్చు"

"ఛ! నే చెప్పిందంతా వేస్ట్... ఎవరోవచ్చి మిమ్మల్ని రక్షించాలనుకుంటారేతప్ప, మిమ్మ ల్ని మీరు రక్షించుకోవాలనెందుకు అనుకోరు"

"ఎలా?"

"ఎలా?... కాస్త బుర్ర పెట్టి ఆలోచించు..." గట్టిగా అన్నాడు... "మొదట నిన్ను చూసి ఎంతో షార్ప్ గర్ల్‌వనుకున్నాను"

ఉలిక్కిపడింది... "ఏమిటి నువ్వనేది? అస లు నా గురించి నీకేం తెలుసు?"

నవ్వు... "ఇంతవరకు నా లైఫ్‌లో నా సర్వీ సులో కొన్ని వందల మంది అమ్మాయిల్ని చూసేను..."

"నేనూ చూసేను వందలకొద్దీ అబ్బాయి ల్ని!" ఉక్రోషంగా అంది

"అయినా నాలాంటివాణ్ని చూసుండవు"

"లేదు... ఇంత సెల్ఫ్ డబ్బాలు కొట్టుకొనేవా ణ్ణి ఇప్పుడే చూడ్డం" కసిగా అంది.

అవతల్నుంచి తెరలుగా తెరలుగా నవ్వు.

క్షణం మౌనం తర్వాత "అద్సరే! మంజూ! ఏం చేస్తున్నావిప్పుడు?"

"మంచి పుస్తకం చదువుతున్నాను..."

"అవునూ! ఎప్పుడూ నేను మీ ఇంటికి రావడమేగాని, నువ్వు మా ఇంటికి రావా?"

"నువ్వు పిలిచేవా?"

"ఇప్పుడు పిలుస్తున్నానుగా! రా! ఎప్పుడొ స్తావు?"

"వస్తాలే!" నవ్వింది.

"నేను సీరియస్‌గా అంటున్నాను"

"నేనూ సీరియస్‌గానే చెప్తున్నాను"

"రేపొస్తావా?"

"సడన్‌గా ఏమిటీ కోరిక పుట్టింది? వన్ ఫైన్‌మార్నింగ్- ఎప్పుడోరోజు వచ్చేసి- నేను నిన్ను నిద్రలేపుతాను"

"అలాక్కాదు- ముందు చెప్పి రావాలి!"

"ఎందుకో?"

"ఎందుకంటే- అమ్మాయిగారు నడిచేదా రంతా రంగురంగుల పూలకార్పెట్ పరి పించాలి"

ఒక్కక్షణం పులకించిదామె హృదయం... కొద్దిసేపాగి అంది.

"సంపత్! నాకేమనిపిస్తోందో తెలుసా?... తెల్లటి మేఘాల్లో తేలిపోవాలనీ- చల్లటి మంచువర్షంలో హాయిగా తడవాలని, నక్షత్రా లు పరిచిన ఆకాశదారుల్లో- చందమామతో కలిసి నడవాలనీ- 'జూల్స్‌వెర్న్'లా ప్రపంచ మంతా చుట్టిరావాలనీ..."

"ఈసారెలాగో కష్టపడి- ఎయిర్‌క్రాఫ్ట్ సంపా దిస్తాను... హాయిగా తిరుగుదాం అందులో. పైకి వెళ్తున్నకొద్దీ చిన్నదైపోతున్న భూమిని చూడ్డం మరో థ్రిల్! రిచర్డ్ 'ఇల్యూజన్స్' చదివేవా?"

"నువ్వెంత అదృష్టవంతుడివి సంపత్"

"అదృష్టానికేముంది?... ఆ పుస్తకం ఎక్క డైనా దొరుకుతుంది... రేపే నేను తెచ్చిస్తా"

"ఛ... ఆ పుస్తకం గురించి కాదు!"

"మరి!?"

మాట్లాడలేదు మంజూష.

"ఇందులో అసాధ్యమైందేదీ లేదు మంజూషా!"

ఫ్లాష్‌బ్యాక్ ఒక్కసారి మెరుపులా...

"...యూ ఆర్ టూ ఎంబిషియస్. కాస్త భూమ్మీద నించుని మాటలాడ్డం మంచిది"

సంపత్ మాటతో ఫ్లాష్ మాయమైంది- "ఓయ్ మంజూ!"

లైట్‌బ్లూ లైట్‌లో- లైట్‌బ్లూ బెడ్‌మీద బోర్లా పడుకొని, లైట్‌బ్లూ నైటీలో- చెంపలమీద పడు తున్న మెత్తటి జుట్టును వెనక్కుతోసుకోకుండా తదేకదీక్షతో ఒమర్‌ఖయ్యాం రుబాయీలను చదువుతున్న అందమయిన ఆమెరూపం అవ తలివైపు సంపత్ ఊహించకపోలేదు.

అందుకే అన్నాడు. "మంజూ! ఆల్ బ్లూ మధ్యనున్న నిన్ను ఏమనాలో తెల్సా ఇప్పు డు?"

"ఏమిటి?"

"అరె! ఆల్‌బ్లూ అంటే ఏమిటో నిజంగా తెలీదా?"

"ఊహూఁ...!"

సంపత్ నవ్వు గలగలా... "టెంత్‌క్లాస్ చదూతున్న పదారేళ్లపిల్లనడిగినా చెప్తుందీ రోజుల్లో... గుడ్‌నైట్!"

ఫోన్ పెట్టేసిన చప్పుడు...

అలా రిసీవర్ని పట్టుకొని ఉండిపోయింది మంజూష.

ఒక్కసారి గదంతా నిశ్శబ్దం వ్యాపించింది.

టేబుల్‌క్లాక్... టిక్... టిక్... టిక్... చప్పుడు.

నెమ్మదిగా రిసీవర్ క్రెడిల్‌మీద వుంచింది. మెల్లగా లేచింది.

ఏమిటంత బిజీ! ఎందుకు రావడంలేదు? నెమ్మదిగా పక్కకి వత్తిగిలింది. కనీసం మళ్లీ ఫోన్ చెయ్యొచ్చుగా! నాల్రోజులకిందటెప్పుడో హడావుడిగా వచ్చి, హెరాల్డ్ రాబిన్స్ నవలిచ్చి, మర్నాడు స్విమ్మింగ్‌కి వెళ్దామని చెప్పి వెళ్లిపోయాడా... ఆ తర్వాత మళ్లీ ఇందాక ఫోన్‌లోనే కలవడం!

★ ★ ★

అలసటగా లోపలికొచ్చేడు దివ్యరామ్.

మరింత అలసటగా బెడ్‌మీద వాలిపోయాడు.

మంజూష నెమ్మదిగా వెళ్లి, ఫ్రిజ్ తెరిచి మంచినీళ్ల సీసా గ్లాస్ తీసుకొచ్చింది... "మంచినీళ్లు తాగండి"

కళ్లు విప్పేడు దివ్యరాం. ఎప్పుడూ లేని మర్యాదవాచకం 'అండీ'

చటుక్కున బాటిల్ అందుకొని, గడగడా నీళ్లన్నీ తాగేసి సీసా ఆమెకందించాడు- పక్కకి వాలాడు రొప్పుతూ.

'ఏమైంది? ఎందుకిలా ఉన్నాడివాళ...? ఇన్కంటాక్స్‌వాళ్ల దాడుల్లాంటివేమీ...?! నో! అలాంటి ప్రాబ్లెమ్స్‌లో ఏనాడూ తమ కంపెనీలు ఇరుక్కోలేదే! మరేం జరిగివుంటుంది...?'

వాజ్‌లో పూలు మారుస్తూండగా- ఫోన్...

పువ్వులా వికసించిందామె మొహం.

గబగబా వెళ్లి అందుకుంది. అవతలి గొంతు తానాశించింది కాకపోవడంతో, పారేయబోతున్న పాతపువ్వులా అయిపోయిందామె మొహం.

"దివ్యరామ్ ఉన్నాడా?" ఎవరిదో బొంగురు గొంతు- తాగివున్నట్టున్నాడు. ఫోన్లోకి కొడుతోంది వాసన.

ఆమె చెవుల్లో- మెదళ్లో సన్నటిహోరు.

"హలో! ఎవళూ! ఫోనెత్తి ఇవ్వం చెప్పళేంషి? ఒక్కసాళి పిళండి!" ఎవడో క్లబ్ ఫ్రెండ్ అయ్యుంటాడు. ఓవర్ డోసు కేసై వుంటుంది.

"సారీ! మంచి నిద్రలో వున్నారు" నెమ్మదిగా ఫోన్‌పెట్టేసింది.ఈలోగా ఎప్పుడు వెళ్లిపోయాడో దివ్యరాం. నీరసంగా బెడ్రూంలో మంచంమీద వాలిపోయాడు.

నెమ్మదిగా బెడ్రూమ్‌లోకి అడుగుపెట్టింది.

పరుపుకి అడ్డంగా- వెల్లకిలా పడుకొని, తల ఒకపక్కకి తిప్పి, నుదుటిమీద అరచెయ్యి ఆనించుకుని కళ్లు మూసుకున్న దివ్యరామ్.

ఒక్కక్షణం జాలితో నిండిపోయిందామె హృదయం.

నెమ్మదిగా పక్కన కూర్చొని, అతని తలను ఒడిలోకి తీసుకుంది లాలింపుగా "దివీ" పిలిచింది మెత్తగా.

కళ్లు తెరవలేదు దివ్యరామ్. నెమ్మదిగా పక్కకి దొర్లిపరుపుమీద బోర్లాపడుకున్నాడు.

"దివీ!..." నెమ్మదిగా అతని భుజంమీద చెయ్యివేసింది.

"ప్లీజ్! నాకు ఏమాత్రం మూడ్‌లేదు" చిన్నగా విదిలించుకుంటూ అన్నాడు. ఉలిక్కిపడింది మంజూష. దేనికి మూడ్ లేకపోవడం? తానేం కోరికలతో వేగిపోయి చచ్చిపోవడంలేదే! అయినా, అతడి బాధని పంచుకోడానికి తాను తగదా? తనతో చెప్పుకోలేని అంత అశాంతి ఏమిటతడికి? అంత పనికిరాకుండా వుందా తనిక్కడ?

కోపంగా మరో బెడ్‌రూమ్‌లోకి వెళ్లిపడుకుంది. "మూడ్‌లేదు" అనే మాటకు ఎన్ని అర్థాలు వెతకడం? "నిన్ను ప్రేమించలేను" అనా...? లేక "నీ అవసరంలేదు" అనా...? మొదటిదానికంటె రెండో అర్థమే అయితే మరీ బాధాకరం కాదూ...?




అశాంతిగా అటూ ఇటూ దొర్లుతున్నాడు దివ్యరామ్.

కారణం- కాదంబిని దర్శనం కాకపోవడం... ఎటువంటి మనస్తత్వమో ఏమిటో... ఏమీ బోధ పడడంలేదామె. అసలు ఊళ్లో ఉందా? లేకుంటే ఎటు వెళ్లేదీ తనకు ఫోన్ చెయ్యకుండా వుంటుందా? కాక వుండే, లేనట్లు ప్రవర్తిస్తోందా? తన చొరవ అపార్థానికి దారితియ్యవచ్చా? ఏదీ- అర్థంగాకుండా వుంది.

అశాంతీ- ఎడతెగని ఆలోచనా నిద్రపట్టనివ్వడంలేదు.

★ ★ ★

సాయంత్రం ఆరుగంటలు.

వేసవి సాయంత్రం విశాఖలోని కాస్మోపాలిటన్ పాపులేషన్ అంతా అక్కడే వున్నట్టుగా వుంది.

లైవ్లీగా- కలర్‌ఫుల్‌గా బీచ్...

కెరటాలమీంచి వస్తున్న ఆవిరితో మిళితమైన గాలి ఆస్వాదిస్తూ నడుస్తూన్న మంజూష ఒకచోట ఆగింది.

కొంతమంది టీనేజ్ అమ్మాయిలు గ్రూప్‌గా- ఏవో జోక్స్‌తో, పాటలతో, నవ్వులతో ప్రపంచంలోని ఆనందం అంతా వాళ్లతోనే వుందా... అన్నంతగా ఎంజాయ్ చేస్తున్నారు. బహుశా ఏ విశాఖవేలీవాళ్లో సింఫొనీ యంగ్ స్టర్స్ క్లబ్‌వాళ్లో. అమాయకంగా చూసే కళ్లు... లేత పాలబుగ్గలు అందంగా ఎంజాయ్ చేసే ఎడోలసెన్స్.

నేవీబ్లూ స్కర్ట్... వైట్ బ్లౌజ్... భుజాలవరకు వ్రేలాడుతున్న రెండు జడలూ... ఆ వయసులో తానెంత లైవ్లీగా వుండేది.

అందరిలోకీ అందంగా- చురుగ్గా వున్న అబ్బాయి గబుక్కున ఆ అమ్మాయి చేతులు పట్టుకుని "ఆల్ బ్లూ- ఐ లవ్యూ" అన్నాడు.

ఆ అమ్మాయి బుగ్గలు ఎర్రగా మారేయి. వెంటనే చేతులు విదిలించుకుని పక్కకి ముఖం పెట్టింది.

ఇంకేం వినబడలేదు మంజూషకి.

ఆల్‌బ్లూ... తెలిసింది. ఐ లవ్‌యూ... ఐ లవ్‌యూ... ఐ లవ్.

నెమ్మదిగా ముందుకు అడుగులేస్తోంది.

హృదయంలో ఏదో అర్థంకాని బ్లాంక్‌నెస్.

శరీరంలోని అణువుణువునా మాత్రం అనిర్వచనీయమైన ఆనందం.

ఉత్తుంగ తరంగాలతో హోరుపెడుతూ సముద్రం.

ఆమె పాదాలు స్పృశించడానికి పోటీలు పడుతూ ముందు ముందు కొస్తున్న కెరటాలు.

వేటికీ అందకుండా నడుస్తోంది మంజూష.

చల్లనిగాలి... చెవిలో గుసగుసలు... ఆమె పెదాలపై తియ్యని చిరునవ్వు.

ఒకచోట కూర్చోబోయి పక్కకి చూసింది.

అందమైన అమ్మాయి, లేతాకుపచ్చ వాయిల్ చీరలో- మోకాళ్లమీద గడ్డం ఆనించి తదేకంగా చూస్తోంది సముద్రంకేసి. పొడవైన జడ... నుదుటిమీద ముంగురులు... సముద్రపు లోతుల్ని శోధిస్తున్నట్టుగా ఉన్నాయామె చూపులు... అంత కష్టపడి లోతులకు వెళ్తే ఏమీ దొరకని నిస్పృహ. అదో ట్రాన్స్ ట్రాంక్విలిటీ.

ఆమెనే ఓ క్షణం అలాగే చూసింది మంజూష.

ఎవరీ స్వీట్ మెలాంకలీ? ఎక్కడో చూసినట్టుందే...! ఎక్కడ? ఎక్కడ? ఎవరు?

నెమ్మదిగా ఆమె వద్దకు నడిచి పక్కనే ఇసుకలో కూర్చుంటూ... "ఎక్స్‌క్యూజ్‌మీ... మీరు... మిమ్మల్నెక్కడో చూశాను. కాని గుర్తురావడంలేదు...?"

ఆశ్చర్యంగా చూసిందామె.

మంజూష అన్నమాటని రీకలెక్ట్ చేసుకుంటోంది.

"ఎక్కడ చూసుంటారు? బహుశా... అం... మీరెప్పుడైనా కాదంబినీదేవి నాట్యం చూశారా?"

ఆ... యస్! కాదంబిని... ఓహ్! వాటెసర్‌ప్రయిజ్?!

"అరె! కాదంబినీదేవీ! మిమ్మల్ని కలవాలని నాకెంత కోరిగ్గా వుండేదో! ఒకేఒక్కసారి చూశాను మీ ప్రోగ్రాం... అదీ ఎప్పుడు? ఐదారే



ళ్ల కిందట మద్రాస్‌లో. ఆ క్షణంలోనే మిమ్మల్ని అభినందించాలని మీతో మాట్లాడాలని అనిపించింది. నాకు చాలా సంతోషంగా వుంది వాళ.

నిశ్శబ్దంగా నవ్వింది కాదంబిని... ''థాంక్యూ!'' చిన్నగా అంది.

మొనాలిసా కాస్త బ్రాడ్‌గా నవ్వితే ఇలాగే ఉంటుందేమో!

''బైదవే... అయాం మంజూ... మంజూష అన్నమాట'' పరిచయం చేసుకుంటున్నట్టుగా అంది.

'మంజూ' పదం వినగానే కాదంబిని అంతరాంతరాల్లో ఒక్కసారి ఫ్లాష్‌లా 'మంజూ ఇండస్ట్రీస్' మెదిలింది. కాని- అడిగితే బావుంటుందో బావుండదో!? మంజూషకే ఎందుకు సంబంధించాలి? అవి మంజులవి ఎందుకు కాకూడదు? లేదా మంజీరవైనా అవొచ్చుగా! ఈలోగా మరో ఆలోచనకి తావివ్వకుండా మంజూష ప్రశ్న ఓవర్‌ల్యాప్ చేసేసింది-'' మీరు ఇక్కడెలా ఉన్నారు? మీ నేటివ్ ప్లేసా ఇది?''

''కాదు! అసలు నా స్వంత ఊరంటూ ఏదీలేదు. ప్రస్తుతం ఇక్కడున్నాను. రేపెక్కడుంటానో నాకే తెలీదు...'' ఆమె కంఠంలోని నిర్లిప్తత మంజూషని ఆశ్చర్యపరిచింది.

నాట్యశాస్త్రపులోతుల్ని చూస్తూ ప్రపంచప్రఖ్యాతి పొందుతూన్న కాదంబినీదేవికి- ఈ 'మెరుపుతీగ'కి మనశ్శాంతి కరువా?!

''మీకు ఆ దివ్యరాముడు- ఐమీన్... రాముని దివ్యరూపం అంటే చాలా ఇష్టమా?''

''చాలా! ఎలా గ్రహించారు?'' నవ్వుతూ అంది కాదంబిని.

ఎంత అందమైన నవ్వు... ''ఏంలేదు. సరదాగా అన్నాను. కాదంబిని అంటే మెరుపుతీగ కదా! ఆ రామధనువు... నిత్యం ఆ దివ్యసుందరుని కరకమల సాన్నిధ్యం వీడని ఆ బాణం 'మెరుపుతీగ' తప్ప మరోటి కాదనికదూ రామాయణం చెప్తోంది''

ఉలిక్కిపడింది కాదంబిని. దివ్యరామధనువు కాదంబిని అన్నమాట! దివీ! దివీ! అరె! కాళిదాసుని సైతం చదూకున్న తనకీ చిన్న విషయం ఎప్పుడూ ఊహలోకి రాలేదే! (దివ్యరామ్) ఒక్కక్షణం స్పందించిదామె హృదయం.

ఎవరీమె!? తన హృదయంలోని సున్నితమైన భావాల్ని ఎలా తాకింది? ఆప్యాయంగా చూసింది మంజూషవైపు.

''మీరు! మీరేం చేస్తుంటారు?'' అడిగేసింది.

''ఏంలేదు! జస్ట్ జస్టైనార్డినరీ హౌస్‌వైఫ్'' నవ్వుతూ అంది.

''అన్నట్టు ఈమధ్య ఏదో మాగజైన్లో మీతో ఇంటర్‌వ్యూ చదివేను? నాకు కొన్ని అభిప్రాయాలు అర్థంకాలేదు మీవి!''

''ఏమిటి?''

''ముఖ్యంగా కులం- మతం...''

నవ్వింది కాదంబిని. కదలికకు చెవినున్న క్రిస్టల్ తళుక్కుమంది. ''నిజానికా ఇంటర్‌వ్యూలో వాటి గురించి ప్రస్తావన ఎందుకు చెప్పండి?'' అని, కొంచెం ఆగి ''ఏదోలా నన్ను కించపరచడానికి అలా తెస్తుంటారు''

చిన్నగా నిట్టూర్చింది మంజూష. ''నిజమే! అసలు నిజంగా వాటి అర్థాలు తెలుసుకుంటే, ఈ అర్థంలేని క్యూరియాసిటీయే ఉండదు. మతం అంటే ఏముంది? అదొకమార్గం... మనం కోరుకున్న గమ్యాన్ని చేర్చే మార్గం... అంతేనా?''

''కరెక్ట్...'' మంజూష కళ్లు మెరిశాయి.

''కాని- ఆ మార్గం ఏమిటో తెలీక, గమ్యం ఎక్కడో తెలీక ఆ మార్గాన్ని చూపించేవారెవరో తెలీక- అసలు అదేమిటో తెలుసుకునే ఓపిక లేక- మతం అంటేనే ద్వేషం పెంచేసుకుంటున్నారు. దానిక్కారణం- ఎప్పుడో ఎక్కడోచోట మతం పేరిట మారణహోమాలు... తెలిసీతెలియని కుహనా నాయకుల మిస్‌ఇంటర్‌ప్రిటేషన్స్... ''

ఎడ్మైరింగ్‌గా చూసింది మంజూష- ''కాని- ఒక విషయం ఆలోచించాలి. ఆనాటికన్నా ఈనాడు సైన్స్ ఎంతో డెవలప్ అయింది. మనుషుల్లో రేషనల్ థింకింగ్ పెరిగింది. జనం ఆలోచనలూ- ఏటి ట్యూడ్స్ కూడా మారేయి.




ప్రతివాడు తన లైవ్లీహుడ్‌కి పాటుపడాల్సిన రోజులివి! ఇంత ఫాస్ట్‌లైఫ్‌లో మతం గురించి ఆలోచించే ఓపికా- తీరికా ఎందరికుంటాయి. చెప్పండి?''

''అంటే- మీ ఉద్దేశం... మన చుట్టూ ఎంతో విజ్ఞానం పెరిగింది. మనం కంట్రోల్ చెయ్యలేని పరిస్థితులు మనల్ని డామినేట్ చేసేస్తున్నాయిఅనా? అయితే మీరన్నవి ఫేక్ట్స్. మనక్కావలసిందది కాదు. జ్ఞానం విజ్ఞానం పెరగొచ్చు! వాటిని తెలుసుకొనే మనుషుల క్వాంటిటీ తగ్గిపోయింది. ఏ కొద్దిమందో ఉన్నా చాలా మందికి శాస్త్రీయధోరణిలో ఆలోచనా విధానం అలవడలేదు. అసలు ఏమాత్రం కెపాసిటీ లేనివాళ్లు పరిస్థితులతో మాత్రం ఎలా పోరాడగలరంటారు?'' సూటిప్రశ్న కాదంబినిది.

ఇంత బ్రైట్‌గా ఆలోచించే కాదంబిని మనసులోనా ఆ నల్లటి నీడలు!!? ఎంత చక్కని అవగాహన ఈమెది! అబ్బురపడింది మంజూష.

''కరెక్ట్ కాదంబినీ!... నిజానికి సొసైటీ మారాలి... మారాలి... అని గొంతు చించుకొనే వారు సొసైటీని మార్చడానికి ఏం చేస్తున్నారు. ఏం మార్చజూస్తున్నారు. అసలు వాళ్ళేం అర్థం చేసుకుంటున్నారు? నిజంగా ఈ సొసైటీ మారాలంటే వాదాలతో, నినాదాలతో మారుతుందా? సొసైటీ అంటే మనుషుల ఆలోచనా విధానం మారాలి'' ఆవేశంగా అంది.

''అవును! మొన్నేం జరిగిందో తెల్సా?'' అంటూ, ఆ బీచ్‌లోనే జరిగిన తన పర్స్ దొంగతనం గురించి చెప్పింది. అది చాలు నిజానికి! మన సొసైటీ ఏ కండిషన్లో ఉందో నిరూపించడానికి! వాడికి తిండీ, బట్టా ఇచ్చి చదివిస్తే ఎలా వుంటుందో ఎక్స్‌పెరిమెంట్ చెయ్యాలనిపించింది''

మంజూష మాట్లాడలేదు... ఆమె ఆర్గ్యుమెంట్‌లో ఎక్కడో ఏదో లోపం వున్నట్లనిపించింది. ఆ విషయం ప్రస్తావించకుండా ''ఒక సారి ఇదే బీచ్‌లో నాకూ ఇలాంటి సంఘటనే'' అంటూ రౌడీల బారిన పడబోతున్న తనను సంపత్ రక్షించడం వరకు చెప్పింది.

''అందరూ మీ ఫ్రెండ్‌లాగే ఉండరు కదా! ఈ రోజుల్లో మగాళ్ళని కూడా నమ్మలేం! రౌడీల్ని చూశాక, మరింత పిరికిగొతమ స్త్రీలని ఆ రౌడీలకి వదలి, బెదిరి పారిపోయే మగాళ్ళూ వున్నారు.

ఒక్కక్షణం గర్వంగా అనిపించింది మంజూషకి 'అందరూ మీ ఫ్రెండ్‌లాగే ఉండరు కదా!' అనే కాంప్లిమెంట్‌కి.

'అయినా అసలు మగవారిలో వున్నదీ- మనలో లేనిదీ ఏమిటి? ఫిజికల్ స్ట్రెంగ్త్... ఆడదంటే అన్నివిధాలా అబల అనేకదా మగవాడి ధైర్యం. నిజానికి వాళ్ళకున్న స్వంత బలం కంటే, మనం అబలలమన్న విషయమే వారికి బలాన్ని రెట్టింపు చేస్తోంది. ముఖ్యంగా నేను చెప్పదల్చుకున్నది- స్ట్రెస్ చేసి అనదల్చుకున్నదీ ఈ సంగతే! అంచేత స్త్రీలు ఫైన్ ఆర్ట్స్‌తో పాటు, మార్షల్ ఆర్ట్స్ కూడా నేర్చుకుంటే...''

ఒక్కసారి ఎంతో ధైర్యం- బలం వచ్చినట్లనిపించాయి మంజూషకి. ఆమె హృదయంలో కోటి సూర్యుల ఉదయోత్తేజం... అరె! ఈ విషయం తనకెందుకు తట్టలేదిన్నాళ్ళూ...

''నిజంగా ఈ రోజు స్త్రీల పొజిషన్ చూస్తోంటే జాలేస్తోంది... ఒక్కసారి పూర్వపు రోజుల్లో స్త్రీలను గుర్తుచేసుకోండి!... గార్గి, మైత్రేయి వంటి ఫిలాసఫర్లూ, పద్మిని, ఝాన్సీ, రాణీ సంయుక్తవంటి వీర నారులూ, అనసూయ, గంగ, శకుంతల, సత్యభామవంటి ఆత్మగౌరవం... ఆత్మవిశ్వాసం... ఆత్మాభిమానం... అభిజాత్యం వున్న స్త్రీలు... వాళ్ళని తల్చుకుంటే, ఎంత ఇన్‌స్పైరింగ్‌గా వుంటోందో... ఏదో పురాణ స్త్రీలూ, పతివ్రతలూ అంటూ వేళాకోళంగా తీసిపారేస్తారీనాటివాళ్లు... కాని నిజానికి వాళ్ళ గురించి డీప్‌గా మనకేం తెలుసని?'' ఆవేశంగా అంటోంది కాదంబిని.

''మీరు క్షమిస్తానంటే ఒక మాట! నిజానికి ఈ 'పతివ్రత' అనే కాన్సెప్ట్ నాకర్థం కాదు ఎంతకూ! అసలుండాలా ఆ విధంగా? మీరు చెప్పిన పతివ్రతల్లో నాకు నచ్చిన వాళ్ళు గంగ, సత్యభామ కాని... మిగతా వాళ్ళు'' ఆగింది మంజూష.

''ఆఁ!... పోనీ! వాళ్ళనిబట్టి అర్థంచేసుకోండి! 'ఒక్కొక్కరి స్వభావం ఒక్కోలా

వుంటుంది... కొందరు సౌమ్యంగా వుంటారు. కొందరు ఎమోషనల్‌గా ఉంటారు. కొందరు ఎప్పుడూ నవ్వుతూ లైట్‌హార్టెడ్‌గా వుంటారు... కాని, లోతుగా ఆలోచిస్తే వాళ్ళందరిలోనూ కామన్‌గా కనిపించేది ఒకటే! అదే 'ప్రేమ'... తాను ప్రేమించిన వాడికోసం ఏమైనా చెయ్యాలన్న ఆరాటం. ప్రేమ మేనులో ఐక్యమైపోయి, తన వ్యక్తిత్వం... అసలు తన 'అహం' సైతం విస్మరించడంలో ఓ అనిర్వచనీయమైన తృప్తి... కాదంటారా?''

''అంటే 'భర్త'ని వాళ్ళు అంతలా ప్రేమించేవారా?''

''భర్త, ప్రియుడు, ఆరాధకుడు, నెచ్చెలి, ప్రాణసఖుడు... ఎలాగైనా పిలవండి... అది మన ఏంగిల్. అంతా ఒకటే వాళ్ళకి. ఆనాటి స్త్రీలు పిరికిపందలు కానే కారు. విద్య, విజ్ఞానం ఆర్జించిన ధైర్యమూర్తులు. తమ ప్రియతమ వ్యక్తుల కోసం ఎంతో నిజాయితీని, ధైర్యాన్ని, తెగింపుని చూపించిన ప్రేమైక మూర్తులు... స్వయంవరంలో స్వేచ్ఛగా తమ భర్తలనెన్నుకొనే వారు. ఆ స్త్రీలలో వుండే స్ట్రాంగ్ ఇండివిడ్యుయాలిటీ... ఈనాడు ఒక్కరిలో అయినా ఉందేమో చూపించండి! అయినా, మీరు ఆనాటి కావ్యాలు చదివి తీరాలి! అప్పుడింకా బాగా అర్థమవుతుంది''

నిజమే! చదవాలి! కాని ఎలా? తనకి సంస్కృతం రాదే!? అవును! ఒక్కటి మాత్రం నిజం! స్త్రీలో ఎంతో ఔదార్యం ఉంది... ఔన్నత్యం వుంది. ఆర్ద్రత వుంది. త్యాగం వుంది. శక్తి వుంది. అఖండమైన ప్రేమ వుంది... కాని అటువంటి స్త్రీని అందుకొనే అర్హత అందరు పురుషులకూ వుందా?

''అయితే ఇప్పటి వివాహాలు...?''

''ఇప్పటి వివాహం ఒక బాధ్యతగా మారిపోయింది. భార్య అంటే భరించబడేది. భర్తంటే భరించేవాడు'' ఆవేశంగా అంది కాదంబిని.

''కరెక్ట్! ఎవరో మనల్ని భరించాలి! ఇష్టం వున్నా, లేకపోయినా భరించాలి! అసలు ఎవరో మనల్ని భరించే గతిలేని స్థితిలో ఎందుకుండాలి మనం?'' మరింత ఆవేశంగా అంది.




''ఆ ఇనుపవల ఎంతలా బిగుసుకుపోయిందంటే... ఇష్టం లేకపోయినా మనం ఏ మాత్రం బయటకొచ్చేయడానికి వీల్లేనంతగా బిగుసుకుపోయింది. తరువాత నిజమైన ప్రేమ మనకి దొరికినా, దానినందుకోలేని స్థితిలో కొచ్చేశాం!''

''ఎందుకందుకోలేం?''

''కేవలం 'నా మొగుడు నాకు నచ్చలేదు... నాకు నచ్చిన వాడు ఈమధ్యే కనబడ్డాడు... నా దారిన నన్ను పోనివ్వండి' అంటే చట్టం ఒప్పుకుంటుందా? పోనీ! చట్టాన్ని కాదని వెళ్ళిపోతే, ఆ తర్వాత నిజమైన సెక్యూరిటీ వుంటుందా మనకి? మనశ్శాంతి వుంటుందా?''

''ఐ మీన్ మనకి ఎంతో నచ్చిన వాడు, అన్ని విధాలా సంతృప్తిగా అనిపించినవాడు తటస్థపడ్డాడనుకోండి! అప్పుడతన్ని చేసేసుకోవచ్చుగా! సెక్యూరిటీ ఎందుకుండదూ?''

''అసలా పెళ్ళి చేసుకొనే హక్కు మనకెలా వస్తుంది... చట్టరీత్యా విడిపోందే?''

మతిపోయింది మంజూషకి... ఆమె వాదనలో ఎక్కడో ఏదో లోపం!

''మీరు మరోలా అనుకోకండి! ఈనాటి సొసైటీలో మన పొజిషన్ చెప్తున్నానంతే!''

''నో!... నో!... యూ ఆర్ రైట్! నిజంగా ఆలోచించవలసిన విషయాలే ఇవన్నీ!'' మంజూష అంది.

చుట్టూ చూసింది కాదంబిని...

జనం బాగా పలచబడ్డారు... ''చాలాసేపయింది... ఇంక వెళ్దామా?''

లేచారిద్దరూ...

ఆవేశంగా ఘోషిస్తోంది సముద్రం.

''మిమ్మల్నిలా కలిసినందుకు నాకు చాలా చాలా సంతోషంగా వుంది కాదంబినీ!''

''నాకూ చాలా హాయిగా వుంది మీతో ఇలా మాట్లాడ్డం! మొదటి పరిచయంలోనే చాలా దగ్గరివారిలా మాట్లాడేరు... చాలామందికి ఇలాంటి విషయాల గురించి మాట్లాడ్డం చాలా బోర్‌గా వుంటుంది''

''చాలామందిలో వాళ్ళం కాదు కదా మనం!'' నవ్వింది మంజూష.

''మా ఇంటికెప్పుడైనా వస్తుండండి! మీతో మాట్లాడ్డం నాకు చాలా హాయిగా వుంది!''

అంది ఆమె చెయ్యందుకుని.

ఆటో ఎక్కింది కాదంబిని "గుడ్‌నైట్"

'గుడ్‌నైట్' మరో ఆటో ఎక్కింది మంజూష. రెండూ చెరోవైపు బయల్దేరేయి. కొంతదూరం తర్వాత మెరుపులా తట్టింది కాదంబినికి అరె! ఆమె ఎక్కడుంటుందో కనుక్కోలేదే అని!



కారు నెమ్మదిగా నలబైలో పోనిస్తోంది మంజూష...

అప్సరా దాటి, కోర్టు దాటుతోంటే, సడన్‌గా అనుమానమొచ్చింది... అర్థమైంది... దివి కా రెందుకు తీసుకెళ్ళలేదో. పెట్రోలు రిజర్వ్‌లో కొచ్చేస్తున్నట్టుంది. ఇంకా స్లో చేసి, 'జగదాంబ' దాటించి- లేపాక్షి ఎదురుగా పెట్రోలు బంక్‌ద గ్గర ఆపింది కారు...

ఐదునిముషాల్లో తిరిగొచ్చింది చేతిలో చిన్న పేకెట్‌తో.

"హల్లో! మంజూషగారూ! బావున్నారా!" పక్కకు తిరిగిందామె గాగుల్స్ సర్దుకుంటూ.

రెండు చేతుల్లో వున్న సంచుల్లో కూరగాయ లూ ఆకు కూరలూ పైకి తొంగిచూస్తున్నాయ్. పక్కనే వున్న ఎనిమిదేళ్ళ కుర్రాడి చేతిలో మరో చిన్నసైజు చేతిసంచీ. ఇద్దరి మొహాలూ ఎర్రగా మారి చెమట్లు కక్కుతున్నాయ్.

'ఎవరీమె?... ఎక్కడ చూసేను?'... మంజూష గుర్తుచేసుకొనే ప్రయత్నం చేస్తోంది.

"గుర్తుపట్టలేదా?... మావారు మీ ఇండస్ట్రీస్ లోనే ప్లాంట్ సూపర్వైజర్. ఆమధ్య ఓ ఫంక్ష న్‌లో..."

ఠక్కున గుర్తొచ్చింది... "ఓహ్! మీరు మి సెస్ తరుణ్ కాదూ!"

కొంచెం మెరిశాయి ఆమె కళ్లు.

"ఆ!... అవునండి! నా పేరు విమల... మీ ఇండస్ట్రీస్‌లోని ఓ పెద్ద యాక్సిడెంట్ జర క్కుండా తన ప్రాణాలొడ్డి అదుకున్న సంద ర్భంగా దివ్యరామ్‌గారు ఏర్పాటుచేసిన ఫెలి సిటేషన్ ఫంక్షన్‌లో..." గర్వరేఖ కాబోలు.

"గుర్తొచ్చింది...!" పొడిగా అంది మంజూష.

ఎండ నెత్తిమాడ్చేస్తోంది...

"ఇంత ఎండలో... నడిచెందుకు వెళ్తున్నా రు? ఏ ఆటోలోనో వెళ్ళలేకపోయేరా?" ఆమె ఇంకా అక్కడే వుండడంతో, ఏదో మాట్లాడాలని అడిగింది.

"ఎందుకండీ?! జంక్షన్‌లో కొచ్చేశాంగా!... బస్సులో పోతాం!" అది మీడిల్‌క్లాస్ మొహ మాటంతో కూడిన సర్దుబాటు.

"నా కారులో డ్రాప్ చేస్తాను రండి!" ఫార్మ ల్‌గా అంటూ డోర్ తెరిచింది.

"ఇక్కడే! ఇక్కడే ఆపండి" గాభరాగా అంది విమల.

ఇద్దరూ దిగగానే, వెనక్కి వంగి డోర్స్ లాక్ చేస్తుండగా అంది... "ఇంట్లోకి రాకుండా వెళ్ళి పోతారా! రండి! కాస్త కాఫీ తాగి వెళ్దురుగాని!"

"ఇంత ఎండలో కాఫీయా? మరోసారి వస్తా నులెండి!"

"పోనీ!... మజ్జిగయినా తీసుకొని వెళ్లొ చ్చుగా!"

ఇక అట్టే బతిమాలించుకోవడం సంస్కారం అన్పించుకోదని దిగింది మంజూష.

లోపలికి నడిచారు.

ముందుగది నీట్‌గా వుంది...

పక్కగది రెండు మంచాలతోనే నిండిపో యిది. దాన్ని ఆనుకొనే వున్న వంటిల్లు... మధ్యగదిలోనే వున్న ఫోల్డింగ్ టైప్ కుర్చీలో కూర్చుంది మంజూష.

పరికిణీ, వోణీ వేసుకున్న ఓ ఇరవై ఏళ్ళ అమ్మాయి వచ్చి "పిన్నీ!" అంటూ లోపలికెళ్ళి ంది.

మాటలు వినిపిస్తున్నాయి. "ఈ కప్పుతో పంచదార వుంటే అమ్మ" ఆ పిల్ల మాటలు పూర్తికాకముందే, గిన్నెల చప్పుడు మధ్య "అయ్యో! పంచదార అయిపోయిందమ్మా! ఈ కప్పుడే వుంటుంది... కాని, చూస్తున్నావుగా! ఇలా ఇంటికెవరో ఒకరు వస్తూనే వుంటారు"

ఉలిక్కిపడింది మంజూష.

"అన్నట్టూ మీ అక్కయ్య గురించి"

నిశ్శబ్దం...

ఆ అమ్మాయి లోపల్నుంచి ఖాళీ కప్పుతో, తలొంచుకుని బయటకు వెళ్ళిపోయింది.

ఏదో గొణుక్కుంటూ వచ్చింది విమల...

"ఇలా అప్పులు ... అప్పులు... ఎన్నో తీసుకోవడం... మరి తిరిగివ్వడం వుండదండీ!... అయినా ఈమధ్య దీనక్క ఏం చేసిందో తెల్సా? ఆ పక్కింటి కుర్ర లెక్చరర్‌ని తీసుకుని ఎటో వుడాయించేసింది"

చిరాగ్గా చూసింది మంజూష.

"అన్నట్టు మజ్జిగ తాగండి!" స్టీల్ గ్లా సందించింది. నెమ్మదిగా నోటి దగ్గరపెట్టుకుంది మంజూష. "మొన్నెప్పుడో పిల్లలు బీచో బీచో అని చంపేస్తోంటే బీచ్‌కి తీసికెళ్ళేనండి! అప్పుడే ఎన్‌ఫీల్డ్ దిగి ఓ జంట మా ముందునుంచి నడిచి వెళ్తోంటే... ఆవిడ... మీరేమోనని..." కొంచెం ఆగి మంజూషవైపు చూసింది ఓరకంట... మళ్ళీ వెంటనే "ఆహఁ! పలకరించబోయేను... అంతే!" మళ్ళీ మంజూషవైపు రెస్పాన్స్‌కోసం చూసింది.

కాని మంజూష నిర్వికారంగా వుండడంతో "కాని ఆయన దివ్యరామ్‌లా లేరు. అందుకే అనుమానం వచ్చి ఆగిపోయేను..."

"పలకరించలేకపోయేరా?! అనుమానం తీరిపోనుకదా!"

'ఏమో! మనుమల్ని పోలిన మనుమలుండొచ్చు కదా! ఆయన దివ్యరామ్‌గారు మాత్రం కాదు!"

"ఆయన దివ్యరాంగారిలా లేరు... ఓకే! అయితే మాత్రం మంజూష కాకూడదని ఎక్కడుంది?"

"అయితే... మీరేనన్నమాట!" అత్యాశ్చర్యంగా అడిగింది.

"ఏమో! ఎవరయినా కావొచ్చు! మీరెవర్ని చూసేరో, ఎక్కడ చూసేరో నేను మాటవరస కంటున్నాను"

"అయినా అదేంటండీ? అలా పబ్లిగ్గా నడుస్తూ అదీ పక్కపక్కన పట్టపగలు బీచ్‌లో"

"చీకట్లో అయితే ఫర్వాలేదా?" సగం తాగిన గ్లాసు పక్కనపెట్టి లేచింది మంజూష.

బొట్టు పెడుతూ ఆరా తీస్తున్నట్టుగా అడిగింది "సాగరసంగమం చిత్రం మళ్లీ వచ్చింది. మీరుగాని మళ్ళీ చూసేరా?"

"లేదు!"

"లేదూ?!" సాగతీతలో ఏదో ధ్వనిస్తోంది.

"ఇందులో అంత ఆశ్చర్యపోవడానికేముంది?"

"అయితే ఆరోజు దివ్యరామ్‌గారితో వున్నది మీరు కాదన్నమాట!"

"దగ్గరికెళ్ళి చూడలేకపోయేరా?"

"నేను వెళ్ళలేదు... పక్కింటి వాళ్ళు చెప్పేరు"

గబగబా వచ్చి, కార్లో కూర్చొని స్టార్ట్‌చేసింది మంజూష. గేటు దగ్గరనిల్చున్న విమలని దగ్గరకి రమ్మని చేసైగతో పిలిచింది.

ఆసక్తిగా వచ్చి ముందుకి వంగింది విమల.

"చూడండి విమలగారూ! నేనెలాంటిదాన్నో రామ్‌కి తెలుసు! దివ్యరామ్‌గారెలాంటివారో నాకు తెలుసు! ఎవరి జీవితాలు వారు చూసుకోగలరు- ఒకరితో ఒకరికి ముడిపడివున్నా సరే! అలాగే ఇతర వ్యక్తుల జీవితాల విషయం కూడా! మీరు ఊళ్ళో వాళ్ళనుద్ధరించడం మానేసి ముందు మీ పిల్లల్ని చూసుకోండి! ఆఁ!... వాళ్ల చదువులూ- ఆరోగ్యం చూడండి!... మీ ఇల్లు చూసుకోండి!... మీ వార్ని చూసుకోండి! ఆఁ!... ఈ విషయం నాతోనే ఇంత డైరెక్టుగా అన్నందుకు సంతోషిస్తున్నాను"

నిటారుగా నించుని ఆశ్చర్యంగా చూస్తున్న విమలని ఫోర్స్‌గా దాటిపోయింది కారు.

"డర్టీ గూస్! ఎంత అన్‌కల్చర్డ్ ఫెలో!




పూర్! ఎదగని స్త్రీ''

విమల అలా అన్నందుకు బాధపడ్డంలేదు...

బాగా చదూకున్న మగ మేధావులు సైతం, కేవలం కట్నం డబ్బులికి... కక్కుర్తిపడి ఇలాంటి సంస్కారరహిత బెంటుసరుకుని జీవితాంతం భరిస్తున్నందుకు.

వీళ్లు సంపాదిస్తున్నది ఏమిటో?! వీళ్ళకే అర్థంకాదు.

★ ★ ★

అశాంతి!... అశాంతి!!... అశాంతి!!... అవిశ్రాంతంగా అంతంలేకుండా ఎక్కడున్నా ఎప్పుడైనా...

ఇంటా బయటా, ఫ్యాక్టరీ ప్రెమిసెస్‌లో ఆఫీస్ రూంలో నో!నో!

రివాల్వింగ్ ఛైర్లో వెనక్కివాలాడు దివ్యరామ్.

స్ప్రింగ్ డోర్ తెరుచుకుని వచ్చాడు లోపలికి.

డాక్టర్ శోభనాద్రి... ఆర్.ఎమ్.పి...

మర్యాదకోసం, లేచి కరచాలనం చేసి, కుర్చీ ఆఫర్‌చేశాడు దివ్యరాం.

''ఏంది వోయ్! చాలా డల్‌గా కనబడుతున్నావ్? మెంటల్ వీక్‌నెస్ అనుకుంటా మల్ల'' ఏకవచన సంబోధనకి ఆశ్చర్యం కించిత్ కలిగినా, అతడు మరో ప్రాంతానికి చెందినవాడు కావడంతో, అతడి స్వభావానికి సరిపెట్టుకున్నాడు. ఎడ్యుకేషన్ భాషని కొంత సంస్కరించవచ్చునేమో కాని- గుణాల్ని మాత్రం కాదు... ఆ సంగతి దివ్యరామ్‌కి తెలుసు!

''ఎట్ల నడుస్తాంది బిజినెస్సు?''

ఇట్సాల్‌రైట్! మీ డిస్పెన్సరీ బాగా పుంజుకుందా?'' ఏదో మాట్లాడకపోతే బాగుండదని వేసిన ప్రశ్న... తెచ్చిపెట్టుకున్న చిర్నవ్వు కలగలిపి.

''ఏముంది భయ్! యాక్సిడెంట్ కేసులల్ల జర్ర పైసలు కమాయించొచ్చు! అవ్వీగూడ, కూలోళ్ళ కేసులైతే లాసే!''

''పాపం! మందులకే డబ్బుండదు వాళ్ళకి. ఏదో చూసీ చూడనట్టు... అసలు పట్టించుకోరు గవర్నమెంటాస్పటల్స్. మనలాంటి వాళ్లం కూడా''

దివ్యరాం మాటలు కట్‌చేస్తూ, ''ప్రజాసేవ సెయ్యనీకి దవఖాన తెరుస్తామా సారూ! గట్లయితె పాల్టిక్సులోకి ఎల్లక పోతుంటిమా? అయినా ఈ కూలోళ్ళ తీరే అంత... నీ కాల్మొక్త దొరా! అని మనకి దండం బెడ్తారు. పైసల్లే వంటరు. అమ్మాయిలవెంటబడి వొందలికి వొందలు తగలేస్తరు''

దివ్యరామ్‌కీ భాష అసహనంగా వుంది.

''జర్రచాయ్ తెప్పియ్ రాదు రామ్‌భై''

తప్పదన్నట్టు, కాలింగ్‌బెల్ మోగిస్తూ, శోభనాద్రి చేతిలో పుస్తకం వైపు అప్రయత్నంగా చూసేడు. ఏదో చీప్ తెలుగు సెక్స్‌మాగజైన్.

దివ్యరామ్ చూపుల్ని మరోలా అర్థంచేసుకున్నాడు శోభనాద్రి.

''ఆమె రాత్రులు చూసినవ్?''

కోపంగా చూశాడు దివ్యరామ్. వెంటనే కంట్రోల్ చేసుకుంటూ, జనరలైజ్ చేసి అన్నట్టుగా ''చీప్ మూవీస్ ఆర్ వోన్లీఫర్ చీప్ థింకింగ్ పీపుల్'' అన్నాడు. ఎం.బి.బి.ఎస్. డాక్టరు కాకపోవడంవల్ల దివ్యరామ్ మాటలు అతడికి వెంటనే అర్థంకాలేదు.

గట్టిగా నవ్వేడు శోభనాద్రి... తనకి ఇంగ్లీష రాదన్న సంగతి, దివ్యరాంకెందుకు తెలియాలన్న ధోరణిలో ''మొన్నామధ్య జేమ్సుబాండ్ పిక్చర్ చూసిన... ఎనిమిదిన్నర వేస్ట్... జర్ర గింతగూడ సెక్స్‌లేదు''

ఛ! ఛ! ఒంగోలు గిత్తలా మొహమూ వీడూనూ...

అలవాటైన ధోరణిలో బెల్ మోతకి లోపలికొచ్చిన అటెండర్, ఫ్లాస్కు తీసుకుని వెళ్ళాడు.

''నీ కన్న మీ ఆవిడ నయం... పక్కన ఓ పోరగాడ్నేసుకుని- సక్కంగ వొచ్చింది. ఆ సిన్మల హీరో హీరోయిన్ల లెక్కనున్నారిద్దరూ! నిజంగా అంటున్న భై''

పటపట నూరుతున్న పళ్ళు దివ్యరామ్‌ని కంట్రోల్ చెయ్యలేకపోతూ...

''పనిగట్టుకు ఇది చెప్పడానికే వచ్చేవా?''. తనకి తెలీకుండానే తానూ ఏకవచనంలోకి దిగిపోయేడు.

అదేం పట్టించుకోనట్టుగా ''టేస్టంటే మీ మిసెస్‌దే భై'' అన్నాడు శోభనాద్రి.



ఇక కంట్రోల్ చేసుకోవడం దివ్యరామ్‌వల్ల కాలేదు.

"యూ!" విసురుగా లేచి "అన్ కల్చర్డ్ ఫూల్! గెటౌట్ ఫ్రం హియర్" వేలు బయటికి చూపించాడు.

ఇతరుల్ని హింసించి, ఆనందం పొందే శాడిస్ట్ లక్షణాలున్న ఆ ఆర్.ఎం.పీ. వికృతంగా నవ్వుకుంటూ "నిజం చెప్తే నిష్ఠూరంగా వుంటది మల్ల! నాకు వున్నదున్నట్టు అనడవే వస్తదిగాని, మీ డబ్బున్నోల్లలాగ మాయచైడం తెల్వది" అనేసి బయటికి నడిచాడు.

డర్టీఫెలో! బుర్రలేని రాస్కెల్స్! వీళ్ళని ఏరి పారెయ్యాలి. తెలుగు మాట్లాడుతూ, తెలుగు తిండి తింటూ, తెలుగు రాష్ట్రంలో వుంటూ, వచ్చీరాని తెలుగులో గొప్పలు పోతున్నాడు. వీడికెంత ధైర్యం? పాపం అమాయకులు... ఇలాంటి వాళ్లని ఫుల్ ఫ్లెడ్జ్‌డ్ డాక్టర్ల కింద ట్రీట్‌చేసి అందలమెక్కిస్తూంటే, ఆ డబ్బుతో మదించిపోయి, హైసొసైటీలో చోటుచేసుకోడానికి క్లబ్బులకీ అసోసియేషన్లకీ ప్రాకిపోతున్నారు. అతికష్టంమీద కుర్చీలో వాలాడు దివ్యరాం.

రెండు...మూడు నిముషాలు...

అలా అసహనంగా- మరింత అశాంతిగా..

నాలుగో నిముషంలో అతడాగదిలో లేడు

శరీరం మనసూ మండిపోతూంటే, తన ఛాంబర్ బయట పార్కుచేయబడివున్న ఎవరిదో స్కూటర్ ఎనభైలో పోనిచ్చి ఇల్లు చేరేడు.

గబగబా లోపలికి నడిచాడు...

బాల్కనీలో టక్కుమని ఆగిపోయేడు.

పెద్ద ఇత్తడి తాళం కప్ప... వెకిలిగా, వేళాకోళంగా, శోభనాద్రి నవ్వులా... వేలాడుతూ కన్పించింది.

ఉడికిపోయాడు దివ్యరామ్. ఒక్కసారిగా అతనిలో బి.పి. రెయిజైంది.

ఎక్కడికిపోయింది?... ఎవడితో పోయింది? రానీ! ఎప్పుడొస్తుందో అప్పుడే రానీయ్!... ఇక్కడే వెయిట్ చేస్తాను.

ది గ్రేట్ ఇండస్ట్రియలిస్ట్ దివ్యరామ్... కోరుకున్నచోట కుర్చీ వేయించుకోగల దివ్యరామ్ కనుసన్నల్లో పనివాళ్ళని మెయింటెయిన్ చెయ్యగల దివ్యరామ్... కసిగా వరండా మెట్లమీద కూర్చున్నాడు పక్కనే కుండీలో వున్న క్రోటన్ ఆకుల్ని చిదుముతూ.

పైన ఎండమాడ్చేస్తోంది. వేడిగా గాలి- మరింత చిరాగ్గా.

అరె!... హడావుడిగా తాను వేసుకొచ్చేసిన స్కూటర్ ఎవరిదో చూడనైనాలేదే! పెట్రోలు రిజర్వ్‌లోకి రాకుంటే, తన కారే ఉపయోగించేవాడు తాను.

పది నిముషాలయింది.

ఇరవై... ముప్పై... నలభై...

యాభై...

దాదాపు గంట కావస్తూండగా, కారు హారన్ మోగింది.

నిటారుగా నించున్నాడు రామ్.

'ఇద్దర్నీ ఒక్కసారే కడిగేస్తాను'

ఆతృతగా చూస్తున్నాడు. కార్లోంచి మంజూష దిగింది- ఫెడేల్మని గట్టిగా చప్పుడు చేస్తూ డోర్ వేసేసి.

గబగబా వచ్చింది- రామ్‌ని చూసి క్షణం ఆగింది.

మంజూష వెనక ఎవరూ రాలేదు.

"అరె!... మీరు... ఈ టైమ్‌లో... ఎయిత్ వండర్..." గబగబా మరింత ముందుకొచ్చి, హేండ్ బ్యాగ్‌లోంచి తాళం తీస్తూ అంది "ఎనీవే... ఎలాగూ లంచ్ టైంలో వచ్చేరు గాబట్టి భోంచేసి వెళ్ళిపోండి! వంట చేసేసే వెళ్ళేను నేను..."

"ఎక్కడికి?" అతని కంఠంలోని తీవ్రతకి ఉలిక్కిపడింది.

"కలర్స్ అయిపోయాయి. అలాగే రెండు పెయింట్‌బ్రషెస్ కూడా... కొనాలని"

"ఒక్కదానివే వెళ్లేవా?"

"ఏం చెయ్యడం? ఎవ్వరూ లేరు. ఆఁ!... అన్నట్టు మధ్యలో- మీ సిన్సియర్ సూపర్వయిజర్ మిస్టర్ తరుణ్ మిసెస్ కనిపిస్తేనూ... లిఫ్ట్ ఇచ్చేను"

"ఉద్ధరించేవులే! మొన్న జేమ్స్‌బాండ్ ఎవరితో చూసేవు?"

"సంపత్‌కుమార్‌తో..."

రెచ్చిపోయేడు రామ్... ఎంత కూల్‌గా-





అమాయకంగా మాట్లాడుతోంది!

"నా కళ్ళుగప్పి నువ్వేస్తున్న వేషాలు, నీ తిరుగుళ్ళు... నాకు తెలీవనుకోకు. పిల్లి కళ్ళు మూసుకు పాలు తాగినా"

చురుగ్గా చూసింది పక్కకు తిరిగి అతన్ని. సీరియస్‌గా అంది "ఓహో! సామెతలతోసహా మీ తలనెవరో చెడగొట్టేరులా వుందే!"

"ఎవరన్నది కాదు ప్రశ్న! అది నిజమవునా కాదా?"

"ఏది?"

"అదే! నువ్వు వాడితో"

"ప్లీజ్! అతనితో ఒక్క జేమ్స్‌బాండ్ మాత్ర మేనా? బీచ్‌కి, రెస్టారెంట్లకి, షైర్... షాపింగ్... ఎన్నిటికో వెళ్ళాను... చాలా?"

ఛెళ్‌మంది ఆమె చెంప.

షాకయిపోయింది మంజూష...

చెంపమీద చెయ్యి వేసుకుని, ఒక్కక్షణం... డీప్‌గా అతనిమొహంలోకి చూసి తాళాలు అతని చేతిలో పెట్టి గబగబా వరండా మెట్లు దిగింది. ఆమె ఇల్లు వదిలిపోతుందేమోనన్న భావం క్షణంలో వెయ్యోవంతుపాటు కదిలింది.

"ఎక్కడికి?"

"నీ ఇంట్లోంచే కాదు... నీ జీవితంలోంచే పోతున్నాను... జాగ్రత్తగా వేసుకో తలుపులు"

అలవాటుగా కారు దగ్గరికి వెళ్ళబోయి వెంటనే పక్కకి తిరిగి, విసురుగా గేట్లోంచి బయటికి నడిచింది.

కాదంబిని డ్యాన్స్‌ప్రోగ్రాం రైల్వే ఆడిటోరియంలో ఇస్తున్న సందర్భంగా వేసిన పోస్టర్స్ ఎదురుగోడకి అంటిస్తున్నారో ఇద్దరు సిన్మాపోస్టర్లంటించే మనుషులు. మంజూష దృష్టి అప్రయత్నంగా వాటిమీద పడింది. కారణం- కాదంబిని అభినయ భంగిమ రంగుల్లో నేత్రపర్వమవడం.

★ ★ ★

చిన్న జర్క్‌తో కారాపి, నెమ్మదిగా దిగాడు దివ్యరామ్.

ఒక్కసారి ఆప్యాయంగా ఆ యింటివైపు చూసి, లోపలికి నడిచాడు. స్థంభాలకి చుట్టుకున్న లతలు ముద్దుగా పలకరించాయి. నెమ్మదిగా వరండాదాటి, డ్రాయింగ్ రూంలోకి ప్రవేశించి ఆశ్చర్యంగా నిల్చుండిపోయాడు.

ఆవేశంగా, పరిసరాలను సైతం విస్మరించి నాట్యం చేస్తోంది కాదంబిని.

తనను చూస్తుందేమోనని కదలకుండా అలాగే నిల్చున్నాడు. ఆమె చూడలేదు... నాట్యం ఆపలేదు.

తన్మయత్వం చెందుతూ చూడసాగాడు ఆమె నాట్యాన్ని.

మెరుపు కన్నావేగంగా సాగుతోందామె కర పద విన్యాసం...

ఒక్కసారిగా గిర్రున తిరుగుతూ తటిల్లతలా వచ్చి ఒక భంగిమలో అతడిముందు కూర్చుంది.

ఎడ్మయిరింగ్‌గా చూడబోయి, ఆశ్చర్యపోయాడు దివి.

ఆమె కళ్ళలో నీరు... కాలువలు కడుతోందా అన్నట్టు.

ఆమె మొహంలో ఏ భావమూలేదు. ఏదో కలలోలా వుంది.

"కాదంబినీ!" ఆమె ముఖాన్ని చేతుల్లోకి తీసుకోబోయేడు.

అంతే! విద్యుల్లతలా మళ్ళీ లేచి, కంటిన్యూ చెయ్యసాగింది-

అతడికేం అర్థం కావడంలేదు.

ఇంక ఆపితే బావుండునని చూస్తున్నాడు.

"కాదంబినీ!" దగ్గరకు వెళ్లి ఆపబోయేడు. చేతుల్తో తోసేసిందతన్ని.

వెనక్కి తూలబోయి, నిలదొక్కుకున్నాడు.

వీరావేశంలో చేస్తోందామె నృత్యం. అతనికి ఏవో అపశృతులు వినిపించసాగాయి ఆమె కాలి అందెల్లో.

"ఏమయింది కాదంబినీ?" ఆతృతగా దగ్గరకు రాబోయేడు.

అలా మరో పదినిముషాలు చేసి, అలసిపోయి ఒక్క విసురుతో మెత్తటి తివాసీమీద పడిపోయింది... అతని కాళ్ల దగ్గరగా.

రెండు క్షణాల అనంతరం అలసటగా రొప్పుతూ, నెమ్మదిగా తలెత్తి అతనివైపు చూసింది... ఆమె ముఖంలో భరించలేని



విషాదం.

''కాదంబినీ! ఏమిటీ ఆవేశం? ఏమిటిది?''

''శివతాండవం'' మళ్ళీ ఆమే అడిగింది ''శివుడు తాండవం ఎప్పుడు చేసేడో తెలుసా?'' చిన్నగా రొప్పుతూ.

''కాదంబినీ!'' ఆమె భుజాలు పట్టి లేవదీయబోయేడు.

చటుక్కున విదిలించుకొని లేచి నించుంది.

''పార్వతి తనకు కాకుండా పోయినపుడు!''

''కాదంబినీ!''

'పార్వతి శివుడికి కాకుండా ఎందుకు పోయింది? ఎలా పోయింది?'

''ఇంకొక్కక్షణం కూడా నా ముందుండొద్దు... వెళ్ళిపో... వెళ్ళిపో ప్లీజ్!'' గబగబ ముందుకి నడిచి, బెడ్రూమ్‌లోకి వెళ్లింది.

''కాదంబినీ!'' ఆమె వెనకే వెళ్ళబోయేడు.

''ఐ సే గెటౌట్'' హిస్టీరిగ్గా అరుస్తూ తలుపేసేసింది.

రామ్‌కేం చెయ్యాలో తోచలేదు.

ఇల్లంతా నిశ్శబ్దంగా ఏదో విషాద రాగాన్నాలాపిస్తున్నట్టుగా వుంది.

సన్నటి తెరలు జాలిగా కదుల్తున్నాయి.

చుట్టూ వున్న ప్రతి వస్తువు అతన్నేదో ప్రశ్నిస్తున్నట్టుగా వుంది.

ఏమయింది కాదంబినికి?

అలా అపరకాళిలా శక్తి స్వరూపిణిలా... ఎందుకలా?

వెళ్ళిపోవాలా?... ఉండాలా?... నిముషాలు దొర్లుతున్నాయి.

నెమ్మదిగా బెడ్రూం తలుపు తెరుచుకుంది.

వడివడిగా వచ్చి అతని ముందు నించుంది కాదంబిని. ప్రశాంతంగా ఉందామె మొహం... తుఫాన్ తదనంతర ప్రశాంతత.

''కాదంబినీ!''

''రేపు నేనో గ్రాండ్ పార్టీ ఇవ్వాలనుకుంటున్నాను!''

దేనికి అని అడగడానికి భయమేసిందతనికి

''మీరు తప్పకుండా రావాలి! ఆఁ! వచ్చేటప్పుడు మీ ఆవిణ్ణి కూడా తీసుకురండి!''

దివ్యరామ్ మెదడులో సన్నటిహోరు... అది క్రమంగా పెద్దదై ఝంఝా మారుతంలాగా మారింది. ఆ పెను ప్రభంజనంలో ఎగిరిపోతూన్న గాలిపటాన్ని కంట్రోల్ చెయ్యడానికి విపరీతంగా ప్రయత్నిస్తూ అతికష్టంమీద అన్నాడు ''కాదంబినీ!''

''ఇంక నేను చెప్పవలసిన అవసరం లేదు... వినవలసిన అవసరం అసలే లేదు''

గబగబా లోపలికి వెళ్లిపోయి, బెడ్‌మీద బోర్లాపడిన శబ్దం!

ఏదో పీడకలలో నడుస్తున్న వాడిలా బయటికొచ్చేడు రామ్.

★ ★ ★

''ఎంతపని చేశావు దివ్యరామ్!'' భారంగా తలపట్టుకుని, బాధగా అన్నాడు డాక్టర్ సాధూ... ది ఫ్యామ్లీ ఫ్రెండ్ ఆఫ్ బోత్ దివీ అండ్ మంజూ.

''నేను బాధపడుతున్నది ఆ డర్టీఫెలో శోభనాద్రి అలా అన్నందుక్కాదు. వాడి మాటలు పట్టుకొని నువ్వు మంజూషని అనుమానించినందుకు'' మళ్ళీ అతడు అన్నాడు.

నిరుత్తరుడయ్యాడు దివ్యరామ్.

''వెధవ! నీ ప్రెమిసెస్‌లోకొచ్చి, అంత అవమానకరంగా మాట్లాడతాడా!? దివీ! చూస్తుంటే అతడు నీకీ సంగతి చెప్పి ఆనందించడానికే అయివుంటుంది. అసలు ఆ బాస్టర్డ్‌గాడెలాంటివాడో తెల్సా? వేలు గుమ్మరించి డిగ్రీ కొనుక్కున్న రాస్కెల్. తాటికల్లు గీసి అమ్ముకోవలసిన వాళ్ళకి నడమంత్రపుసిరి అబ్బిందిలే! ఫ్యాక్టరీలకి ప్లేస్ కావాల్సొచ్చి గవర్నమెంటు వాళ్ళు, వాళ్ళ పోరంబోకు భూములకి చెల్లించిన కరెన్సీ కట్టలు వాడికింత తలపొగరు ఎక్కించేయి. !'' ఏదో అనబోయి సిన్సియర్‌గా బాధపడుతున్న దివ్యరాం ముఖం చూసి ఆగిపోయేడు డాక్టర్ సాధూ.

''అసలు ఇలాంటివాళ్ళు డాక్టర్లమని చెప్పుకు తిరుగుతూంటే, మాలాంటి వాళ్ళం తలలు వంచుకోవాలి. ప్చ్! ఏం చేస్తాం! ఐదు లక్షలకి వీళ్ళ కులం పిల్లే వీణ్ణి కొనుక్కుంది. అంచేత వీణ్ణి ఎప్పుడో తనకి మరీ ఛాయిస్




లేనప్పుడు తప్పు వాడుకోదు... దాంతో వీడిలా శాడిస్ట్‌లా మారిపోయి, చవక రకం సెక్స్ పుస్తకాలు చదువుతూ, చవకబారు సెక్స్ సినిమాలు చూస్తూ తృప్తిపడుతుంటాడు. అలాంటి వెధవ మాటలు పట్టుకుని నీ మంజూషని అనుమానించేవు. నీకు తెలీదు రామ్- ఆమె ఎంత ఉన్నతురాలో! ఎంత అభిమానవతో! ఎంత బలమైన వ్యక్తిత్వం వున్న మనిషో! ఏవో చౌకబారు ఆకర్షణలకి లొంగిపోయే వీక్ మెంటాలిటీ కాదామెది'' ఒక్కక్షణం ఆగి అన్నాడు డాక్టర్ సాధూ ''దివీ! నువ్వెలాంటి వాడివో నీకు తెలుసు! ఆమెది చవకబారు వ్యక్తిత్వమైతే, నిన్ను చేసుకున్నందుకు నువ్వు చీప్ మనిషివన్నమాట!''

''సాధూ''

''య్యస్! మంజూషని అనుమానించడమంటే, నిన్ను నువ్వు అవమానించుకోవడమే! భార్యగా ఆమె నీకెంతో తెలిసుండాలి. అప్పుడప్పుడు నేను మీ ఇంటికొచ్చినప్పుడు... నేను అబ్జర్వ్ చేసేకనే, ఆమె ఔన్నత్యం గ్రహించాను. యాజె సైకాలజిస్ట్, ఐ సజెస్ట్ యూ దట్ యూ మస్ట్ ఛేంజ్ యువర్ ఒపీనియన్... అంత ఉన్నతమైన వ్యక్తిత్వం వున్న స్త్రీ నా స్నేహితుడి భార్య అయినందుకు నేనే ఎంతో గర్వపడుతుంటాను. అలాంటిది నువ్వు... ఇంకా''

''ప్లీజ్! సాధూ... సాధూ! ఇంకేం చెప్పకు'' గొంతులో గరగర.

''పగలూ- రాత్రనక ఎప్పుడూ నువ్వు ప్రొడక్షను ఎక్స్‌పోర్ట్స్- ఆడిట్లు- అక్కౌంట్లు అంటూ నీదైన బిజినెస్ వరల్డ్‌లో వుంటావు. మరి!? అప్పుడప్పుడు మార్పుకోసం కాస్త ఫ్రెండ్స్‌తో బయటికెళ్లేనేం? దివీ! స్నేహితులు ఆడా- మగా అని విభజించేటంత హీనమైన స్థితిలోనే ఉన్నామా మనమింకా?! అయినా ఎవరితో ఎంతవరకు ఎలా మెలగాలో మంజూషకి తెలుసు! షి ఈజ్ నాట్ె కిడ్!''

''స్టాపిట్! సాధూ స్టాపిట్!'' తల పట్టుకుని ఆందోళనగా అన్నాడు దివ్యరామ్.

పర్వతాల ఒడిలో ఒదిగిపోయిన విశాఖ... అందమైన అమాయకమయిన పెళ్లికూతుర్లా ధగధగ మెరిసిపోతోంది- రంగురంగుల లైట్లతో. పారపెట్‌వాల్‌నానుకుని నిల్చున్నాడు దివి. శరీరాన్ని తాకుతున్న చల్లనిగాలి అతడి హృదయాన్ని మాత్రం మండిస్తోంది.

చటుక్కున వెనక్కితిరిగాడు. వాచ్ చూసుకుంటూ అన్నాడు- ''సాధూ...! ఇప్పుడు ఎనిమిదైంది. నేవెతకడానికెళ్లడం మంచిదేమో...!'' జవాబుకోసం చూడకుండా కదలబోయాడు.

''గాభరాపడకు దివీ! ఆవేశంలో ఎలాంటి అఘాయిత్యం చేసుకునే పిరికిపంద కాదు మంజూష. పద వెళ్దాం!''

దూసుకుపోతూన్న కార్లో- ఆవిరైపోతూన్న దివి ఆలోచనలు.

ఏకదీక్షగా పోతోంది కారు- అరవై... డెబ్బై... ఎనభై... పాతసిటీ అంతా చూసి జగదాంబావరకు వచ్చి స్టేషన్‌రూట్‌లో పోనిచ్చాడు డాక్టర్ సాధూ.

స్టేషన్‌లో కారాపి గబగబా ఇద్దరూ లోపలికెళ్లేరు.

కోరమాండల్ అరగంట లేటని అనౌన్స్‌మెంట్ విన్పించింది.

స్టేషన్ అంతా జనం... జనం...

నిరాశగా ఇద్దరూ స్టేషనంతా కలయతిరిగారు.

బయటికొచ్చి మళ్ళీ స్టార్ట్ చేశారు కారుని. ఈసారి హైవేమీదుగా పోతోంది. బీచ్, పార్కులు అన్నీ చూసేసేరు.

''రామ్... నా ఉద్దేశంలో ఆమె మిష్టర్ సంపత్‌కుమార్ ఇంటికి వెళ్లివుండాలి. కాస్త ఆవేశం తగ్గాక ఆమె ఇంటికే వచ్చేయొచ్చు''

''ఏదో ఊరటకోసం అంటున్నావు కాని, డాక్టర్! మంజూష ఇక రానని వెళ్లిపోయింది...''

''యస్! డాక్టర్‌ని- అందులోనూ సైకాలజీలో స్పెషలైజ్ చేసినవాణ్ణి కనుకనే చెప్తున్నాను. ఎంత ఎమోషనల్ అయినా, మంజూష వైవాహిక బంధానికి విలువివ్వని వనిత కాదు...''

''కాని... సాధూ! నేనా ఇంట్లో అడుగుపెట్టలేను సాధూ! ఆ భయంకరమైన నిశ్శబ్దం- శూన్యం నన్ను తినేస్తోంది''

''పద...! మా ఇంటికెళ్దాం!''

"నో సాధూ! ఐ కాంట్... నేనెక్కడా ఉండలేను. మంజూష లేని నన్ను నేనుగా ఊహించలేను"

"అందుకే- ఒక్కసారి అలా మీ ఇంటిమీదుగా వెళ్లొద్దాం. కాస్త రిలాక్స్‌కోసం తర్వాతేం చేద్దామో ప్లాన్ చేసుకోవచ్చు" అంటూనే అప్‌లేండ్స్‌వైపు పోనిచ్చాడు డాక్టర్ సాధూ.

చిన్న జర్క్‌తో ఇంటిముందు కారాగింది.

శూన్యం... చీకటి నిశ్శబ్దం.

అప్రయత్నంగానే కారు దిగారు ఇద్దరూ.

పెన్‌టార్చ్ వెలిగించాడు సాధూ.

క్షణంలో వెలుగు వెల్లువ రెయిలింగ్ మీదికి ప్రసరించింది.

సంభ్రమానందాలు కమ్ముకున్నాయ్ ఇద్దరికీ. నోటమాట రాలేదు.

రెయిలింగ్ కానుకుని- ఆ చీకట్లో ఎంత సేపట్నుంచి వుందో... మంజూష.

"మంజూ!" రెండంగల్లో ఆమెని చేరుకుని, ఆతృతతో ఆనందంతో దగ్గరకు తీసుకోబోయేడు.

భుజాలమీద చెయ్యి వెయ్యగానే, చటుక్కున పక్కకి వొరిగి నేలమీద పడిపోయింది.

కంగారు, ఆందోళన... "సాధూ! డాక్టర్ మై ఫ్రెండ్! మంజూకేమైందో చూడు సాధూ" పిల్లవాడిలా, ఏడుపొక్కటే తక్కువగా రుద్ధమైన కంఠంతో దివ్యరామ్.

డాక్టర్ సాధూ, ఒక్క ఉదుటున ఆమె చెయ్యి అందుకుని పల్స్ చూడసాగాడు. ఆమె ఏదో చెప్పాలనుకుంటోంది. కాదు! గట్టిగా అరవాలనుకుంటోంది. కాని, గొంతుదాటి మాట బైటికి రావడంలేదు.

★ ★ ★

నెమ్మదిగా కళ్లు తెరిచింది- మంజూష.

చుట్టూ చూసింది.

తెల్లగా పాలరాయిలాంటి గోడలు, మెత్తటి పాలనురుగులాంటి పక్క... ఎక్కడుంది తను? పాలసముద్రంలోనా? శేషతల్పంమీదా? కాదే!

వెనక పెద్ద కిటికీ... కిటికీలోంచి వస్తున్న చల్లటిగాలి...

హమ్మయ్య...

తాను భూమ్మీదే వుందన్నమాట!

కిందికి చూసింది.

తనవంకే, ఆతృతగా చూస్తున్న ఆ వ్యక్తి ఎవరు? ఎవరు?

తుళ్లిపడింది... దివ్యరామ్.

"వద్దు... వద్దు..."

చటుక్కున అతడ్ని తోసేసి, బోర్లాతిరిగి మెత్తటి తలగడలో మొహం దాచుకుంది.

గబగబా బయటికొచ్చేడు దివ్యరామ్.

"సాధూ! మంజూషకి తెలివొచ్చింది. కాని, ఏదోలా ప్రవర్తిస్తోంది. నన్ను గుర్తుపట్టడంలేదు" ఆందోళనగా అన్నాడు.

ఇద్దరూ లోపలికొచ్చేరు. ఆమె తలవైపు నిల్చున్నాడు దివి. ఆమె బెడ్‌పక్కనే నిలబడి డాక్టర్ సాధూ "మంజూషా! మంజూషా!" అని మృదువుగా పిల్చేడు. మెల్లగా ఆమెనిటు తిప్పాడు.

ఇటు తిరుగుతూ, భయంగా చూసింది- మంజూష... "హమ్మయ్య! మీరా... నాకు చాలా భయమేసింది"

"ఎందుకు?"

మాట్లాడలేదు మంజూష.

"పోనీ! నేను నేనేనా? నన్ను గుర్తించారా? ఇది వాస్తవమని నమ్మగలరా?"

"వైనాట్? డాక్టర్ సాధూ! మీరెంతో మంచివారు. మీరే- మీరే నన్ను రక్షించారుకదూ! నాకు చేయూత ఇచ్చారుకదూ" తాను ఆమె నాడి చూస్తున్నప్పుడు ఆమె చేతనావస్థనుమప్తావస్థ మధ్య స్పృహ తప్పిందన్నమాట. మళ్ళీ తెలివొచ్చేలోగా ఆమె వాస్తవసంఘటనల ఆధారంగా కొన్ని హెల్యూసినేషన్స్‌కు గురైవుండాలి. అందుకే ఈ కలవరపాటు.

"చేయూత ఇచ్చిందెప్పుడు? ఎక్కడ?"

మాట్లాడలేదు మంజూష.

చటుక్కున అతని చేతులు పట్టుకుంది- "మీరిక్కడే వుండండి- ప్లీజ్!"

"ఓ.కే! మీరు ప్రస్తుతం నా కస్టడీలోనే వున్నారు మేడమ్! నా అనుమతి లేకుండా చీమ కూడా ఈ గదిలో ప్రవేశించలేదు.




అంచేత నిశ్చింతగా వుండొచ్చు మీరు సరేనా?''

''ఊఁ!'' రిలాక్సింగ్‌గా కళ్లు మూసుకుంది.

నెమ్మదిగా నిద్రలోకి జారిపోయింది.

ఆమెను డిస్టర్బ్ చెయ్యకుండా బయటికొచ్చారిద్దరూ...

''దివీ! ఆవిడ పరిస్థితి అర్థమైందనుకుంటా! అవిణ్ణి మళ్లీ నీవైపు తిప్పుకోడానికి- నువ్వే చాలా కష్టపడాల్సివస్తుంది. మళ్లీ మెలకువవచ్చేసరికి మైండ్ కొంతవరకు ఫ్రెష్‌గా వుండొచ్చులే!''

తలపట్టుక్కూర్చున్నాడు దివ్యరాం.

'ఇంతవరకు వచ్చేక మంజూషని తనవైపు తిప్పుకోవడం మొత్తం ప్రపంచంలో ఇంతకన్న కఠినమైన పరీక్ష మరోటి వుండదు'

★ ★ ★

సిస్టర్ ఇంజెక్షన్ ఇచ్చి సిరెంజ్ పక్కన పెడుతుండగానే అంది మంజూష- ఇటువైపు తిరిగి- ''సాధూగారూ! ఇవాళ నేను నా 'బ్లూహెవెన్'కి వెళ్లిపోతాను''

తుళ్లిపడ్డాడు సాధూ. ''బ్లూహెవెనా? అదేంటి?''

చిన్నగా నవ్వింది మంజూష. ''అదా!? అది నా బెడ్రూమ్‌కి నేను ముద్దుగా పెట్టుకున్న పేరు''

''రేపు వెళ్దురుగాని...''

''వద్దు... ఇవాళే! ఆఁ! అన్నట్టు మీరు నాతో రావాలి! నాకు వంటరితనం మహాభయం''

''అలాగే!'' బయటికొచ్చేడు.

''నాకు వంటరితనం- మహాభయం'' మంజూష మాటలు అతడ్ని ఆలోచింపజేస్తున్నాయి. దివ్యరామ్ సాహచర్యం ఆమెకు నరిపడటంలేదు. ఎలా!? ఏం చెయ్యడం? ఎక్కడో ఏదో అపశృతి- లీలగా కాని, అదేమిటో అర్థం కావడంలేదు.

దిగులుగా వున్న దివ్యరామ్‌ని చూస్తోంటే, మరింత జాలేస్తోంది.

''నువ్వో రెండ్రోజులపాటు ఇంటికెళ్లకు! ఆమె మైండ్ కాస్త సర్దుకొనేదాకా!''

''కాని- చూస్తూ చూస్తూ ఒక్కత్తెనే ఎలా వదలడం?''

ఒక్కక్షణం ఆలోచించాడు సాధూ.

''మన నర్సుల్నెవర్నయినా పంపిద్దాం!''

★ ★ ★

''ప్రేమ గురించి తల్చుకున్నప్పుడల్లా, ఏదో భయంకరమైన వంటరితనం ఆవరించుకుంటుంది దివ్యరామ్''

''శివుడు తాండవం ఎప్పుడు చేశాడో తెలుసా? పార్వతి తనకి కాకుండా పోయినప్పుడు''

''పార్వతి తనకి కాకుండా''

''పార్వతి తనకి...''

ఉలిక్కిపడ్డాడు రామ్. ఏమిటి? ఏమిటి?

అంటే కాదంబినికి తనమీద 'అలాంటి' అభిప్రాయం వుందా? అంటే- ప్రేమ దక్కకుండా పోయినప్పుడు.

కాదంబినీ! ఓహ్! కాదంబినీ.

అతని హృదయం వణికింది. 'నీలాంటి స్త్రీ ప్రేమనందుకొనే అర్హత నాకుందా కాదంబినీ''

చటుక్కున లేచాడు... కాదంబినీ! కాదంబినీ... నువ్వింక బాధపడ్డానికి వీల్లేదు కాదంబినీ! గబగబా బయటికొచ్చేడు. కారు స్టార్ట్ చేశాడు.

అతడు కేవలం లుంగీ-షర్టుమీద వున్నాడు. అప్పుడు రాత్రి రెండవుతోంది.

గేటు తీసుకుని లోపలికొచ్చేడు. తలుపులు వేసివున్నాయి. ఇంటిముందున్న బాల్కనీలో ఆదిలక్ష్మి నిద్రపోతోంది.

''లక్ష్మీ! లక్ష్మీ...'' తట్టిలేపాడు ఆతృతగా.

ఉలిక్కిపడి లేచింది ఆదిలక్ష్మి.

''బాబుగారూ! మీరా!? అమ్మగారు నేరు...''

''ఎక్కడికెళ్లేరు?'' కంఠంలో సన్నగా వణుకు.

''ఊరెళ్లారు...''

''ఏ ఊరు?''

''ఏమో తెలీదు!''

''ఎప్పుడొస్తారు?''




''అదీ తెలీదు''

''వెళ్లేముందేమీ చెప్పలేదా?''

''లేదు...''

'కాదంబినీ' నోట్లోంచి బయటికిరాని, అతని అరుపుకి- భూమ్యాకాశాలు కంపించేయి.

★ ★ ★

''తన ఇంట్లోకి అడుగుపెట్టింది మంజూష.

నెమ్మదిగా... డ్రాయింగ్‌రూం దాటి బెడ్రూమ్ లోకి అడుగుపెట్టింది.

'ఓహ్! బ్లూహెవెన్! ప్లెజెంట్ బ్లూహెవెన్' మెత్తగా- మత్తుగా బెడ్‌మీద వాలింది.

''ఐ లవ్ దిస్ బ్లూ హెవెన్'' నెమ్మదిగా గొణిగింది.

ఎంత హాయిగా వుంది?! ఎంత రిలీఫ్‌గా వుంది.

''హాయిగా వుంది. చాలా థాంక్స్!''

''థాంక్స్ దేనికి?''

మాట్లాడలేదు మంజూష.

''నేనింక వెళ్లనా?'' లేచాడు డాక్టర్ సాధూ.

''అమ్మో! మీరు వెళ్లిపోతే!?''

''మీరు ఒంటరిగా మాత్రం వుండరు. మీరున్నది మీ బ్లూహెవెన్ లో మీ కిష్టమైన వస్తువుల మధ్య వున్నారు. మీ అవసరాలు చూడ్డానికి సిస్టర్ సీమా వుంది''

''మళ్లీ ఎప్పుడొస్తారు మీరు?'' దిగులుగా అడిగింది.

''సాయంత్రం. ఈలోగా మీరు మరింత హుషారుగా తయారవ్వాలి ఓ.కే?''

''ఓ.కే.'' నవ్వుతూ తలూపింది.

సిస్టర్ సీమాతో ఏదో మాట్లాడి వెళ్లిపోయాడు డాక్టర్ సాధూ.

''ఇవాళ ఏం వండమన్నారు?'' సీమ వచ్చి అడిగింది వినయంగా.

ఆశ్చర్యంగా చూసింది మంజూష. ''వంట చెయ్యడానికొచ్చేవా నువ్విక్కడికి? ఏదో నేనొంటరిగా వున్నానని, కంపెనీ ఇవ్వడానికొచ్చావు. యూ ఆర్ సిస్టర్ మై సిస్టర్! నేనే వంట చేస్తాను'' స్థిరంగా అంటూ లేవబోయింది.

''వద్దొద్దు! ఈ సిస్టర్ మాట వినండి! ఇవాళ్టికి నేను. రేపట్నుంచి మీరే వండొచ్చు''

అందేగానీ తీరా లేచి గుమ్మందాకా వస్తే కళ్లముందు మెరుపులు... మసక మసకగా తల తిరుగుతూన్నట్టుగా.

గబుక్కున వచ్చి పట్టుకుంది సీమ.

''అబ్బా! ఎందుకిలా అవుతోంది?''

''జస్ట్- వీక్‌నెస్... నీరసం అంతకంటె ఏంలేదు. అనవసరంగా స్ట్రెయిన్ కాకండి మీరు'' గ్లూకోజ్ కలిపి తెచ్చింది సీమ.

నెమ్మదిగా బెడ్‌మీదకు చేర్చింది.

పళ్లరసాలు- హెల్తీఫుడ్- హెల్తీ అట్మోస్ఫియర్... త్వరలోనే కోలుకుందామె.

★ ★ ★

ఆ ఇంటికి ఫర్లాంగుదూరంలో కారాపి, ప్యాంట్ జేబుల్లో చేతులుంచుకొని, నెమ్మదిగా అడుగువేస్తున్నాడు దివ్యరామ్.

కాదంబిని లేకుండా, ఇన్నిరోజులు... ఓహ్! యుగాల్లా గడిచిన ఫీలింగ్. ఇలా ఇంకెన్ని యుగాలు గడవాలి?

అసలేం జరిగింది.

ఫోన్ చేసినా పెట్టేస్తోంది.

ఏంచేసి ఆమె బాధ పోగొట్టడం?

నెమ్మదిగా చప్పుడు కాకుండా గేటు తెరిచాడు.

నిశ్శబ్దం...

తలుపులు వేసేసి వున్నాయి.

మెత్తటి గడ్డిలో నడుస్తూ- ఆమె బెడ్రూమ్ కిటికీ దగ్గరికెళ్లి నిల్చున్నాడు.

కిటికీ తలుపులు తెరిచివున్నాయి. పల్చటి కిటికీ తెరల్లోంచి- అందమైన ఆమె రూపం- అస్పష్టంగా కనిపిస్తోంది.

తెరలు కొద్దిగా తొలగించి చూశాడు. బెడ్‌లైట్ కాంతిలో ఆమె నిద్రిస్తున్న వీనస్ శిల్పంలా వుంది.

సన్నటి వెలుగు ఆమె ఒంపుల్లోపడి మాయమవుతూ- ఆమె ఆకృతికొక ఔట్‌లైన్ సృష్టిస్తోంది.

రెప్పవాల్చకుండా చూస్తున్నాడామెను దివ్యరామ్.

ఆమె కనుచివరలలోంచి నిశ్శబ్దంగా జారిపోతున్న కన్నీటి చుక్కలు- అవి దివి హృదయంలోపడి ఇంకిపోతున్నాయి.

ఒక్క ఉదుటున లోపలికెళ్లి ఆమెను గట్టిగా హత్తుకొని... "కాదంబినీ... నా కాదంబినీ! నీ ప్రతి కన్నీటిచుక్కలోనూ భాగం పంచుకోడానికి నేనున్నాను కాదంబినీ! నన్ను నమ్ము" అని చెప్పాలి.

కిటికీ తలుపుమీద నాక్ చెయ్యబోయి ఆగిపోయాడు.

దివ్యరామ్- ది గ్రేట్ ఇండస్ట్రియలిస్ట్- దొంగ చూపులకోసం దొడ్డిదారి వెతుక్కునే దీనుడనే ముద్రపడడం మంచిదా?

నో... గబగబా వెనక్కి కారువైపు అడుగువేశాడు.

★ ★ ★

"దివ్యరాం ... ఇంక నువ్వు ఇంటికెళ్లొచ్చు. ఆమె పూర్తిగా నిన్ను ఎవాయిడ్ చెయ్యకుండా..."

"ఎలావుంది ఆమె కండిషన్?"

"ఇంకేం ఫర్వాలేదు. ఇంక ఇద్దరూ గట్టిగా వాదించుకున్నా ఆవిడకేం కాదు. అలాగాక, తనంతటతనే పలకరించినా నువ్వు ఆశ్చర్యపోనక్కర్లేదు"

థాంక్స్ చెప్పి డాక్టర్ సాధూ దగ్గర సెలవు తీసుకున్నాడు దివ్యరాం.

చిరుగంటల శబ్దం.

నెమ్మదిగా లోపలకి అడుగుపెట్టాడు దివి.

బోర్లా పడుకొని, కాళ్లాడిస్తూ ఏదో చదువుతోంది మంజూష.

"మంజూ!"

చివ్వున తలెత్తింది... నెమ్మదిగా చిర్నవ్వు నవ్వింది. చటుక్కున లేచికూర్చుంది.

"ఏమిటిలా అయిపోయావ్?"

"ఈమధ్య కాస్త వొంట్లో బావులేదు. ఇప్పుడు ఓ.కే. ఆc! మీరెళ్లి ఎన్నాళ్లవుతోంది? ఓ వారం రోజులు?"

"ఊc" ఆమెనే చూస్తున్నాడు దివ్యరాం.

"మీరు స్నానంచేసి రండి. ఈలోగా నేను వంటచేసేస్తాను" మంచందిగి, వంటింటివైపు వెళ్తూ అంది.

'ఫర్వాలేదు. చాలా నయం' తృప్తిగా బాత్రూంలోకి అడుగుపెట్టేడు.

'బ్లూ నైటీలో దేవతలా... మీరు...' జ్ఞాపకాల తెరల్లో బాధగా కళ్ళు మూసుకుంది మంజూష.

★ ★ ★

బాల్కనీలో కూర్చొని 'లోన్లీ లేడీ' చదువుతోంది మంజూష.

'ఓన్లీ! ఎ వుమెన్ కెన్ అండర్‌స్టాండ్ వాట్ లోన్లీనెస్ ఈజ్...' పుస్తకం మడిచి, కుర్చీలో వెనక్కివాలి ఎదురుగా పైకి చూసింది మంజూష.

వరసగా వేసిన మొక్కలమధ్య బిక్కుబిక్కుమంటూ ఒకే ఒక గులాబీ.

"అలా అర్ధరాత్రిదాకా ఆరుబయట కూర్చుంటే... మంచు పడుతుంది. మళ్ళీ... ఆరోగ్యం పాడవుతుంది!" లోపల్నుంచే దివి హెచ్చరింపు.

అప్రయత్నంగా కదిలి, లోపలికొచ్చి బెడ్ మీద వెల్లికిలా వాలుతూ, ఎదురుగోడను చూసింది. మంచుకొండలు...

మత్తుగా కళ్ళు మూసుకుంది మంజూష.

క్రమంగా ఒక కలగా మంచుకంటె చల్లనైన హాయి.

పక్కకి చూసింది... దివ్యరాం.

ఎవరీ దివ్యరాం? ఇలా తన మంచాన్నే కాకుండా తన జీవితాన్ని కూడా పంచుకొనే అధికారం అతనికెలా వచ్చింది? ఎక్కడెక్కడో వేరే వేరే పరుధుల్లో వుండే తమని ఇలా దగ్గరికి చేర్చిన ఆ శక్తి ఏమిటి?

పెళ్ళి...

ఈ రెండక్షరాలకి అంత శక్తి వుందా?

నాన్సెన్స్! శక్తి వుండడమేమిటి? తాము కల్పించిందే ఆ శక్తి... తామిచ్చిందేగా ఆ శక్తి.

ఎవర్ని కలిపిందిది?

తమ శరీరాలనా? తమ మనసులనా? తమ ఆత్మలనా?

దివీ...! ఇన్నాళ్ళూ నీతో ఎలా కలిసివున్నాను?

నెమ్మదిగా లేచింది మంజూష.

★ ★ ★

గబగబా తన ఛాంబర్‌లోకి నడిచి, ఫోన్ అందుకున్నాడు దివ్యరాం. నెంబర్ డయల్ చేసి, ఆత్రంగా చెవులు రిక్కించాడు.

ఫోన్ రింగ్ అవుతోంది. ఎవ్వరూ ఎత్తడంలేదు.

కట్‌చేసి, మళ్ళీ డయల్‌చేశాడు.

హు!... ఎంత చేసినా, ఎన్నిసార్లు చేసినా అంతే!

నిరాశగా రిసీవర్ క్రెడిల్‌మీద పెట్టేశాడు.

★ ★ ★

సముద్రంమీంచి వస్తూన్న చల్లటి గాలి... కిటికీలోంచి వచ్చి దివ్యరాం ముఖాన్ని తాకింది.

ఎంత చల్లగా... ఎంత మెత్తగా... ఎంత మత్తుగా... కాదంబిని వంటిమీదనించి వచ్చే చందన సుగంధ పరిమళంలా.

ఓహ్! కాదంబినీ! మానస సరోవరంలో కలహంసలా, తన జీవితంలోకి ఎలా ప్రవేశించింది!

కాదంబినీ! ఈ అభాగ్యుణ్ణి వదిలేసి ఎక్కడికి పోయావు కాదంబినీ!

ఈ ఎడారిలో ఈ అంధకారలో దిక్కుతోచక తిరుగుతూన్న నీ దివ్యరామ్‌ని ఎలా... ఎందుకలా... శిక్షిస్తున్నావు కాదంబినీ!

★ ★ ★

''హలో! దివ్యరాం! మంజూష ఆరోగ్యం బాగుందా?'' కర్టెసీకోసం పలకరింపు కాదది. కరెక్ట్‌గా, ఠంచన్‌గా, కావాల్సినవాళ్ళ పలకరింపుకంటే ఎంతో ఎంతో అనురాగపూరితమైన ఆరా సాధూది.

అవతలివైపునుంచి మౌనం క్షణం.

''కొందరి విషయంలో కొంత కేర్ అవసరం దివీ! నిజానికసలు వాళ్ళకేం కావాలో వాళ్ళకే తెలీదు. అంతకంటే ఏం చెప్పడం?''

''అలా అనకు సాధూ! ఒక్కోరోజు నన్ను చూడందే, నాతో మాట్లాడందే వుండలేదు. కాని... ఈమధ్యే... ఈమధ్యే ఆ అనునయం దగ్గరకి చేరినా కరువైపోయింది. పెక్యూలియర్ మెంటాలిటి అని నాకే అన్పిస్తోందంటే...''

దివ్యరాం మాటలు కట్‌చేస్తూ

''నో... నో...! నేనలా అనుకోవడంలేదు. ఆమె మనసుని మనం ప్రెషరైజ్ చేసి విషయం రాబట్టడం సరైన మెథడ్ కాదు. ఆమె ఎక్స్‌పీరియన్స్‌కి ఆమెనొదిలెయ్యాలి. ఎప్పటికో అప్పటికి తానే గుర్తిస్తుంది. ఆరోజు తొందర్లోనే రావాలని మనఃపూర్తిగా కోరుకుంటున్నాను... గుడ్ లక్!''

సాధూ ఫోన్ పెట్టేశాడు.

అంతలోనే ఫోన్ మోగింది మళ్ళీ...

బిజినెస్ కాల్ అయివుంటుంది!

బ్లడీ బిజినెస్! దేనికి? ఎందుకు? ఎవరికోసం ఇదంతా...? ఏం చేసుకోడానికి? ఎక్కడికి పట్టుకుపోవడానికి?

అరె! నాన్‌స్టాప్‌గా మోగుతోందే!

అయినా, నెమ్మదిగానే అందుకున్నాడు ''హల్లో!''

అంతే! అవతలి కంఠం విని 'హుర్రే' అని గట్టిగా అరవాలనిపించింది.

ఫోన్ అవతలి అంచున కాదంబిని కలస్వనం... మధురంగా మీటుతున్న కంఠంలోంచి ''దివీ!'' అనే దివ్యమైన పిలుపు.

★ ★ ★

మంచంమీద వెల్లకిలా పడుకొని 'నెవర్ లీవ్ మి' చదువుతోంది మంజూష. ఒక్కొక్క వాక్యం చదువుతూంటే అబ్బా! ఎంత స్ట్రెయిన్ అవుతోంది! ఎందుకిలా? ఎంత డామినేట్ చేస్తోందీ తలనొప్పి! మందుల్తో పోయే వేదనా ఇది?

అశాంతిగా పక్కకి దొర్లింది.

సంపత్! మై హార్ట్! ఈతరాని నన్నీ నడిసముద్రంలో వదిలి ఎక్కడికి పోయావు డియర్!

సంపత్!... సంపత్! నాకు తెలుసు! నువ్వు రావు! నీకోసం ఎదురుచూసి - చూసి నా రక్తం ఆవిరైపోవలసిందే! నాకీ శిక్ష పడి తీరవలసిందే!

అల్లరిగా శబ్దం చేసిన చిరుగంటలు...

మెలోడియస్‌గా మళ్ళీ...



తాను చూస్తున్నది కలా? నిజమా?

ఈ సంపత్ తన కలల్లోంచి ఎలా నడిచొచ్చే శాడు వాస్తవంలోకి?

వాటేసుకోపోతే వాస్తవం మళ్ళీ స్వప్నంగా మారిపోతుందేమో!

ఎగిరి లేచింది మంజూష.

"సంపత్! నా హార్ట్! ఇన్నాళ్ళూ ఏమైపోయా వోయ్! నీ గురించి ఎంత పిచ్చిగా ఎదురుచూ స్తున్నానో తెల్సా?" ఆత్రంగా అంది.

నెమ్మదిగా చెయ్యి ముందుకి జాపాడు.

అతని చెయ్యందుకుని లేచింది.

"ఏమిటీ అవతారం?"

నీరసంగా నవ్వింది - "ఈమధ్య కొంచెం ఒంట్లో బాగులేదులే! ఇంతకీ ఎక్కడ మాయ మయిపోయావిన్నాళ్ళూ?"

"అనుకోకుండా రెస్క్యూ ఆపరేషన్ పడింది. ఈమధ్య అస్సాంలో వరదలు కదూ!"

కొద్దిపాటి మౌనం... కొంచెం బుంగమూతి పెట్టి అంది "కనీసం ఉత్తరమైనా రాయొ చ్చుగా?"

"ఉత్తరాలు రాసే అలవాటు లేదు"

"సంపత్! ఇంకెప్పుడూ నాకు చెప్పకుండా, ఇలా వెళ్ళిపోకు సంపత్!"

లోపలికెళ్తూ అంది "ఇప్పుడే వస్తాను! కూచో!"

* * *

"మీతోనేకాదు! అసలెవ్వరితోనూ చెప్పకుండా, ఎవ్వరికీ తెలీని ప్రదేశానికి వెళ్ళిపోవాలనుకు న్నాను" కుర్చీలోంచి కొద్దిగా ముందుకి వంగి అంది కాదంబిని.

నగరం అంచుల్లోకి జారిపోతూన్న సూర్య కాంతిలో ఆమె చెంపలు బంగారంలా మెరు స్తున్నాయ్. ఆమె కళ్ళల్లోనూ అదే మెరుపు.

"అర్థరాత్రి అపరాత్రి అనిసైతం ఆలో చించకుండా ఎలావున్నవాడిని అలాగే కారేసు కుని నీ ఇంటికొచ్చేసేవాణ్ణి! ఇంటికున్న తా ళంకప్ప వేళాకోళం చేస్తూ వెక్కిరించేది. ఎవ్వ రూ నీగురించి సరైన ఇన్ఫర్మేషన్ చెప్పలేక పోయారు"

మౌనం కాదంబినిది.

"ఇంత అశాంతి, ఇంత నిరాశ ఎప్పుడూ అనుభవించలేదు కాదంబినీ! ప్రతిపూట మర్చిపోకుండా ఫోన్ చేసేవాణ్ణి! కాని ఎవ రందుకుంటారా ఫోన్ని?"

సముద్రంమీంచి వస్తున్న చల్లటి గాలి ఆమె ముంగురుల్ని చెదరగొడుతోంది.

"ఈ చల్లటి గాలి నా హృదయాన్ని మరింత మండించేది. ఈ కెరటాల హెూరు మరింత అశాంతిని రేపేది"

కళ్ళు దించుకొంది కాదంబిని.

"కాదంబినీ! నీ పరిచయంతో నిజంగా నాకు జీవితంలో కావలసిందేమిటో తెలి సింది..." ఆవేశంగా అన్నాడు.

"దివీ!" బాధగా అంది కాదంబిని. రెండు కనుకొలకుల్లోనూ రెండు కన్నీటి ముత్యాలు.

"కాదంబినీ!" కంగారుగా అన్నాడు దివి, "సారీ! కాదంబినీ! నిన్ను చాలా బాధపెట్టా ను"

"ఇంతకీ ఎక్కడికెళ్ళేవు? విశేషాలేంటి?"

"భువనేశ్వర్, కోణార్క్ వెళ్ళాను"

"ఒక్కదానివే!"

అవునన్నట్టు తలూపింది దూరంగా కెరటా లతో ఆడుకుంటూన్న పిల్లల్ని చూస్తూ.

"ఇంతకీ విశేషాలేంటి?"

"కోణార్క్ అంతా నాట్యసుందరీమణుల శిల్పాలే!" అతని కళ్ళల్లోకి చూస్తూ అంది 'ఎప్పుడూ చూడలేదా ఆ శిల్పాల్ని?"

"ఊహూ! చూసినా ఏమీ పెద్దగా గుర్తులే దు. ఇంతకీ నీ వ్యూ ఎలాంటిది?"

మాట్లాడలేదు కాదంబిని. వేలికున్న సన్నటి ఉంగరాన్ని అటూ ఇటూ తిప్పుతోంది.

ఆత్రంగా ముందుకి వంగేడు దివి.

"మొత్తంమీద ఇన్నాళ్ళలోనూ నాకు బాగా తెలిసొచ్చిన విషయం ఒకటే!"

"ఏమిటి?"

"నా నోటితో చెప్పాలా దివీ! నా గుండెనడుగు"

"అంతే!?"

"అంతే ఏమిటో రాత్రంతా ఆలోచించు!




★ ★ ★

"ఓహ్! బ్యూటిఫుల్!" అంది చుట్టూ వున్న వాతావరణం చూస్తూ మంజూష.

"వండ్రఫుల్!" అన్నాడు సంపత్ స్విమ్మింగ్ డ్రెస్‌లో వున్న మంజూషని కిందినుంచి పైకి చూస్తూ.

ఆడవాళ్ళూ, మగాళ్ళూ, పిల్లలూ, ఎంతో ఉత్సాహంగా చేస్తున్నారు స్విమ్మింగ్. కొందరు అలసటగా వచ్చి, ఇసుకలో కూర్చొని, ఉండబట్టలేక మళ్ళీ లోపలికెళ్తున్నారు.

"కమాన్!" ఆమె చెయ్యి పట్టుకొని, కెరటాలవైపు నడిపించసాగాడు మిస్టర్ సంపత్‌కుమార్.

"నో సంపత్! ఐ కాంట్!" చటుక్కున ఆగిపోయింది.

"అదేం? స్విమ్మింగ్ నేర్చుకుంటానని వచ్చి, నీళ్ళని చూసి భయపడితే ఎలా?"

"నీళ్ళు కాదు అలలు..." పెద్దగా విరిగిన ఓ కెరటాన్ని చూసి, రెండడుగులు వెనక్కి వేసింది.

"యూ ఆర్ లుకింగ్ డామ్ స్మార్ట్ యార్!" ముందుకొస్తూ అన్నాడు.

మంజూష నవ్వుతూ మరో రెండడుగులు వెనక్కి వేసింది.

"ఒడ్డున నించుని, స్విమ్ చేస్తున్నవాళ్ళని చూడ్డంలోలేదు థ్రిల్! నీళ్ళలోకి దిగితే, అప్పుడు... అసలైన ఆనందం!" ఆమె చెయ్యి పట్టుకుని గభాల్న ముందుకి లాగాడు.

కెవ్వుమంటూ అతనిమీద పడింది.

గట్టిగా అతని చెయ్యి పట్టుకుంది మంజూష.

"సీ బేబీ!... ఇక్కడినించి మొదలవుతుంది కెరటాలనెదుర్కోవడం" ఆమె వైపు తిరిగేడు.

మంజూష కూడా అతనివైపు తిరిగింది.

పక్కకి తిరగ్గానే పెద్దకెరటం కొట్టుకొస్తోంది. గట్టిగా కళ్ళు మూసుకుంది మంజూష.

"అంత భయమైతే ఎలా డియర్?"

కళ్ళు తెరిచింది.

ఒక్కొక్క అంగుళం ముందుకి కదుల్తున్నారు. "ముందీ కెరటాల నెదుర్కోవడం సముద్రంలో స్విమ్మింగ్ నేర్చుకోడంలోని మొదటి భాగం... కెరటాలకు ఎదురు వెళ్ళడంలో కొద్దిగా నేర్పు ఉపయోగిస్తే చాలు! ఎంతో థ్రిల్ వుంది అందులో.

"హాయ్ సంపత్!" కెరటంతోపాటు ఒకమ్మాయి కొట్టుకొచ్చింది.

సంపత్ తల పక్కకి తిప్పి చూసేలోగా, అతని భుజాన్ని తట్టి కెరటంతోపాటు ముందుకెళ్ళిపోయింది. కెరటాలతోపాటు పైకీ కిందికీ లేస్తూ మత్స్యకన్యలా.

"కమాన్ బీ బోల్డ్! అటు చూడు! చిన్నచిన్న పిల్లలే ఎలా చేస్తున్నారో!?"

మళ్ళీ కెరటం.

మరో కెరటం... అదీ వెళ్ళిపోయింది.

"సో థ్రిల్లింగ్ సంపత్!" అతనివైపు తిరిగి అంది.

వెనకనే కెరటం... చటుక్కున ఆమెను పైకెత్తాడు. "బీ అలర్ట్"

"అబ్బా! ఏమిటీ కెరటాలు? కాస్సేపాగకూడదూ!" చిరాగ్గా అంది.

మరో కెరటాన్నెదుర్కొంటూ, నవ్వేడు సంపత్ "టైమ్ అండ్ టైడ్ వెయిట్ ఫర్ నో మేన్" అంటూ.

"అలాగా!"

"నీకు తెలుసని తెలుసులే! కొన్ని వందేసార్లు చదివే వుంటావు ఆ వాక్యాన్ని! కాని ప్రాక్టికల్‌గా ఒక్కసారైనా ఎదుర్కొన్నావా?"

"మంజూ! ఈజిట్ నాటె నైస్ ఎక్స్‌పీరియన్స్?"

"ఊ!" చిన్నగా మూలిగింది. కళ్ళు తెరిచింది... అతని భుజాలమీద చేతులేసి.

పాదాలను తడుపుతున్న కెరటాలు...

అతని చేతిలో ఉన్న మెత్తటి చెయ్యి తియ్యగా నలిగింది.

★ ★ ★

బిజీగా వున్న రోడ్డుమీద నడుస్తున్నారు మంజూ, సంపత్‌లు.

'సాండ్ ఎన్ సాండ్' స్టీరియోలోంచి 'లంబాడా' మ్యూజిక్ వినిపిస్తోంది.

"ఆడియో ఏమైనా మార్కెట్ చేద్దామా?"

"నా దగ్గర బోల్డంత కలెక్షన్ వుంది"

అలా నడుచుకుంటూ, నడుచుకుంటూ...

'బాంబే డైయింగ్ 'షోరూంలోకి అడుగుపెట్టేరిద్దరూ.

"శారీస్ చూపించండి" అంటూనే చాక్‌లెట్ కలర్ మీద లేత పసుపు పూలబోర్డర్ చీరతీసి "ఇదెలావుంది" అన్నాడు.

"ఇంతకీ ఎవరికీ?" అంది.

"నీకు మాత్రం కాదు"

నవ్వాపి కోపంగా చూసింది.

"చీరల్లేక తపించిపోవడం లేదు నేను!"

"ఆ గ్రీన్ షిఫాన్ చూపించండి!"

పరిచితమైన గొంతుతో పక్కకి తిరిగింది మంజూష.

"అరె!... కాదంబిని!"

"హల్లో!... బావున్నారా?" పలకరింపు మంజూషది.

"మళ్ళీ కనబడలేదేం?" అప్పటికీ ఇప్పటికీ మార్పు గమనిస్తూ అడిగింది కాదంబిని.

నవ్వేసి... "ఆఁ!... హి ఈజ్ మై ఫ్రెండ్ సంపత్. ఈవిడ కాదంబిని. పేరు వినే వుంటావు" పరిచయం చేసింది మంజూష.

నమస్కారం చేశాడు సంపత్.



"సాధూ!... నువ్వెప్పుడైనా కోణార్క్ వెళ్లేవా?"

దివ్యరామ్ ప్రశ్న.

"ఏమిటి! సడన్‌గా కోణార్క్‌మీదికి పోయింది మనసు?"

"ముందు చెప్పు!"

"లేదు!"

"పోనీ! అక్కడ ఎలాంటి శిల్పాలకు ఫేమస్...? అదేమైనా ఐడియా వుందా?"

"ఎలాంటి శిల్పాలు అంటే?!"

"అంటే... అంటే... ఎలా చెప్పాలో తెలీదు" తనలో తను అనుకుంటున్నట్టుగా అన్నాడు.

"నే చెప్పనా? రకరకాల పేసినేట్ పోజుల్లో వున్న లవర్స్ వి... చాలా అందంగా చెక్కారట!"

దివ్యరాం కళ్ళు మెరిశాయ్.

'ఓహ్! కాదంబినీ!... ఐ కాట్ యూ! నీ మనస్సు దొరికిపోయింది!'

"ఓ పదిరోజులు అలా నేనూ ఓ ట్రిప్ వేద్దామని చాలా కాలంగా అనుకుంటున్నాను ఎక్కడికయినా... ఏదీ?"

డాక్టర్ సాధూ చెప్పడం ఆపి, పక్కకి చూసే సరికి దివ్యరాం అక్కడ లేడు.

★ ★ ★

కాదంబిని మొహంలోకి తదేకంగా చూస్తున్నాడు దివ్యరాం. ఆమె కాన్సంట్రేటింగ్‌గా వాయిస్తోంది సితార్. ఇద్దరూ ఆమె బెడ్రూమ్‌కి ఆనుకుని వున్న బాల్కనీలో తివాసీమీద కూర్చున్నారు.

సున్నితమైన ఆమె చేతివేళ్లు ఫాస్ట్‌గా కదుల్తున్నాయి... కిందికీ మీదికీ సితార్ తీగల మీద... సంగీతం అతని హృదయంలోకి దూసుకుపోయి. నిద్రపోతున్న మనోతంత్రుల్ని తట్టి లేపుతోంది .

చెయ్యిపట్టుకుని "కాదంబినీ!" వాలుగా వంగి, ప్రేమగా ఆమె కళ్ళల్లోకి చూస్తున్నాడు.

"ఆఁ!... ఉండండి! ఫొటోలు వచ్చేయి తెస్తాను!" మెల్లగా అతని చెయ్యి విడిపించుకొని, లేచి గబగబా బెడ్రూంలోకి వెళ్లింది.

పొడవాటి పూసల కర్టెన్ కదిలింది.

పెద్ద కవరుతో వచ్చింది కాదంబిని.

ఒక్కొక్కటే చూస్తున్నాడు దివ్యరాం. అన్నీ కలర్ ఫొటోలే! నాట్యమందిరం, నాట్యభంగిమ






లు, సూర్యరథం. అన్నీ లాంగ్‌షాట్లు. కొన్ని క్లోజప్స్ వున్నా అంత బాగా లేవు. డెప్తూ క్లారిటీ రెండూ లోపించాయి.

శిల్పాల్లో ఓ శిల్పంలా కలిసిపోయిన కాదంబిని కొన్ని మిడ్‌లాంగ్ షాట్స్‌లో...

"కాదంబినీ!" ఆర్ద్రంగా అన్నాడు.

ఆమె లేచి నించుని అతనికి చెయ్యందించింది. ఇద్దరూ డైనింగ్ టేబుల్‌వైపు నడిచారు.

★ ★ ★

ఊరికి కాస్త దూరంలో ప్రశాంత వాతావరణంలో కొంచెం పాతబడినట్టుగా... ఆర్టిస్టిక్‌గా... మేజస్టిగ్గా కనబడుతున్న భవనం ముందా గింది ఎన్‌పీల్డ్. ఎదురుగా కొంత దూరంలో సముద్రం.

నల్లగా ఆర్టిస్టిక్‌గా వున్న పెద్ద గ్రిల్ గేట్... విశాలమైన ఆవరణ చుట్టూ కాంపౌండ్ వాల్. అంచున చుట్టూ పొడవైన అశోక వృక్షాలు.

ఒకవైపు పోర్టికో... ఆ వెనక ఔట్ హవుస్.

గేటు తెరుచుకుంది.

ఇద్దరూ లోనికి అడుగుపెట్టారు.

విశాలమైన వరండాదాటి హాలులోకి. చాలా పెద్ద హాలు అది... నగంవరకు పరచిన తివాచీ మెత్తగా పాదాల్ని స్పృశిస్తోంది. అందంగా నగిషీలు చెక్కిన పాతకాలం నాటి సోఫాలు... అందమైన షాండిలియర్స్... హాల్లోంచి మేడ మీదికి మెట్లు... మీదా, కిందా, చుట్టూ లెక్కలేనన్ని గదులు.

హాల్లో అందంగా నగిషీలు చెక్కిన ఇత్తడి ఫ్రేముల్లో... రకరకాల పెయింటింగ్స్, రవివర్మ చిత్రాలు ఇంకా ఎవరెవరివో లైఫ్ సైజ్ చిత్రాలు, తైలవర్ణాల మేళవింపు... గోల్డెన్ ఓల్డ్ వస్తువులు... ఏంటిక్స్... అక్కడక్కడ పూల కుండీలు.

"ఎలా ఉంది ఇల్లు?"

"ఏదో సిన్మా చూస్తున్నట్టుంది! చిన్నచిన్న ఇళ్ళలో వుండడం అలవాటయిపోయి ఇంత పెద్ద ఇంట్లో తిరుగుతోంటే... ఏదో గాభరాగా వుంది!..." నవ్వుతూ అంది "బైదవే... ఆ చిత్రపటాలెవరివి?"

''మా తాతగారు...''

మెత్తటి సోఫాలో కూర్చున్నారు.

''జమీందార్ల ఫామ్లీయా?''

''లాంటిదే!... మా గ్రాండ్ ఫాదర్ ఫ్రీడం ఫైటర్''

ఉలికిపాటు... ఆశ్చర్యం... ఆనందం... ఒక్కుమ్మడిగా ''నిజమా?''

''అవును!... ఆ పక్కన ఆయన భార్య!''

''భార్య?''

ఆశ్చర్యంగా చూస్తోంది మంజూష.

నవ్వేశాడు సంపత్. ''పద!... ఇంకా మిగతా గదులు చూద్దువుగాని రా! ఇంత ఇల్లుందన్న మాటేగాని, అంతా నేను వాడను...''

మేడమీదకెళ్ళేరిద్దరూ...

ఎదురెదురుగా రెండు పెద్దపెద్ద గదులు... కుడివైపున్న గదిలోకి అడుగుపెట్టేరు ''ఇంత పెద్ద సామ్రాజ్యంలో ఇదీ నా సామంత రాజ్యం!''

చిర్నవ్వు తొణికిసలాడింది మంజూష అధరాలమీద.

పాలరాతినేల ... మెత్తని తివాసీ... విశాలమైన బెడ్... మంచానికటూ ఇటూ చెక్కిన అందమైన మెటల్ డిజైన్స్ గోడలకి ఫిక్స్ చేసిన రోజ్‌వుడ్ అల్మారాలు... ఒక పక్క గోడకి వేలాడుతున్న రైఫిల్.

''సంపత్! నాకు రైఫిల్ షూటింగ్ నేర్పవూ?'' గబుక్కున అంది.

స్టీరియోలో 'బోనీ- ఎమ్' మ్యూజిక్. సంపత్ అల్మైరాలోంచి ఆల్బమ్స్ తీశాడు.

ఆమె పక్కనే బెడ్‌మీద కూర్చున్నాడు సంపత్.

ఆమె చేతిలో ఆల్బమ్...

మొదటి పేజీలో సంపత్ ఆర్మీడ్రెస్‌లో.. తదేకంగా చూస్తూన్న మంజూష వంక తిరిగి ''నెపోలియన్‌లా వున్నాను కదూ ఇక్కడ?'' అడిగాడు.

''కాదు! నువ్వు ఎప్పటికీ కెప్టెన్ సంపత్‌కు మార్‌వే! నువ్వు ఆర్మీలో లేకుండా వుంటే, కెప్టెన్‌వి కాకపోయివుంటే కూడా సంపత్‌కు మార్‌వే! అంటే! లక్ష్మీ పుత్రుడివి అన్నమాట! సంపత్ అనే పేరు నీకు సరిగ్గా సరిపోయింది...'' తన స్థిరాభిప్రాయం చెప్పింది మంజూష. పేజీలు తిప్పసాగింది మళ్ళీ.

ఆర్మీ డ్రెస్‌లో, స్పోర్ట్స్ డ్రెస్‌లో, రైఫిల్ షూటింగ్, మౌంటెనీరింగ్, స్కేటింగ్, స్కీయింగ్, పార్టీలు, డాన్సులు, తదితర సందర్భాల్లో... రకరకాల అమ్మాయిలు.

''ఇది నవనీత! పార్టీల్లో నన్ను చాలా ఇబ్బంది పెడుతూండేది''

''ఇది యామిని! నా మ్యూజిక్ అన్నా నేనన్నా పడి చచ్చేది!''

''అమ్మాయిల్ని... అలా అదీ... ఇదీ... అనకూడదు''

''వాళ్ళు నాకు బాగా క్లోజ్!''

''అయినా సరే!... ఏదో చీప్‌గా వుంటుంది అలా అంటుంటే!''

పేజీలు మారిపోతున్నాయి.

''షి ఈజ్ మాధురి... షి ఈజ్ మై బెడ్ మేట్, లైఫ్‌మేట్''

చురుగ్గా చూసింది... రకరకాల పోజుల్లో మాధురి ఫోటోలు.

''నేను సిక్కిమ్‌లో పోస్ట్‌లో వుండగా పరిచయమైంది. ఇక్కడివాళ్ళే, ఎప్పుడో తాతల్నాడే సెటిలయ్యారులే! ఎనీ హౌ... చాలా ఫ్రీగా వుండేది. అందంగా, అమాయకంగా, దానిమ్మ మొగ్గలా, లిల్లీపువ్వులా. సిక్కిం కాలేజ్‌లో చదువుతూండేది''

అందంగా నవ్వుతూ మాధురి.

తదేకంగా ఓ ఫొటోకేసి చూడసాగింది మంజూష.

''ఆ నవ్వే... ఆ నవ్వే... నన్ను పిచ్చివాణ్ణి చేసింది. 'మొనాలిసాస్మైల్' అంటారు. ఆ నవ్వులో ఏముందో నాకర్థం కాలేదు. కాని మాధురి స్మైల్లో అందాన్ని బంధించిన ఆ ఫొటో చూడు! నిజంగా ఏ ఆర్టిస్టూ చిత్రించలేడు''

''ఆర్టిస్టిక్‌గా వుంది కాబట్టే కదూ నేనిక్కడ ఆగిపోయింది''

''నాకు అమ్మాయిలంటే, ప్రత్యేకమైన క్రేజ్ లేదు. నిజం చెప్పాలంటే అసలా అవసరం





వుండేది కాదు! ఎంతోమంది అమ్మాయిలు... పార్టీల్లోనూ, పిక్నిక్స్‌లోనూ, బూజ్‌లోనూ వున్న ప్పుడు ఎంతో రెచ్చగొట్టేవారు. నన్ను నేను కంట్రోల్ చేసుకోవడం పెద్ద పరీక్షలా అయిపో యేది. కాని మాధురి అలా వుండేది కాదు! అందమైన నవ్వుతో అమాయకమైన మాటల్తో నా మతి పోగొట్టేది''

''ఓ రోజు ఓ చిన్న విషయానికే వాళ్ళింట్లో వాళ్ళమ్మగారితో వచ్చిన బేధాభిప్రాయానికే ఎంత సెన్సిటివ్‌గా ఫీలయిందంటే... ఆ రాత్రి ఆత్మహత్యకి కూడా ప్రయత్నించింది. అర్థరా త్రి... పాపం! అంత పెద్దావిడ పరుగెత్తు కుంటూ మాధురి అఘాయిత్య ప్రయత్నం చెప్పేసరికి''

మాట కట్‌చేస్తూ ఉక్రోషంగా అంది ''ఇంకేం! ఈ కెప్టెన్‌గారు నెక్స్ట్ మూమెంట్లో మాధుర్ని ఆ ప్రయత్నం నుంచి రక్షించారు కదూ!''

''అప్పట్నుంచీ- ఆమె నా బెడ్‌మేట్ అయింది. నా ప్రాణంలో ప్రాణంగా కలిసిపో యింది. గుండెచప్పుడు మధురంగా 'మాధు రి'తో స్పందించేది. ఓ స్నేహితురాలిగా ప్రియురాలిగా నా జీవితాన్ని అల్లుకుపో యింది''

ఆమె మధురస్మృతుల నీడలు- నల్లగా, బరువుగా అతని వదనంలో.

''అదో తియ్యనికల- ఆమెతో గడిపిన ప్రతీ క్షణం జీవితంలో మర్చిపోలేను''

''ఇప్పుడెక్కడుంది మరి!?''

''తరువాత నాకు పంజాబ్ పోస్టింగ్ వచ్చింది. క్వార్టర్ కోసం ప్రయత్నించేదాకా తప్పనిసరిగా ఆమెని వదిలివెళ్ళాల్సివచ్చింది. కన్నీళ్లతో వీడ్కోలిచ్చింది మాధురి. అదే ఆఖరి చూపని తెలిస్తే''

''ఏమైంది?'' ఆతృతగా అడిగింది మంజూష.

''నా బాబుని కనలేకకని- నా బాబుతోసహా... అదుగో... ఆ పైలోకాల్లో ఎదురుచూస్తోంది'' గాద్గదికమైన గొంతులో దుఃఖాన్ని దిగమింగ డానికి ముఖం పైకెత్తాడు సంపత్.

''సం...ప...త్' సముద్రంలా ఆత్మీయంగా ఘోషిస్తోంది మంజూ హృదయం.

కిటికీ దగ్గరకు వెళ్లి నిలబడ్డాడు సంపత్. ఉండుండి మెరుస్తున్న లైట్‌హౌస్ కాంతిలో అతని ముఖంమీద స్వేదబిందువులు.

జాలితో- ప్రేమతో నిండిపోయిందామె హృ దయం.

తనే తేరుకుని, మంజూష దగ్గరికొచ్చి అడి గేడు ''ఏమిటాలోచిస్తున్నావు?''

మౌనం... అదీ ఆర్ద్రతతో కూడిన నిశ్శబ్దం.

''ఎన్ని అనుకోని ఘటనలు ఎదురైనా లైఫ్ ఎక్కడా ఆగదు మంజూ!''

బీరువా తెరిచి- ఒక పాకెట్ ఆమె ముందుంచాడు.

''ఏమిటిది?''

''మొదటిసారిగా- నా ఇంటికొచ్చేవు... నా ఆనందంకోసం...''

విప్పింది ప్యాకెట్.

చాక్లెట్ కలర్ చీరమీద లేతపసుపు పూలు న్న బోర్డర్... ''ఓహ్ సంపత్!'' గట్టిగా హత్తు కుందా చీరని.

ఆల్బమ్‌లన్నీ లోపలపెట్టేడు. దగ్గరగా వెళ్లి నిల్చుంది- మంజూష. సముద్రంమీద పరుచు కుంటున్న వెన్నెల్ని చూస్తోంది.

''కిందికి వెళ్దాంరా''

ఇద్దరూ కిందికి దిగేరు.

★ ★ ★

సాయంత్రం ఏడుగంటలు దాటింది. కాలింగ్ బెల్ నొక్కి, లోపలికెళ్లేడు దివ్యరాం.

పొడవైన పూసలకర్టెన్‌లోంచి కనిపిస్తోంది కాదంబిని.

పరుగులాంటి నడకతో ఎదురొచ్చింది కా దంబిని.

దివ్యరామ్ ఏదో చెప్పేంతలో ''దివీ! నీకో గుడ్‌న్యూస్! అబ్బా... ఈ విషయం నీతో చెప్పా లని ఎంత అసహనంగా వెయిట్ చేస్తు న్నానో...''

''ఏమిటి?'' అక్కడే వున్న కుర్చీలో కూర్చుంటూ అడిగాడు.

''నేషనల్ నెట్‌వర్క్‌లో- నా ఇంటర్వ్యూ ప్లస్ డాన్స్‌ప్రోగ్రాం కాల్ వచ్చింది. రేపే ఢిల్లీ

ప్రయాణం''

ఆశ్చర్యంతో దివ్యరామ్‌కి నోట మాటరాలేదు.

''ఓహ్... దివీ... దివీ నీ కర్థం కావడంలేదు. అప్పుడు ప్రపంచమంతా తిరిగినా- అది ఒంటరిగానే రామ్! కాని ఇప్పుడిక ఆ ఒంటరితనం భరించలేను. అది మొన్న కోణార్క్ వెళ్లినప్పుడే ప్రూవయింది'' అతని కళ్లలోకి చూస్తూ అంది.

మాట్లాడలేదు దివ్యరాం.

''కాదంబినీ!'' రామ్ హృదయం ఉరకలు వేస్తోంది. గబుక్కున ఆమెని అలాగే ముందుకి లాగి, మెడచుట్టూ చేతులేసి' అన్నాడు ''అయితే నన్నూ తీసికెళ్తున్నావన్నమాట నీతో''

మెత్తగా విడిపించుకుంటూ అంది- ''ఇలా అల్లరిచేస్తే అసలు ఎక్కడికీ తీసికెళ్లనంతే!'' నవ్వుతూ లోపలికి వెళ్లింది. పాదమంజీరాలు ఆహ్లాదంగా చేసిన శబ్దం.

కుర్చీలో రిలాక్సింగ్‌గా వెనక్కివాలేడు దివ్యరాం. అతని హృదయం అలలమీద పడవలా ఉయ్యాలలూగుతోంది.

★ ★ ★

''సాధూ! నేను ఢిల్లీ వెళ్తున్నాను. బహుశా ఓ పదిరోజులు కావొచ్చు''

''దేనికోయ్ ఇప్పుడు ఢిల్లీ?'' ఫోనందుకున్న సాధూ ప్రశ్న.

''సాధూ! నీకు తెల్సుకదా రోజురోజుకీ నాకు పిచ్చెక్కేలా వుంది ఈ బిజీ వాతావరణంతో. దీన్లోంచి శాంతి కావాలి. విశ్రాంతి కావాలి. కొంత మార్పు రావాలి. అందుకే...''

''రిలాక్సింగ్ కోసమయితే- ఏ ఊటీయో, డార్జిలింగో- కనీసం కన్యాకుమారికో''

''అదికాదులే సాధూ! ఢిల్లీ అంటే- నాటోన్లీ ఢిల్లీ అలాగే అట్నుంచటు వారణాసి గయా-ప్రయాగా... అక్కడ ఫ్రెండ్స్ వున్నారు''

''ఎనీవే! వెరీగుడ్! మంజూషా పతీ! సతీసమేత తీర్థయాత్రా?''

''నో! మంజూష రావడంలేదు''

ఆశ్చర్యం ప్రకటించేడు డాక్టర్ సాధూ... ''వ్వాట్?''





అతనికేం అర్థం కావడంలేదు.

''ఇలా దూరం కావడం కూడా దగ్గర కావడానికేనేమో!''

★ ★ ★

నిద్ర పట్టక అటూ ఇటూ దొర్లుతోంది మంజూష.

దివ్యరాం లేని ఇల్లు చల్లగా వుంది. నిశ్శబ్దంగా వుంది.

ప్రశాంతంగా స్వేచ్ఛగా రిలీఫ్‌గా వుంది.

గుండెల్లో ఏదో అర్థంకాని అలజడి... మనసంతా ఏదో అర్థంకాని అశాంతి... ఏదో చెయ్యాలన్న తపన ఏం చెయ్యలేకపోతూన్న నిస్సహాయత...

ఏదో కావాలి తనకి. ఏదో అద్భుతమైన మార్పు- మిరక్యులస్‌గా జరిగిపోవాలి. ఏదో ఏదో వచ్చి తనని ఉప్పెనలా ముంచెయ్యాలి ఆనందసాగరంలో.

అరె! ఏమిటీ వింత ఆలోచనా రవళి?

దివ్యరాం తన స్వేచ్ఛనెప్పుడైనా బంధించాడా? మరి రామ్ లేనప్పుడల్లా ఇంటా బయటా ఎందుకంత రిలీఫ్‌గా వుంటోంది తనకి?

ఎవరికీ- దేనికీ లొంగని తన ఈ వ్యక్తిత్వానికి అర్థం ఏమిటి?

జీవితంలో తనకి సంతృప్తి అనేది అసలు లేదా? శాంతి అనేది లేదా?

సంపత్! సంపత్! ఒక్కసారి తన ఒంట్లో వున్న రక్తమంతా, అతని పేరు స్మరించడంతోనే ఎందుకింత ఉత్సాహంగా పరుగుపెడుతోంది.

చటుక్కున లేచింది.

రిసీవర్ తీసి నెంబర్ డయల్ చేసింది.

''హలో'' డ్రౌజీగా వుంది గొంతు.

''సంపత్! నేను''

''నేనంటే?''

''నేను!'' ఫర్మ్‌గా అంది.

''ఓ! మంజూ! ఏమైంది? ఆర్యూ ఆల్‌రైట్?''

''నో...! మనసేం బావుండలేదు. నిద్రపట్టడంలేదు. పిచ్చిపిచ్చి ఆలోచనలు''

క్షణంసేపు నిశ్శబ్దం.

"ఏం చెయ్యమన్నావు మరి? ఆ(... ఒక పనిచెయ్యి! ఇక్కడి కొచ్చెయ్యకూడదూ?"

"..........."

"అన్నట్టు- దివ్యరామ్‌గారు"

"ఢిల్లీ టూర్! ఎందుకని అడక్కు! ఏమో నాకూ తెలీదు..."

"ఐ.సీ. వస్తున్నావ్‌గా"

అరగంట తర్వాత-

పోర్టికోలో కారాపి దిగింది మంజూష.

చుట్టూ నిశ్శబ్దం... ఆత్రంగా చూస్తున్నట్టున్న చందమామ. నిశ్శబ్దాన్ని చీలుస్తూ అప్పుడప్పుడు కీచురాళ్ల రొద.

బాల్కనీ అంచున నైట్‌కోట్‌లో సంపత్.

చేతిలోని సిగరెట్ విసిరేసి, తనవైపు చూస్తూ నవ్వుతూ చేతులు జాపాడు.

"సంపత్! మైహార్టీ" పరుగునవెళ్లి అతని చేతుల్లో వాలిపోయింది.

తనక్కావలసిన తృప్తి... శాంతి... విశ్రాంతి... చల్లదనం ఒక్కసారిగా అందుకున్న అనుభూతి.

ఈ గమ్యాన్ని చేరడానికేనా, తనిలా దారితప్పి అశాంతిగా పరుగెడుతోంది. ఏమో!

★ ★ ★

ఢిల్లీ...

హొటల్ షెరటాన్... థర్డ్‌ఫ్లోర్... కార్నర్ రూం.

డబుల్‌బెడ్... విశాలంగా... ఆ చివర్న టాయ్‌లెట్... సన్నగా షవర్ చప్పుడు.

స్నానం చేస్తోంది కాదంబిని. సన్నగా ఆలాపన. ఏ కూనిరాగమో.

టీపాయ్‌మీద బుక్స్... మాగజైన్స్... నవల్స్.

దివ్యరామ్ అప్రయత్నంగా చేతికందిన పుస్తకం తీసుకున్నాడు హెరాల్డ్ రాబిన్స్ నవల.

అంతకుముందు సంభాషణ గుర్తొచ్చింది దివ్యరామ్‌కి.

సూట్‌కేస్‌మీదకి లెదర్‌బ్యాగ్ సర్దుతూ, బెడ్‌కి అటు చివర కూర్చొని వున్న కాదంబిని సమున్నతవక్షం వంక కన్నార్పకుండా చూస్తూండిపోయిన తనవంకే స్మయిలింగ్‌గా చూస్తూ అడిగిందామె. "హెరాల్డ్ రాబిన్స్‌ని చదివేవా ఎప్పుడైనా?"

చూపువాల్చుకుంటూ అన్నాడు తాను నిర్లక్ష్యంగా "ఆ(!" అని మాత్రం.

"అంటే- ఎంతోమంది ఆర్డినరీ రీడర్స్‌లాగే" కాదంబిని మాటని అందుకుంటూ" ఎప్పుడో డిగ్రీలో వుండగా 'కార్పెట్ బెగ్గర్స్' చదివేను. బుర్ర తిరిగిపోయి మరింకేం చదవలేదు"

"అదీ సంగతి! అలా చెప్పు. ఒకటో రెండో చదివిపడేసి వుంటావు. అవునా!?"

ఏంమాట్లాడలేదు దివ్యరామ్.

'ఏమిటీ కాదంబిని- చిత్రంగా, మరీ అర్థంకాకుండాపోతోంది. ఈమె ధోరణి' అన్నట్టుగా అలాగే చూడసాగాడు దివ్యరాం.

"అదో రకమైన సెక్స్ సైకాలజీ... వయసొస్తున్నకొద్దీ- పెరుగుతున్నకొద్దీ.. సెక్స్‌కి సంబంధించిన ఆలోచనలు, ఫీలింగ్స్ ఎలా మారుతుంటాయో చాలా బాగా రాస్తాడు దివీ! ఈ విషయాల్ని ఇంత అన్‌ఇన్హిబిటెడ్‌గా రాసేవాళ్లు నా దృష్టిలో రాబిన్స్ ఒక్కడే! అలా అని ఎవరితో పడితే వాళ్లతో పొమ్మనీ- సెక్స్‌వాంఛలు తీర్చుకొమ్మనీ ఎక్కడా రాయడు. అసలు అంత ఫ్రీనెస్ ఎప్పుడైతే వుంటుందో బలవంతం అనే ప్రశ్నేవుండదు. సెక్స్ అంటే అంత చీప్ ఒపీనియన్ వుండదు"

"..........."

చేతిలో నవల గుండెలమీద బరువుగా జారిపోయింది.

'ఓహ్! కాదంబినీ! యూ ఆర్ ఎ వైజ్ ఎనలైజర్!' దివ్యరామ్ హృదిలో అనుభూతి పరంపర...

అరమోడ్పులైన కళ్లలో, ఆమెతో నందనోద్యాన విహారాలు.

★ ★ ★

వయొలెట్ బాతిక్ డిజైన్లున్న లుంగీమీద, తెల్లటి లక్నో చికెన్ కుర్తా ధరించి, బాత్రూంలోంచి వచ్చింది మంజూష- తల తుడుచుకుంటూ.

కిటికీలోంచి సముద్రాన్ని చూస్తున్నాడు సంపత్.

అక్కడక్కడ నలకల్లా... పడవలు.

"వావ్! బ్యూటిఫుల్!" అడుగుల చప్పుడు విని ఇటుతిరిగి "నిన్ను చీరల్లో చూసి- చూసి విసుగెత్తింది"

ఒక్కసారి ఫ్లాష్‌గా మదిలో మెదిలాడు దివ్య రామ్.

ఓ సారెప్పుడో- ఓపెన్ మార్కెట్‌లోనే అతని చిరాకు.

"ఇంక నువ్వీ డ్రెస్సులు మానేస్తే బావుంటుంది. చిన్నపిల్లలా ఇంకెన్నాళ్లి లాంటివి వేసుకుని ఊరేగుతావ్? పెళ్లయిన ఆడదానికి చీరలే అందం!" చురుగ్గా తాను అప్పుడు చూసిన చూపుని ఇప్పుడు చిన్నమెరుపులా మార్చి అలవోకగా నవ్వింది మంజూష.

"ఏమిటో ఆ దరహాసం?"

"ఒకరి పరిహాసానికి మరొకరి ప్రశంసకి!"

"అర్థం కాలేదు"

"ఏంలేదులే! ఓ వయసొచ్చాక చీరలే డీసెంట్‌గా, డిగ్నిఫైడ్‌గా వుంటాయి..."

"మరీ ముసలమ్మ కబుర్లు... ఎవరు నూరిపోశారు- నీకీతత్వాన్ని?"

"ఎవరో అన్నారని కాకపోయినా, ఎవరికి వాళ్లకే తెలుస్తుంది"

నవ్వాడు సంపత్‌కుమార్.

హృదయంలో- ఏదో అలజడి... సన్నగా సెలయేటిహోరు... స్వర్గంలో నరకం- నరకంలో స్వర్గం.

"మంజూ!" మరింత గట్టిగా హత్తుకుంటూ అన్నాడు "నాకు స్త్రీ కొత్తకాదు! నీకు పురుషుడూ కొత్తకాదు! అయినా ఏమిటీ చలనం? ఏమిటీ స్పందన? ఎందుకీ తపన?"

ఆమె కళ్లలో- దేనికోసమో వెతుకుతున్నాయి అతని కళ్లు.

"కాని.... కొత్త అయింది ఒకటుంది!"

"ఏమిటి?"

"ప్రే...మ..."

సెలయేటితో పోటీపడలేని కాలం... ఆగిపోతుంది.

అతని నడుంచుట్టూ చెయ్యి చుట్టి గట్టిగా అతుక్కుపోయింది మంజూష.

ఎదుట సంపత్.. తన సంపత్.

తన వైపు తనలోని తన హృదయంలోకి తన అణువణువులోకి గుచ్చిగుచ్చి చూస్తూ తన మీదికి వంగుతూ... తన పెదాలకి దగ్గరగా అతని పెదవులు.

ఆమె గుండెల్లో... అణువణువులోనూ కలిసిపోవాలన్నంత ఆతృత.

"ఓహ్! మైడియర్ మంజూ!"

పూర్తిగా కప్పేసిన ఆమె ముఖం తన ముఖానికి దగ్గరగా రాగా, ఆమె జుట్టులో దాగిపోయాడు సంపత్.

* * *

నాల్రోజుల తర్వాత..

మ్యూజికల్‌గా మోగిన కాలింగ్‌బెల్‌కి లేచి తలుపు తీసింది మంజూష.

ఎదురుగా దివ్యరాం...

ఏ భావమూలేకుండా...ఏదోలా అతడు...

నిర్లిప్తంగా మంజూష.

"ప్రయాణం బాగా జరిగిందా?" ఏదో అడగాలన్నట్టు పొడిపొడిగా అడిగింది మంజూష.

"ఆఁ!" ఓ క్షణం తర్వాత "ఎలా వున్నావు నువ్వు?" అడిగాడు.

"ఇలాగే!"

అటు తిరిగి దివ్యరాం.

ఇటు తిరిగి మంజూష.

అతని లోకంలో దివి... తన లోకంలో మంజూ...

ఇద్దరిమధ్యా భౌతికంగా దూరం రెండడుగులే!

కానీ వాస్తవ దూరం.. హృదయాల మధ్య కొన్ని కాంతి సంవత్సరాలు...

ఇద్దరి మధ్యా పూడ్చలేనన్ని అగాధాలు.

* * *

రెండ్రోజుల్నుంచీ రాలేదు సంపత్...

ఏమయింది? నాలుగుసార్లు ఫోన్ చేసింది తానే! అసలేమైవుంటుంది?

ఆమె మనసు బాధతో మూలిగింది.

మెల్లగా లేచింది.. బాల్కనీ మెట్లు దిగి వచ్చింది. పోర్టికోలో కారు లేదు. ఊ..ఫ్...




అయినా సరాశ చెందలేదు.

బయటికొచ్చి, ఆటో ఎక్కింది.

బంగళా ముందు ఆటో దిగి గబగబా పరుగెడుతున్నట్టుగా లోపలికి నడిచింది. హాల్లో కనిపించలేదు. చకచకా పైకి వెళ్లింది... రెండు బెడ్రూమ్‌లూ చూసింది... బాల్కనీలోకొచ్చి స్థాణువులా నిల్చుండిపోయింది.

బాల్కనీలో ఒక కుర్చీలో కూర్చున్నాడు సంపత్.

నలిగిపోయిన పైజామా, లక్నో చికెన్‌కుర్తా... రేగిపోయిన తల... మూడు రోజుల్నించి నిద్రలేనట్టుగా లోతుకుపోయిన ఎర్రటి కళ్లు..

సన్నగా ద్రవించిందామె హృదయం.

జలపాతంలా ఉరికింది.

ఒక్కపరుగున వెళ్లి అతని ముందాగి, చేతిలోని సిగరెట్ విసిరేసి అతని మొహాన్ని చేతుల్లోకి తీసుకుంది.

''సంపత్! మై డార్లింగ్! ఏమిటిది?''

ఆమె కళ్లలోకి చూశాడు. అతని కళ్లలో ఏ భావమూలేదు. కేవలం అలసట.. యుగాల తరబడి ఎడారిలో నడిచొచ్చిన అలసట.

''సంపత్! మై హార్ట్! ఏమైంది నీకు?'' అతని తలను గుండెలకు హత్తుకొని, ఆవేశంగా నిమురుతోంది. ''సంపత్! సంపత్! మాట్లాడవేం?''

మాట్లాడలేదు సంపత్.

గదిలోకి తీసుకొచ్చి నెమ్మదిగా బెడ్ మీద పడుకోబెట్టింది.

కిటికీ తెరలను విశాలంగా తీసి మళ్లీ అతడి దగ్గరికొచ్చి, తలను ఒళ్లోకి తీసుకుని నిమరసాగింది.

నెమ్మదిగా కళ్లు తెరిచి పైకి చూశాడు సంపత్. క్రమంగా మంజూ మొహం... బోర్లా తిరిగి, ఆమె ఒడిలో మొహం దూర్చి నడుం చుట్టూ చేతులు బిగించాడు.

''మంజూ!'' పెనవేసుకుపోయాడు.

చిన్న పిల్లాడిలా ఆమె గుండెల్లో ఒదిగిపోతూ, ''మంజూ! నా జీవితం పెద్ద ఎడారి... ఇందులో నాకేం దొరకదు. దొరికిన వాటిని సైతం అందుకోలేని దురదృష్టవంతుణ్ణి నేను. తీరని దాహం... మండే హృదయం నాది. అది ఎప్పటికీ చల్లారదు. నా అసంతృప్తికంతం లేదు. లేదు... లేదు... మంజూ! ఎప్పటికీ లేదు...'' అన్నాడు.

బుజ్జగిస్తున్నట్టుగా తన అరిచేతుల్తో అతని చెంపలను మెత్తగా హత్తుతోంది.

''మంజూ! నీకు తెలీదు మంజూ నేనెలాంటి...''

''ష్! మాట్లాడొద్దు అంటూంటే''

''అది కా...'' ఇందాకట్నుంచి ఏదో చెప్పాలనుకుంటున్న సంపత్ పెదవుల్ని మరి కదలనీయకుండా తన పెదవుల్తో మూసేసిందామె.

* * *

నెమ్మదిగా శబ్దం చెయ్యకుండా లోపలికెళ్లాడు దివ్యరామ్. పల్చని కర్టెన్ తొలగించి, బెడ్రూంలోనికి అడుగుపెట్టేడు. బోర్లాపడుకొని వుంది కాదంబిని... దగ్గరకెళ్లబోయి ఆగిపోయేడు. ముళ్లలా గుచ్చుకుంటున్న మెత్తటి ఫోమ్ బెడ్ మీద అశాంతిగా అటూ ఇటూ దొర్లింది.

ఆమె హృదయంలో ఎగిరెగిరి పడుతున్న ఆవేశపు అలలు... రాం హృదయాన్ని తాకుతున్నాయి.

''రామ్! నా జీవితంలో ఎందుకు ప్రవేశించావు దివీ?''

''కాదంబినీ!'' నెమ్మదిగా ఆమె తలను దగ్గరికి తీసుకోబోయేడు. గిరుక్కున పక్కకి దొర్లి, అతని ఒళ్లో తల పెట్టుకుని దివి కళ్లల్లోకి చూస్తూ, అతని చెంపల్ని రాస్తూ అంది కాదంబిని ''రాం! జీవితం అనుభూతుల విప్లవలయంలా లేదూ?''

''కాదంబినీ!'' కొద్దిగా ముందుకి వంగాడు...

నెమ్మదిగా లేచిందామె... అస్తవ్యస్తంగావున్న చీరని సర్దుకోలేదు. బరువుగా బాల్కనీలోకి నడిచింది.

చటుక్కున వెనుదిరిగి ''రాం! ఐదారేళ్ల కిందటే ఎందుకు కలవలేదు నువ్వు'' ఆవేదనగా, ఆవేశంగా అంది.

''ఇప్పుడు మాత్రం ఏమయింది కాదంబినీ! నేన్నిన్ను వదులుకోలేను కాదంబినీ! నేను నీ వాణ్ణి! యుగయుగాల నించి నీవాణ్ణి! నన్ను దూరం చెయ్యకు కాదంబినీ!'' అతని ఆవే

శంలో ఆమె ఆవిరైపోతోంది. ప్రేమలో కరిగిపోతోంది.

"కాదంబినీ! నాకు నువ్వు కావాలి! నీ ప్రేమ కావాలి! నీలోని అణువణువూ కావాలి" ఆత్రంగా ఆమెను తనలో కలిపేసుకుంటూ అన్నాడు.

రెండు హృదయాల ఘోష...

రెండు హృదయాలు మాట్లాడుకునే మౌన భాష... నిశ్శబ్దంలోంచి ధ్వనించే సంవేదనా ఘోష...

"అనవసరమయిన మాటల్తో, ఈ నిముషాల్ని ఊపిరిసలపనివ్వకుండా చెయ్యకు! తీరంలేని హర్షంలో మన ఆలోచనల్ని ఝరీప్రవాహంలా సాగనివ్వు! మౌనంగా స్పందించనివ్వు"

★ ★ ★

కలర్‌ఫుల్‌గా, ప్లెజెంట్‌గా వుంది... సీ పెరల్.

మంచు కడిగిన మంచిముత్యంలా మంజూష... దూరంగా కెరటాలను చూస్తూ సంపత్.

"సంపత్! ఏమిటంత మౌనంగా వున్నావు?"

"నేనా! నువ్వే మౌనంగా వున్నావు. ఏం మాట్లాడ్డంలేదు"

నాలుగోసారి తాగుతున్నాడు లిమ్కా. చల్లని సాయంత్రమే కాని దాహంతో తపించిపోతోంది... థర్స్టీ ఈవెనింగ్.

"పోదామా సంపత్?"

ఇద్దరూ లేవబోయేంతలో ఇంకెవరో తమ లోకంలో తాముండి ఏదో మాట్లాడుకుంటూ వచ్చి, ఎదురుగా కుర్చీల్లో కూర్చున్నారు.

తలెత్తి చూసిన మంజూష ఆశ్చర్యపోయింది.

దివ్యరామ్, కాదంబిని.

మంజూషని చూసి, పలకరింపుగా, పెదవులు విడీవిడనట్లుగా నవ్వింది కాదంబిని...

ఆశ్చర్యంలోంచి తేరుకోకపోయినా, జవాబుగా మంజూష నవ్వుతో ప్రతిస్పందించబోయేంతలో, కాదంబిని "దివీ! ఈవిడ..." మాటని కట్ చేస్తూ "మంజూష" అన్నాడు పొడిగా రామ్.

ఈసారి ఆశ్చర్యంగా చూడడం కాదంబిని వంతు అయింది.

"మంజూష... మంజూష..." సన్నగా ఆమె హృదయం వణికింది.

నలుగురి హృదయాలు ఒకేలా ఘోషిస్తున్నాయి...

ఒకేలా తపిస్తున్నాయి...

ఒకేలా ఆక్రోశిస్తున్నాయి...

నాలుగు బాటలూ కలిశాయ్... ఒక్కచోట ఒక్కక్షణం పాటు... మంజూ సూటిగా దివ్యరాం కళ్లలోకి చూసింది.

సంపత్ సూటిగా మంజూనే చూస్తున్నాడు.

కానీ... దివ్యరాం, కాదంబినీ చెరోవైపూ చూస్తున్నారు...

★ ★ ★

'ట్వంటీ ఫస్ట్ సెంచురీ క్లబ్' మహాసందడిగా వుంది.

ఎవరితోనూ కలవకుండా ఎవరితోనూ సంబంధం లేనట్టుగా ఆరుబైట లాన్‌లో... లిల్లీల్ని చూస్తూ ఈజీ ఛైర్లో కూర్చున్న వాడిలా వెనక్కి జారగిలబడి గార్డెన్ ఛైర్లో దివ్యరాం...

ఈ లిల్లీలు మంజూకి ఎంతో ఇష్టం కదూ! దివ్యరాం లోపలివ్యక్తి మనసు తలుపుతోసు కుంటూ.

అయితే ఏంటట? ఆమెకి చాలా ఇష్టాలున్నాయి... పువ్వులేనా? వ్యక్తుల్లో మాత్రం!? ఆమె అభిరుచులు ఆమెవి.

కరెక్ట్! ఎవరి టేస్ట్ వారిదైనప్పుడు, వారికి నచ్చిన అభిరుచుల్తో ఏకీభావం కుదిరిన వాళ్లతోనే ఎవరి దారిన వారు బతకరాదూ?!

యస్! అదే బెటరేమో! కానీ ఎలా? వైవాహిక బంధం అనేదొకటి రెండు జీవితాల్ని గట్టిగా ముడివేసి, సామాజిక సూత్రాలనే పగ్గాలతో బంధించి పారేసి పైగా న్యాయం చట్టం వాటికి కాపలా కాస్తుంటే?

విడాకులున్నాయిగా! సర్టెన్లీ! డైవోర్స్ ఈజ్ ది ఓన్లీ సోర్స్.

సరిగ్గా అప్పుడే దివ్యరామ్ హృదయం






వసిగట్టి చదివేసిన వాడిలా, లోపల్నుంచి ఊడిపడ్డాడు లాయర్ సుందరం.

"సుందరం! ఓ విషయం అడుగుతాను... ఏం అనుకోవుగా!"

"నెవర్! వాట్ కెన్ ఐ డూ?" పక్కనేవున్న కుర్చీ దగ్గరగా లాక్కుని కూర్చుంటూ అడిగాడు సుందరం.

"నాకో సలహా కావాలి! బట్... మోస్ట్ కాన్ఫిడెన్షియల్..."

"ఎనీ ప్రాబ్లెమ్స్ ఇన్ యువర్ ఇండస్ట్రీస్ మాటర్స్?"

"నో! డొమెస్టిక్ మాటర్సే! వాట్ ఎబౌట్ యువర్ ఒపీనియన్ ఆన్ డైవోర్స్? విడాకుల గురించి ఓ లాయర్‌గా ఏమైనా చెప్పగలవా?"

"చాలా చెప్పొచ్చు! ఫస్ట్... మనదేశంలో అంత తొందరగా విడాకులు దొరకడం కష్టం!"

"నిజమే! ఎందుకని?"

"ఎందుకంటే పెళ్లి అనేదానికి అంత స్ట్రాంగ్ వేల్యూ ఇచ్చేరు గాబట్టి"

"ఈ వ్యవస్థలో ఐమీన్ మన సమాజంలో ఒకసారి వైవాహిక బంధంతో కలిసిన వ్యక్తులు అందులో ఇమడ్డం కష్టమని ఆలస్యంగా అంటే ఓ ఐదారేళ్ల తర్వాత గ్రహిస్తే!?" అంటూ

కుర్చీలో అశాంతిగా కదిలాడు దివ్యరామ్.

ఎలా?... ఎలా??... ఎలా??? ఎలా చెప్పాలి తన సమస్య?

క్రమంగా వెల్తురును కబళిస్తూన్న చీకటి...

వల్చగా పరుచుకుంటున్న వెన్నెల్లో కరిగిపోతూన్న చుక్కలు...

లాయర్ సుందరానికి దివ్యరామ్ మనోభావన అంతుపట్టడంలేదు. ఏదో పజిలింగ్‌గా... ఏదో అడగబోయి సందేహిస్తున్నట్టుగా...

"నువ్వేదో అంతుచిక్కని వర్రీలో వున్నట్టున్నావ్ దివ్యరామ్! కాన్ఫిడెన్షియల్ అన్న తర్వాత లాయర్లూ, డాక్టర్లూ ప్రాణంపోయినా అవి లీక్‌చెయ్యరు!"

"ఐనో! ఐనో! ఎలా అడగాలా అని ఆలోచిస్తున్నాను. ఉదాహరణగా నువ్వు ఇచ్చిన కొన్ని లీగల్ కండిషన్స్ ప్రకారం చూసినా అదంత

సీరియస్ కాదు. ఇద్దరూ శాడిస్టులు కారు. ఇద్దరిలో ఏ ఒక్కరికీ, ఎదుటివారికి హాని చేద్దామన్న మనస్తత్వం లేదు. ఇద్దరూ ఆరోగ్యవంతులే! ఒకప్పుడు పెద్దల ఆశీర్వాదంతోనే పెళ్ళి చేసుకున్నారు''

''మరి!?''

''ఏదో భరించలేని మానసిక జాడ్యం! ఒకరి సాన్నిధ్యం ఒకరికి ఎంతమాత్రం సంతోషం కలిగించలేకపోతోంది. అయిష్టతగా అభిరుచి రాహిత్యంతో, డల్‌గా, ఏదో అరెస్ట్ అయినట్టు ఒకే ఇంట్లో మెకానికల్‌గా... కొన్ని వేల మైళ్ళ దూరంలో బతుకుతున్నారు. అలా బతుకుతూ ఇద్దరి జీవితాలూ వేస్ట్ చేసుకొనే కంటే, విడిపోయి ఎవరి జీవితాలు వారు చూసుకుంటే బావుంటుంది కదూ!''

దూరంగా లైట్‌హవుస్ విరజిమ్ముతూన్న కాంతిపుంజం...

''ఎనీ రీజన్ ఫర్ దిస్?''

''అవునో కాదో చెప్పలేనుగానీ, ఇద్దరివైపూ మూడో వ్యక్తి ప్రవేశం అనివార్యమైంది. రెండు వైపులా ఇలా జరిగింది. అయినా భర్త భార్యని ఏనాడూ దూరం చేసుకొనే ఉద్దేశంలో లేడు!''

''ఈ సంగతి... అదే! భర్త, తనని దూరం చేసుకోదల్చుకోలేదన్న సంగతి భార్యకు తెలుసా?''

''మొదట తెలీదు... తర్వాత తెలిసినా, ఆమె స్పష్టంగా తన అభిప్రాయం చెప్పలేదు''

ఏదో కసి... నరనరానా పాకుతోంది దివ్యరామ్‌కి.

'సొసైటీని ఒక బారెన్‌లాండ్‌గా చేసి, మనుషుల్ని జంతువులుగా మార్చి, ఈ న్యాయవ్యవస్థ బలవంతపు సంసారాల్ని చేయిస్తోందన్నమాట!' స్వగతంగా అనుకుంటూ, పైకే అన్నాడు దివ్యరాం.

''నో! నో! చట్టం పని సంఘంలో శాంతిభద్రతల్ని బ్యాలెన్స్ చెయ్యడంవరకే! అంతే! మనసుల్లో, హృదయాల్లో దానికేం పని?''

''నిజమే! పనేంలేదు! ఈ సొసైటీలో అణువు అణువునా బంధనాలకి గురైపోయింది మనసు. అందుకే అసలు... దానికే శాంతీలేదు. భద్రతాలేదు''

చిత్రంగా చూశాడు సుందరం.

★ ★ ★

కెప్టెన్ సంపత్‌కుమార్ ఇంటిముందు కారాపి, లోపలికెళ్ళాల్సిన మంజూష ఆగి ఆశ్చర్యపోయింది.

ఎప్పుడూ, తనకోసం తెరిచివుండి, తనలోకి ఆహ్వానిస్తున్నట్టున్న సంపత్ ఇంటి గేటు మూసివుంది. కారు శబ్దానికి వీరేశు అక్కడికొచ్చాడు. ఒక్కక్షణం ఆమె హృదయం రెపరెపలాడింది. వీరేశు గేటు తెరిచాడు. చదునైన రాళ్ళబాటమీద నడిచి, పోర్టికోముందాగింది. లాన్ తడపడానికొచ్చాడు సోమయ్య.

''సోమయ్యా! అయ్యగారెక్కడ?''

''తెలీదమ్మా! తఁవరింటికే వొచ్చేరేటో!''

''మా యింటికా?''

'నేరోగా ఎక్కడో మిస్సయి వుండొచ్చ'ని క్షణంలో కారు దగ్గరికి పరుగెత్తి స్టార్ట్ చేసింది.

ఇంటిముందు కారాపి లోపలికెళ్ళింది... ఎవ్వరూ లేరు...

ఎవ్వరూ వచ్చి వెళ్ళిన జాడ కూడా లేదు.

చీకటిగా వున్న వరండా మెట్లమీద కూర్చుంది.

అప్రయత్నంగా ఆమె కాళ్ళు బాల్కనీలోకి లాక్కెళ్ళాయి.

తనకెంతో ఇష్టమైన రోజామొక్క పక్కనే గార్డెన్ ఛెయిర్లో కూర్చొని, వెనక్కి వాలి కళ్ళు మూసుకుంది. చిన్న గాలితెమ్మెర... పక్కనే వున్న రోజాపువ్వు చిన్నగా కదిలి, ముందుకొంగి, తన బుగ్గలమీద రెండుసార్లు మెత్తగా తట్టింది!

తల పక్కకి తిప్పి చూసింది.

గులాబీ కొమ్మకి ముళ్ళ మధ్యగా చిన్న దారంతో కట్టబడి, ఓ పొడవాటి కవర్ వేళ్ళాడుతోంది.

'అరె! ఇదేంటి? ఎవరిది? ఇక్కడెలా వుంది?' అనుకుంటూనే గబుక్కున దారం తెంచి కవర్ పట్టుకొని లోపలికొచ్చింది. నేవీబ్లూ కవర్‌మీద 'స్నేహానికీ, ప్రేమకీ సరైన నిర్వచనం చెప్పిన నా హృదయ పేటిక, అనురాగ 'మంజూష'కి -సంపత్' అని వుంది.




ఆమె గుండె దడదడలాడింది. వణుకుతు న్న చేతుల్తో కవర్ చింపి, అంతకన్నా వణుకుతున్న హృదయంతో చదవడం ప్రారంభించింది.

''మంజూ! మై స్వీటీ!

నిజానికి నిన్నెలా సంబోధించాలో తెలీడంలేదు. ఇంతవరకూ నా జీవితంలో, నేనెవరికీ ఉత్తరాలు రాయలేదు. ఎలా రాయాలో తెలీక కావొచ్చు! ఇంట్రస్టు లేక కావొచ్చు. రాసే అవసరం లేక కావొచ్చు. ఎందుకో నీకు రాయాలనిపిస్తోంది. ఇదే మొదటి ఉత్తరం, చివరిదీ కూడా.

ఎవరు నువ్వు మంజూ! ఎడారిలాంటి నా జీవితంలోకి కోయిలలా ప్రవేశించి, నాల్రోజుల నందనవనాల్ని సృష్టించేవు? ఈ కొద్దికాలమే ఏం ఖర్మ? జీవితమంతా వసంతం వెల్లివిరుస్తుంది. నీ వెచ్చని ఒడిలో వుంటే! కాని...

చిన్నప్పట్నుంచీ, ఎవ్వరి ప్రేమకూ నోచుకోని బతుకు నాది. పువ్వుల్లాంటి అమ్మాయిలతో సున్నితంగా ఎలా ప్రవర్తించాలో తెలీదు నాకు. దానికితోడు ఇంతవరకూ నాకు తారసపడిన అమ్మాయిలు కూడా అలాంటివాళ్ళే! వాళ్ళతో ఎలా ప్రవర్తించాలా అన్న ప్రసక్తే వుండేది కాదు. ముఖ్యంగా నేను తిరిగిన సిక్కిం, బర్మా, భూటాన్, నేపాల్, ఇండియా బోర్డర్లలోని నాకు తారసపడిన అమ్మాయిలంతా నన్ను మించిన రఫ్ మెంటాలిటీలు. మోస్ట్ అన్ ఇన్హిబిటెడ్ గర్ల్స్. వాళ్ళతో మాట్లాడే మాటలు... ఓ అమ్మాయి, ఓ అబ్బాయి మాట్లాడుకొనే మాటలు కావు! ఓవిధంగా వాళ్ళ కంపెనీని ఎంతో ఎంజాయ్ చేశాను నేను కూడా! అలాంటి రోజుల్లో సిక్కిం మంచుకొండల మధ్య మన ప్రాంతం అమ్మాయి మాధురి తన వెచ్చని చేతుల్తో మధురమైన జీవితాన్నిచ్చింది. ఆమే, జీవితం ఏమిటో తెలియజెప్పింది. ప్రేమ ఏమిటో చెప్పింది. కాని మంజూ! చెప్పేనుగా! నన్ను ప్రేమించేవారూ, నేను ప్రేమించేవారూ నాకు దక్కరు. నాకో షాకిచ్చి వెళ్ళిపోయిందామె. కాని మంజూ! వీళ్ళందరినీ ఛాలెంజ్ చేస్తున్నట్టుగా, నా జీవితంలో నువ్వు ప్రవేశించావు. ఎంతో ప్రేమగా నీ చల్లని హృదయాన్ని నాకోసం తెరిచావు. కాని ఆ హృదయంలోనికి ప్రవేశించేముందు నాలో పెద్ద తుపాన్లు చెలరేగాయి. లిల్లీపువ్వులా అమాయకమైన నీ మొహం, చురుగ్గా మిలమిల్లాడే నీ కళ్ళు నిరంతరం నన్ను వెంటాడేవి.

ఏమిటీ రాతలని ఏమీ అనుకోకు డియర్! ఉత్తరాలు ఎలా రాయాలో, అందులోనూ నీలాంటి అమ్మాయిలకి ఎలా రాయడమో అసలే తెలీదు. నీతో మాట్లడేటప్పుడు సాధ్యమైనంతవరకు మర్యాదగా మాట్లాడ్డానికి ప్రయత్నించేవాడిని. ఇదిగో స్వీటీ! బాల్కనీలో కూర్చొని, సముద్రపు ఘోషను వింటూ ఈ ఉత్తరం రాస్తున్నాను. ప్రతి ఉత్తరంలోనూ నువ్వే కనిపిస్తున్నావు డార్లింగ్! ఒక్కసారి నా గుండె కొట్టుకునే శబ్దం విను. నీ పేరుతోనే కొట్టుకుంటోంది. నీ రాకతోనే అసలు నేనిన్నాళ్ళూ పోగొట్టుకున్నదేమిటో తెలిసింది. నా మంజూ! స్నేహానికి, ప్రేమకీ అందమైన నిర్వచనానివి నువ్వు! నాకైతే ఈ జీవితం కెరటాల్లాగే అనిపిస్తోంది. నిరంతరం ఏదో స్ట్రగుల్! ఏదో అశాంతి. ఏదో అసంతృప్తి. ఇంకేదో కావాలన్న తపన. ఈ అశాంతిలోనే ఏదో ప్రశాంతి వుంది. ఈ అసంతృప్తిలోనే ఏదో తృప్తి వుంది! ఈ తపనలోనే ఏదో తియ్యని ఫలితం వుంది!

నీకు చెప్పలేదుకదూ! బాంబులాంటి ఈ వార్త, నాకు ఎక్స్‌టెన్షన్ వచ్చింది ఆర్మీలో. బాండ్‌లు, రిలీవింగ్‌లు, ఎక్స్‌టెన్షన్‌లూ... ఇదే లైఫ్ ఇంక నాకు! జీవితం అంతమయ్యేవరకు, ఎక్కడా ఆగకుండా, అలా ప్రయాణిస్తూనే వుంటాను. ఈ ఒడుదుడుకుల బాటలో! ఐమీన్... నువ్వు నీ ఊహల్లో అనుకొనే నా గులాబీల బాటలో... అందుకే ముళ్ళు గుచ్చుకుంటూనే వుంటాయి. తియ్యని బాధని కలిగిస్తూ.

నేన్నీకు ఏవిధంగానూ జోడీని కాను మంజూ! నీలాంటి ఆత్మాభిమానికి, నాలాంటి సైనిక సామాన్యుడు, నీలాంటి అందాల పేటికకి నావంటి మామూలు అంగరక్షకుడు... ఓహ్! ఎలా ఊహించను? నా జీవితానికో గమ్యం లేదు. ఇదో పెద్ద ఎడారి. అలాంటిది నీకు నేను గమ్యం ఎలా అవుతాను? పువ్వులాంటి నిన్ను నా ముళ్ళబాటమీద ఎలా నడిపిస్తాను? నా మంజూ! ఇంకేం రాయను?

ఎక్కడికెళ్తానో రాయలేను. ఎక్కడున్నా నన్ను వెతుక్కుంటూ వచ్చెయ్యగలవు నువ్వు! ముగించేముందు ఒకే ఒక్క వాక్యం నా సందేశంగా.

'ఓ నా సెలయేటి ప్రవాహమా! నువ్వు గలగలా సాగిపోవాలి తప్ప, ఎక్కడా ఆగిపోరాదు - ఈ జ్ఞాపకాలు నీ మంజూషలో పదిలపరుచుకుని'

నీ
హా...ర్టీ...''

''సంపత్!'' ఆమె పెట్టిన కేకకు లోకాలన్నీ కదిలిపోయి, ఊగిపోయేవి ఆ అరుపు గనుక పెదవి దాటివస్తే.

లేచిందామె.

గబగబా ఫోన్ దగ్గరికెళ్ళి ఎత్తింది రిసీవర్.

''హలో!''

''ఎవరూ?'' సోమయ్య గొంతు.

''బాబుగార్ని ఓసారి పిలు!''

''అయ్యగారు లేరమ్మా!''

''ఎక్కడికి వెళ్ళారు?''

''ఊరెళ్ళిపోతున్నారు! ఇప్పుడే ఎళ్లిపోతున్నారు... ఎళ్లిపోయారు''

అంతే! ఫోన్ పెట్టేసింది.

''సంపత్! మై హార్టీ! నిన్ను నేను వెళ్ళనివ్వను. నువ్వు నాకు కావాలి సంపత్

గబగబా పరుగెడుతున్నట్టుగా మెట్లు దిగి వచ్చి, పోర్టికోలోంచి కారు తీసి, అదిరే గుండెల్తో, స్థిరనిశ్చయంతో, ఒక్కసారి ముందుకురికింది.

★ ★ ★

దివ్యరామ్ లేచి ఫ్రిజ్‌లోంచి బాటిల్ తీసి, నీళ్ళు వంచుకుని తాగాడు. గ్లాను టేబుల్ మీద పెడుతూ చూశాడు పేపర్ వెయిట్‌కింద పింక్ కవర్...

'దివ్యరాం గారికి' అని ఉందంతే!

నెమ్మదిగా కవర్ చింపి, లోపలున్న ఒక ఫొటోని బయటికి తీశాడు. కోణార్క్ శిల్పసౌందర్యానికి అద్దంపట్టే ఫొటో. ఆ ఫొటో ఇస్తున్న సందేశం ఒకటుంది. 'ప్రియునిలో ఐక్యమయిపోతున్న ప్రియురాలు'

'ఏమిటిది? ఇక్కడికెలా వచ్చింది? కాదంబిని వచ్చిందా?'

ఫొటో వెనక్కి తిప్పి చూశాడు.

ముత్యాల్లా మెరుస్తూన్న అక్షరాల వరుస. రెండే రెండు వాక్యాలు.

'దివీ! నా జీవితధ్యేయం - ప్రేమైక జీవనం! పెళ్ళిమాత్రం కాదు! పెళ్ళే నీకు ప్రథమాధ్యాయం - ప్రేమ దానికి ఆలంబనం...

కవితాత్మకంగా ఉన్న ఆ రెండు వాక్యాలు పదేపదే చదువుకున్నకొద్దీ అనంతంగా అర్థాలు బోధపడసాగాయి దివ్యరామ్‌కి.

-అంటే కాదంబిని కేవలం ప్రేమకోసం తపించిపోయిందన్నమాట! ప్రేమలోని మాధుర్యం చవిచూడ్డంకోసమే, తనతో సాహచర్యం పెంచుకుందా? క్రమంగా తాను కాదంబినిపట్ల పరవశితుడై సమ్మోహితుడైన సంగతిని గ్రహించిందా? ఆమె రూపానికి తాను దాసానుదాసుడైనట్టు ఆమె భావించిందా? పెళ్ళి తన లక్ష్యం కాదని ఆమె స్పష్టంచేసిందంటే తన మోజుని ఆమె పెళ్ళికోసం తాను తపిస్తున్నట్టుగా అర్థం చేసుకుందా? ఏనీవే! అందులో నూ వాస్తవం కొంత ఉందిగానీ, తన ప్రేమని శంకించే స్థితిలోమాత్రం లేదే! అంటే తన ఊహని ఆమె ఈవిధంగా అర్థంచేసుకుందా?

పెళ్ళీ, ప్రేమా పరస్పరాలంబనం అయినప్పుడు ఏది ముందూ, ఏది వెనకా? ఆవిధంగా చూసినా, తనకి మంజూతో పెళ్ళి జరిగిపోయింది కాబట్టి, ఓహ్! ఎంత అర్థాన్ని దాచావ్ కాదంబినీ! ఈ రెండు వాక్యాల్లోనూ అనంతమైన అర్థాల్ని పొదిగావన్నమాట! అన్యాపదేశంగా నువ్వు చెప్పదల్చుకున్నది ఇదా? 'పిచ్చివాడా! నువ్వు పెళ్ళి అయినవాడివి! నీ ప్రేమ మాధుర్యాన్ని నీ జీవిత సహచరికే సలక్షణంగా పంచి ఇవ్వు! నీకు ప్రేమించగల గొప్ప గుణం వుంది. అది భార్యపట్ల సార్థకం చెయ్యి. అంతే తప్ప ఏవో కొన్ని లేదా అన్నీ అభిప్రాయాలు ఏకీభవించాయని ఏ ప్రియురాలికో దాసోహం అనకు' అని జ్ఞానబోధ చేసిందన్నమాట!

శభాష్! అద్భుతం కాదంబినీ! చాలా గొప్ప





సందేశాన్ని ఇచ్చావ్! సంతోషం కాదంబినీ! ఈమాత్రం తెలుసుకోలేని అజ్ఞాని కాడీ దివ్యరామ్... వెనక్కి వాలి ఆలోచిస్తున్నాడు దివి.

అసలిది ఇక్కడికెలా?... ఎవరితోనైనా పంపిందా?

అతని గుండెల్లో నల్లని నీడలు వ్యాపిస్తున్నాయి.

హాయిగా ఊయలలూగుతున్న అతని హృదయం - భయంకరంగా మూల్గుతోంది.

టేబుల్‌మీద కాలింగ్‌బెల్ నొక్కాడు.

అటెండర్ వచ్చాడు లోపలికి!

''ఈ రెండ్రోజుల్లో నాకోసం ఎవరైనా?''

''నిన్న సాయంత్రం... ఈ ఛాంబర్‌లోకే వచ్చి, ఎంత వద్దంటున్నా వినకుండా మీ కుర్చీలోనే చాలాసేపు కూర్చొని, ఆ కవర్ ఇక్కడ పెట్టి వెళ్ళిపోయారు''

''ఏం చెప్పలేదా?''

''లేదుసార్!

గబగబా బయటికొచ్చి అందిన వాహనంమీద క్షణాల్లో కాదంబిని ఇంటిముందున్నాడు.

తలుపులు తెరిచే వున్నాయి.

ఆత్రంగా చూస్తూ వరండాలో నించుని కాలింగ్‌బెల్ నొక్కాడు.

''లక్ష్మీ!'' ఆత్రంగా పిల్చాడు.

''బాబూ! మీరా? ఒకట్రెండు మాట్లు సూసినా, గుర్తు పట్టనేప్పోన్ను''

''సర్లే... కాదంబిని?''

''ఆరు ఊరెల్లిపోనారు బాబూ!''

''ఏవూరు?''

''నాకేటి తెలుత్తాది? అదేటో పారీనట! ఆల్ల నాయినగోరి దగ్గరికెళ్ళిపోతన్నారని ఇన్నాను''

ఎలా అక్కడ్నించి కదిలాడో, దివ్యరామ్‌కి తెలీదు. ఓ అరగంటలో అతడు బీచ్‌లో వున్నాడు.

ఎప్పుడూ తానూ, కాదంబినీ కూర్చునేచోట కూర్చున్నాడు.

'కాదంబినీ! నువ్వెంత తొందరపడ్డావ్ కాదంబినీ!' రామ్ హృదయం కదిలిపోతోంది.

'ఒక్కరోజులో మన జీవితాల్ని తారుమారు చేసేశావ్ కదూ! కాదంబినీ! నీకోసం నువ్వు నడిచే బాటమీద మల్లెపూలు పరవాలని... ఎన్నో ఆశలు నింపుకొని! నన్నీ నరకంలో వదిలేసి, ఎక్కడికి పోయావ్ కాదంబినీ! ఎందుకింక నాకీ జీవితం?' మూగగా ఆక్రోశిస్తోందతని హృదయం.

ఆ హృదయాన్ని చీల్చుకొని, బయటికి వచ్చి చేతిమీద జారిపడిందో వెచ్చటి కన్నీటి చుక్క.

★ ★ ★

స్టేషన్‌ముందు కారాపి, గబగబా పరుగెడుతున్నట్టుగా లోపలికెళ్ళింది మంజూష

స్టేషన్ అంతా కలయతిరిగింది. ఖాళీగా- నిశ్శబ్దంగా వుంది.

గబగబా టి.సి.ని తోసుకుంటున్నట్టుగా గేటికొచ్చింది. ఒక్క ఉదుటున స్టార్ట్ చేసింది కారు.

ఆమెలోని ప్రతి రక్తపుబొట్టూ ఎదురుతిరుగుతోంది. నరాలన్నీ స్వాధీనం తప్పుతున్నాయ్. పెద్ద పెద్ద బండరాళ్లు దొర్లించినట్టుగా కొట్టుకుంటోంది గుండె.

కారాపి- గబగబా లోపలికెళ్లింది. భరించలేని శూన్యం... భయంకరమైన నిశ్శబ్దం. నెమ్మదిగా బెడ్రూంలోకి వచ్చింది.

ఆమె మెదడు నరాలు చిట్లిపోతున్నట్టుగా అన్పిస్తోంది.

అగ్నిపర్వతాలు బద్దలవుతున్నాయ్. హిమశిఖరాలు కరుగుతూన్నాయ్. లావా-మంచూ ఎదురెదురుగా ఒకచోట కలిసిన విచిత్రస్థితి.

ఘోరమైన ఆవేశంతో ఆమె జ్వలిస్తోంది.

నిశ్శబ్దంగా జారిపడిందో భాష్పకణం.

ఆ వెంటనే మరొకటి. ఇంకోటి. తర్వాత ధారాపాతంగా.

ఆమె రోదిస్తోంది.

★ ★ ★

టకటక బూట్ల చప్పుడు...

నెమ్మదిగా దగ్గరగా మంచం పక్కనే ఆగాయి.

''మంజూ!'' ఆమెని మెల్లగా తట్టి లేపబోయాడు దివ్యరాం.

''మంజూ!'' రెండోసారి పిలవడంతో, ఆమె

కళ్లు విప్పింది.

"మంజూ! నేను కన్యాకుమారి వెళ్తున్నాను. అక్కడి వివేకానందాశ్రమం"

ఆమెనుంచి ఏ జవాబూ రాలేదు.

అదే మౌనం...

కాస్సేపు ఆగాడు. ఆమెనే నిశితంగా చూశాడు దివ్యరామ్.

అతని మనసులో లాయర్ సుందరం మాటలు గింగురుమంటున్నాయి. 'ఇద్దరూ ఒకర్నొకరు కొంతకాలం కలవకుండా... ఎవరికివారు విడివిడిగా కొంతకాలం జీవించి...'

ఈ మంజూష అప్పటికి మాత్రం మారుతుందన్న గ్యారంటీ!

"ప్లీజ్ మంజూ! చెప్పు! వస్తున్నావుకదూ"

అదే నిశ్శబ్దం!

'నో! మంజూషని కాలమే మార్చాలి!' ఒక స్థిరనిశ్చయానికి వచ్చేశాడు దివ్యరామ్.

మరి తాను? శిథిలహృదయంతో... సంక్షుభిత మనస్కుడై విరాగిలా.

నెవ్వర్! తనకి వైరాగ్యం ఏమిటి? అనురక్తి లేకపోతే పోగాక! విరక్తి ఎందుకూ?

తనకిప్పుడు కావలసింది హృదయశైథిల్యం కాదు... హృదయనైర్మల్యం!

దాన్నే వెతుక్కుంటూ, ఆ అలౌకికానందాల అనుభూతుల దిశగా... మనశ్శాంతినివ్వలేని ఇండస్ట్రీలూ- బ్యాంక్ బాలెన్స్‌లూ డబ్బూ, బాధలూ- బంధాలూ, బంధుత్వాలూ కుహనా మర్యాదలూ- భేషజాలకు అతీతంగా... ఓ అద్భుత జీవనవైఖరి వెతుక్కుంటూ సాగిపోవాలి.

చకచకా బయటికి నడిచాడు దివ్యరాం.

★ ★ ★

రెండు వారాల అనంతరం-

తనస్థితేమిటో తెలుసుకుంది మంజూష.

దివ్యరామ్ లేకపోయాక, తన పరిస్థితి ఎలా వుంటుందో- ఈ రెండువారాల్లోనూ ఎదురైన అనుభవాలే, ఆమెలో అంతర్లీనంగా ఎక్కడో వున్న అసలైన గృహిణి మనస్తత్వాన్ని నిద్రలేపాయి.

కాని... ఏం ప్రయోజనం? అప్పటికే ఆలస్యం అయిపోయింది.

దివ్యరామ్‌ని తీసుకొని వెళ్లిపోయిన కారు, ఎన్నడో కన్యాకుమారి చేరుకొనేవుంటుంది కూడా!

బెడ్‌మీదపడి ఏడుస్తోన్న మంజూష... అశ్రుతప్త మంజూష. శోకసంకేతంలా వున్న మంజూష.

జీవితంలో తొలిసారి ఉద్విగ్నంగా దుఃఖభరిత అయింది.

స్వాభిమానం రెండుచోట్లా దెబ్బతిన్న తానెందుకింక?

ఆమెనోదార్చే శక్తి... ఆ ఎమోషన్ తగ్గించే సోర్స్ ఒక్క కాలానికి మాత్రమే వుంది.

అందుకే-

ఆమె, తన మనస్సుని మసుగెయ్యకుండా మరీ ఉరితీసి, వినోదించదల్చుకోలేదు.

హృదయ పరితాపాన్ని ఉపశమింపజేసేందుకు, కొంతవరకైనా అలజడిని చల్లార్చేందుకు, తన ప్రాణప్రియాతి ప్రియమైన కళారూపాన్నే ఎంచుకుందామె.

దివ్యరామ్ వెళ్లినరోజు సాయంత్రమే-

తమ బంగళాముందు... అపలేండ్స్ మీద ఎత్తుగా కనిపించేచోట వెలిసిందో బోర్డు- 'మంజూష ఆర్ట్ స్కూల్' అని.

కాని.

★ ★ ★

మోడరన్ పెయింటింగ్‌తోసహా, ఎవరేది కోరితే అది నేర్పించడానికి వీలుగా నోట్స్ తయారుచేసుకుంటోంది మంజూష.

బాల్కనీలోంచి స్ట్రీట్ డౌన్ స్పష్టంగా కనిపిస్తోందామె కూర్చున్నచోటికి.

గేటు బయట ఆటో ఆగిన శబ్దానికి తలెత్తి చూసిందామె.

ఓవర్‌మేకప్, చెమటలకి కరిగి కారిపోతూంటే, కర్చీఫ్‌తో అద్దుకుంటూ తన ఎనిమిదేళ్ల కొడుకుతో ఆటో దిగిన విమల ఫేర్ చెల్లించి, బోర్డువైపు ఓసారి చూసి కొడుకు భుజంమీద చెయ్యివేసి, లోపలికి అడుగుపెట్టింది.

కాలింగ్‌బెల్ మోగించి మరీ, లోపలికి వచ్చింది.




ఫర్వాలేదు... సంస్కారం, మేనర్స్ తెలిసిన ట్టే వున్నాయి.

ఒక్కసారి- ఆరోజు తాను కారులో లిఫ్ట్ ఇచ్చిన నాటి సంఘటన, తృటిలో కళ్లముందు మెదిలింది.

బెడ్‌రూమ్ దాటి, తానే మెట్లుదిగి హాల్లో కొచ్చింది మంజూష.

"నమస్కారమండీ" రెండు చేతులూ జోడించింది- కాస్త అతివినయం ఒలకబోస్తూ.

"గుడ్ ఈవెనింగ్. కూర్చోండి" తానూ విష్ చేసి కూర్చుంది మంజూష.

"మీ ఇంటి దగ్గర బోర్డు నిన్న సాయంకాలమే చూసేను. బాగా పొద్దుపోయిందిలెండి. అప్పుడే వస్తే ఏమనుకుంటారోననీ..."

"చూడండి విమలగారూ! మీకేం అవసరమో అది సూటిగా అడగండి. లేనిపోని ఆరాల జోలికెళ్లకుండా..."

"ఆс! ఆс! అదే! అదే! ఆర్ట్ వెయ్యడం మీరే నేర్పుతారా? దానికి ఏవయినా అప్లికేషన్ల లాంటివీ! అలాగే ఏజ్‌గ్రూప్ వగైరా... వివరాలు తెలుసుకుందామని" గొంతు పొడి ఆర్చుకుపోతున్నట్టు అడిగిందామె.

"ఫార్మాలిటీస్ అంటూ ఏంలేవు. ఇక్కడంతా ఫ్రీ. ఎవరైనా రావచ్చు."

"ఆс! అదే! తెలుసుకోడానికే! అన్నట్టు దివ్యరాంగారు ఊళ్లో లేరటగా!" హాలంతా కలియజూస్తూ అంది.

"ఆయనతో ఏమన్నాపని వుందా?"

"అహ! అబ్బే! ఊరకే అడిగాను. ఆయన లేకపోతే కాస్త ఎక్కువసేపు మీతో మాట్లాడొచ్చనీ!"

"ఆయన ఉంటే నాతో మాట్లాడ్డానికి మీకేం అభ్యంతరమా?"

"అదేంటండీ అలా అంటారు? పరాయిమగాళ్ల ఎదుటపడి మాట్లాడ్డమే?"

ఆమె ఎదగని మనస్తత్వానికి జాలిపడింది మంజూష.

"మీకా భయం అక్కర్లేదులెండి! మీరెంతసేపు మాట్లాడదల్చుకుంటే అంతసేపు మాట్లాడొచ్చు!" ఆమె వాగుడుకాయ అని గుర్తొచ్చిన మంజూష అంది.

"అయితే- నేను విన్నది నిజమేనన్న మాట"

"మనం విన్నవన్నీ నిజాలూ కాకపోవచ్చు. నిజాలన్నీ మనం వినకనూపోవచ్చు! ఇంతకీ ఏం విన్నారో చెప్పండి" చాలా ఈజ్‌గా అడిగింది మంజూష.

"మీరేమైనా అనుకుంటారేమోనని..."

"అనుకోడమేమిటి? అనడమూ చాతనవును నాకు"

"ఆс! అవునవును. ఇంతకీ దివ్యరాంగారూ- మీరూ మాటా మాటా అనుకున్నారటగా. అందుకే విడిపోయి ఆయన బైరాగిమఠంలో చేరిపోయాడనీ- మీరు కళని ఉద్ధరిస్తున్నారనీ..."

మంజూష భృకుటి ముడిపడడంతో, ఆగిపోయింది విమల.

"అహ! ఇలా అని నేనడంలేదు. అనుకుంటున్నారు జనం!"

"ఎక్కడ జనం?"

"అదేమిటండీ! లోకులు పలుగాకులు... ఒకచోటేమిటి? లోకం అంతా కోడైకూస్తుంటేనూ!?"

"వాళ్లకి మరేం పన్లేదా? అనుకోనీండి!"

"అబ్బా! మీతో మాట్లాడ్డం కష్టమండీ!"

"ఇదేమాట ఇందాకోసారి అన్నారు"

"ఈ విషయం ఇంతవరకూ మీదాకా రాలేదన్నమాట"

"ఏ విషయం?"

"అదేనండీ! మీరూ- మీ భర్తగారూ విడిపోయిన సంగతి లోకులు చెప్పుకోవడం!"

"ఇప్పుడొచ్చిందిగా! అయినా, మేం విడిపోయామని వాళ్లకెలా ఎవరు చెప్పారు?"

"ఇలాంటి విషయాలు ఒకరు చెప్పాలండీ! మీ చాదస్తం కాకపోతేనూ! పార్కుల్లో బీచ్‌లో, ఎవరికివారు, వాళ్లకి నచ్చినవాళ్లతో తిరిగేటప్పుడు..."

ఆమె మాట కట్ చేస్తూ "అప్పుడే పుకార్లు లేవదీసేశారన్న మాట... వెరీగుడ్! కాని మేం

విడిపోలేదు''

''ఇంకా ఎందుకు దాస్తారండీ! మీరెవరో మిలిట్రీవోడ్నీ... అయనెవత్తో బోగందాన్నీ...''

''గెటప్...! గెటప్ ఐసే... లేవండి ముందు!''

భయం భయంగా లేచి నిలబడింది విమల, మంజూష ఎర్రబడ్డ కళ్లని చూసి...

లేస్తూనే ''ఉన్నమాటంటే ఉలుకెక్కువంటా రమ్మా ఇందుకే! మీరు తిరగ్గా లేనిది, లోకు లంటేనే వచ్చిందా తప్పు? అయినా సంసారం అన్నాక లక్ష వుంటాయ్! సంసారపక్షంగా సర్దు కుపోవాలిగానీ...'' అనదల్చుకున్న మూడు ముక్కలూ అనేసింది విమల.

''ఇంటికొచ్చినవాళ్లపట్ల అమర్యాదగా ప్రవ ర్తించే పరిస్థితి కల్పించకండి! ప్లీజ్! దయ చేసి వెళ్లిపోండి! మీ కింతకు ముందొకసారి చెప్పినట్టు గుర్తు!- మీరు ఇతర్లపట్ల క్యూరియా సిటీ తగ్గించుకోండి''

''మర్యాదా! చాల్లెండి. అదేవుంటే మీరు వీధినెందుకు పడతారు? వస్తా'' వినవిసా అనేసి ''పదరా! ఇక్కడేం ఆర్టు నేర్చు కుంటావ్? పరాయివాళ్లకి హార్టు తాకట్టుపెట్టే వాళ్ళ దగ్గర...'' గురిచూసి మంజూష గుండెకి తగిలేంత సూటిగా అని, అంత ఫోర్సుగానూ, ఆ కుర్రాడ్ని లాక్కుని బయటకు జారుకుంది విమల.

స్టన్ అయిపోయి, అలాగే క్షణంసేపు వుండి పోయింది మంజూష.

కాస్సేపటి తర్వాత-

''ఎందుకు? ఎందుకు నాకీ చిత్రహింస??''

విమల మాటలు, అసలే గాయపడివున్న ఆమె మనసుని మరింతగా తూట్లు పొడవసా గాయ్.

'సంసారం అన్నాక లక్ష వుంటాయ్! సంసా రపక్షంగా సర్దుకుపోవాలిగానీ', 'మర్యాదా! అదేవుంటే మీరు వీధినెందుకు పడతారు?'

'పదరా! ఇక్కడేం ఆర్టు నేర్చుకుంటావ్- పరా యివాళ్లకి హార్టు తాకట్టుపెట్టే వాళ్ల దగ్గర...'

ఎంత లోకువ కట్టేసింది? తన ఇంటికే వచ్చి, తననిన్ని మాటలనడానికి ఆమెకంత ధైర్యం ఎలా వచ్చింది?

భర్తనీడ లేని ఆడదంటే, సాటి ఆడదాని క్కూడా అంత అలుసా?

మంజూష ఆలోచనలు తొలిసారిగా మరోకో ణంలోంచి ప్రసరిస్తున్నాయ్!

చూడబోతే- ఆమె ఆరా తీయవచ్చిన అమ్మ లక్కలాగే మాట్లాడినా, లోకరీతిని సూటిగా చెప్పి మరీ వెళ్లిందేమో.

మరి ఒకప్పుడు తానీ లోకాన్ని 'డోంట్‌కేర్' అన్నదేకదా!

బట్... అప్పటి స్థితివేరు. తానెలా ప్రవ ర్తించినా, దివ్యరామ్ తనతో వున్నాడు.

ఇప్పటి స్థితివేరు. దివ్యరామ్ దూరంగా ఎక్కడో వున్నాడు.

అందుకే...

అందుకేనా...? లోకులనోట నానుతున్న 'సు వ్వగింజ' బతుకైపోయిందీ!

తాను సంపత్‌పట్ల ఆకర్షితురాలైంది ప్రేమ తోనా? మోహంతోనా?

ఏది...? ఏది...?? ఏది...???

అలాగే నిస్త్రాణగా సోఫాలో వాలిపోయింది మంజూష.

★ ★ ★

గెస్ట్‌హౌస్ కమ్ వి.ఐ.పి. కాటేజ్.

టెర్రెస్‌మీద పారపెట్‌వాల్ పక్కన కుర్చీలో కూర్చొని సముద్రపుటలను చూస్తున్నాడు దివ్యరాం.

ఒడ్డుకొచ్చిన ప్రతి కెరటం ఒక్కొక్క స్మృతిని స్ఫురణకు తెస్తోంది.

మేఘాలు మాలకట్టినట్టు మబ్బుల వాతావ రణం.

ఉండుండి ఓ మలయమారుతం. నీటిమీ దుగా వీచేగాలి... మరొకప్పుడైతే అది ప్లెజెంట్ అట్మాస్ఫియరే!

కాని... ఇప్పుడు... బర్నింగ్ సెన్సేషన్ క్రి యేట్ చేస్తోంది.

చల్లటిగాలి... అగ్నికి వాయువు తోడైనట్లుగా దహిస్తోంది.

హృదయతాపం మరింతగా చింతను కలగ జేస్తుందట!




ఏ మనఃప్రశాంతతని తానాశించి ఇక్కడికొచ్చాడో, అది సమకూరకపోగా, పైగా మరింత తపన.

తప్త శరీరానికి ఎన్ని ఉపచారాలు చేసినా ఎదురుతిరుగుతాయి... మరి మండే మనస్సు సంగతి చెప్పేదేముంది?

ఊహలక్కూడా అందనంత వేగంగా మనస్సులో దృశ్యాలు మారిపోతున్నాయి.

'వెరీ ఫెంటాస్టిక్ వ్యూ! ఎవరి స్వప్న ప్రపంచం వాళ్లది!' అని నిర్లిప్తంగా- నిర్లక్ష్యంగా ఊరుకుని తానే పొరపాటు చేశాడేమో.

ధర్మ సంక్షోభంలో చిక్కుకున్నాడతడు.

తాను మనసుపడిన కాదంబిని.

తన మనసు నీడన స్వేచ్ఛగా ఎదిగిన మంజూష.

ప్రేమ సమీరంతో పులకింపజేసిన కాదంబిని.

బతుకు పూదోటలో విరబూచిన లిల్లీపుష్పం మంజూష.

ఒక తెరగా, తెమ్మరగా వీచి వెళ్లిపోయేదొకరు.

స్థిరంగా- సువాసనలు వెదజల్లుతూ నిలిచిపోయేదొకరు.

ఏది గట్టి బంధం? ఏది ఆత్మీయబంధం?? ఏది హృదయ సంబంధం???

సాంప్రదాయసిద్ధంగా జరిగిన వివాహంకదూ తమది!

పెళ్లినాటి ప్రమాణాల సంగతేమిటి?

'నాతి చరామి' అని ప్రతిజ్ఞచేసి, ధర్మేచ- అర్థేచ... మోక్షేచ... కామేచ ఆమెని విడిచి వుండనని వుండకూడదనికదూ వేదమంత్రాలు అంటాయి.

'అతిచరించను' అని మాటిచ్చి మరీ పాణిగ్రహణం చేసిన మంజూషని తానెలా వదిలి వచ్చేశాడు?

ఇక్కడికొచ్చి వారం రోజులవుతోంది.

కంటిమీద కునుకుందా...? ఆహారం హితవవుతోందా?

మరి- మంజూషస్థితే అగమ్యగోచరంగా వుంది.

ఏమిటి? ఆమె మనోసంచారం ఏమిటి?

ఆ విషయం తల్చుకోగానే దివ్యరాం హృదయం మళ్లీ అగ్నిగోళంలా భగ్గుమంటోంది.



ఆరోజు-

పగలంతా, ప్లెయిన్ బ్రౌన్ కలర్ హౌస్‌కోట్‌లో, నెత్తిమీద ముడితో... ఇల్లంతా బిజీగా కలయతిరుగుతూ, పనిచేస్తోంది మంజూష.

రాత్రి తొమ్మిదవుతోంది... చీరలోకి మారి ఒకసారి హాలు సర్దబోయింది.

కాలింగ్‌బెల్ మోగడంతో, చేస్తున్నపని ఆపి, వెళ్లి డోర్ తీసింది.

ఎదురుగా ఓ అపరిచిత వ్యక్తి.

ఆశ్చర్యంగా అలాగే నిలబడి చూడసాగింది మంజూష.

"లోపట్కి రానిస్తవ్..." మాటలో యాసనిబట్టి, అతడక్కడివాడు కాడని వెంటనే బోధపడింది. పైగా, కోటూ వెనక్కు దువ్విన క్రాపూ, కళ్లద్దాలూ, చేతిలో కర్చీఫ్... వెరశి- చూడ్డానికి హైసొసైటీ వాడిలాగా వున్నాడు. బహుశా ఫ్యాక్టరీలో దివ్యరామ్ లేడని తెలిసి, ఏ బిజినెస్ వ్యవహారమో మాట్లాడ్డానికి ఇల్లు కనుక్కొని ఇక్కడికి వచ్చుంటాడు. అప్పుడప్పుడు కొందరు డిస్ట్రిబ్యూటర్స్ అలా రావడం... ముఖ్యంగా సిస్టర్ కన్సర్న్సు పెట్టిన కొత్తలో ఒకరిద్దరు రావడం గుర్తొచ్చింది మంజూషకి. సభ్యతకోసం లోపలికి రానిచ్చింది

చలికాలం...




ఎనిమిదిన్నరకే, రోడ్డుమీద జనసంచారంలేదు.

'ఎవరీ అపరిచిత వ్యక్తి!? ఎవరైతే తనకేం? ఎంత దూరంనుంచి వచ్చాడో ఏమో! కనుక్కొని పంపేస్తే పోలా?!''

''దివ్యరామ్ లేరు''

''అవ్‌మల్ల!'' అదోలా నవ్వేడు- హాలు పరికిస్తూ.

''ఎప్పుడొస్తారో తెలీదు''

''తెల్సు! జర్ర తాగనీకి వేడిగా...''

నోరు తెరిచి అడిగినందుకైనా, అతిథిమర్యాద తప్పదని మెట్లెక్కి కిచెన్‌లోకి నడిచింది.

ఆమె కిచెన్‌లోకి వెళ్లగానే, అతడూ చకచకా మెట్లెక్కాడు- గ్యాస్‌స్టౌ వెలిగిస్తోంది మంజూష.

ఐదు నిమిషాల్లో వేడిగా టీ కప్పు ట్రేలోపెట్టి, కిందికి దిగబోయిందామె.

షాట్‌చేసి ''గీడున్నా'' అన్నాడు అతడు- ద్వారం దగ్గరగా వచ్చి.

అంతవరకు మంజూష గమనించలేదు అతడ్ని.

నవ్వుతూ, ఒక్కసారిగా ఆమె భుజం అందుకున్నాడు. ఉడుంపట్టు అతడిది. ట్రే వదిలేసి కెవ్వున కేకవేసింది మంజూష.

కానీ... ఆ రాత్రి... ఆ బంగళా మేడమీద... ఇరుగు పొరుగులతో సంబంధం లేనట్టున్న ఆ ఇంట్లో ఏం జరిగేదీ బయటివాళ్లకేం తెలుస్తుంది?

మెట్లమీదుగా దొర్లుకుంటూ టీ కప్పు పగిలిపోయింది.

''యమా రంగుగున్నావె పోరి! సీమ బాదంపప్పులూ- బత్తాయిలూ తెగతిని బలిసినట్లున్నవ్!''

''దుర్మార్గుడా! నన్నొదులు! ఉండు నీపని చెప్తాను!'' ఓ పక్క పెనుగులాడుతూనే అరుస్తోంది మంజూష.

''ఏం జెప్తవ్! పని నేనే జేస్త!'' ఒక్క చేత్తోనే, ఆమెని బెడ్‌మీదకి నెట్టుకొచ్చాడు. బలంగా ఒక్కతోపు తోసేసరికి ఆమె వెల్లకిలా మంచంమీద పడింది.

చీర స్థానభ్రంశం చెందడంతో, ఆమె వక్షం అనాచ్ఛాదితమైంది. మెరుపుగా జాకెట్‌మీద అతని చెయ్యివడింది. మరోచెయ్యి ఆమె కుచ్చెళ్లమీద వుంది.

మళ్లీ కేకపెట్టింది ఆర్తిగా మంజూష.

కానీ... అరుపులు ఆ కాంపౌండ్‌వాల్ దాటి బయటికి రావని ఇద్దరికీ తెలుసు!

బలంగా గుంజడంతో కుచ్చెళ్లు ఊడిపోయి, చీర మొత్తం అతడి చేతిలోకొచ్చింది. కేవలం జాకెట్, పెట్టీకోట్ మాత్రమే వున్నాయి ఆమె వంటిమీద.

నమ్ స్ప్లిట్ ఆఫ్ సెకెండ్స్...

ఇహ తన మానం మంటగలిసిపోతుందనుకున్న తరుణంలో-

అతడు కర్కశంగా తనని అణిచేసి, పూర్తిగా వివస్త్రని చేసెయ్యబోయేంతలో.

ఛక్... ఛక్!! ఛక్!!! మంటూ, ఆ పశువు మెడమీద, చురకత్తుల్లా ఓ బలమైన మోచెయ్యి వేట్లు... మంజూష తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది.

దెబ్బకి నరాలు కలుక్కుమన్న ఆ డర్టీఫెలో, మెడ పైకెత్తడంతో ''ఓహో! నువ్వా ఆర్.ఎం.పీ! నీ ముచ్చుమొహానికి దేవత లాంటి మంజూష కావల్సివచ్చిందిరా బెంటు వెధవా! నీ అంట్లబుద్ధికి చీప్‌రేటు సివాచెలం రోడ్ వుండనే వుందిగా'' ధన్ ధన్ ధన్‌మని మెరుపుదెబ్బలు కొట్టసాగాడు అతడు.

మత్తు తలకెక్కుతున్న డాక్టర్ శోభనాద్రి పడుతూ- లేస్తూ ''నీ కాల్మొక్త! దండబెడ్త! నన్నేం జెయ్యకు బై'' అని చేతులు జోడిస్తూ మెట్లమీదుగా జారుకుంటూ దొర్లుకుంటూ బైటికి పారిపోయాడు.

ఎడ్మైరింగ్‌గా చూస్తూ- ''నువ్వా తరుణ్! ఐ విల్ బి వెరీ థాంక్ ఫుల్ టూయూ! నువ్వే గనక రాకపోతే, నేనీపాటికి ఆ దుర్మార్గుడి చేతిలో'' గొంతు గాద్గదికమై, మాట్లాడలేకపోయింది మంజూష.

''ఓ.కె. ఇట్సాల్‌రైట్ మేడమ్! నాదేముంది? ఆ భగవంతుడు మీయందున్నాడు. లేకపోతే నేనిలా రావడం తటస్థించేదికాదు. బైదిబై నేనీ రాత్రిపూట ఇక్కడికెందుకు వచ్చానంటే...''

''నిజం తరుణ్! కేవలం నన్నీ ఆపద



నుంచి రక్షించడానికే వచ్చావ్''

ఆమె కళ్లల్లోంచి మళ్లీ కురుస్తున్న ప్రశంసల వర్షం.

''అదిసరే మేడమ్! నేను నిజంగా 'సారీ' చెప్పడానికి వచ్చేను'' సిన్సియర్‌గా అంటున్న అతడ్ని విస్ఫరింగ్‌గా చూస్తున్నది మంజూష.

''అరె! ఓహెూ! నన్నిలాంటి స్థితిలో చూడవలసివచ్చినందుకా?''

''కాదు మేడమ్! మా మిసెస్, నాల్రోజుల కిందట ఇక్కడికొచ్చి మరీ మిమ్మల్ని హర్ట్ చేసినందుకు. ఆమె తరపున మీకు సారీ చెప్పడానికి వచ్చాను''

''ఆవిడ హర్ట్ చేసిందని ఎవరు చెప్పారు?''

''ఇందాక- ఆరుగంటలకి ఫ్యాక్టరీనుంచి ఇంటికొచ్చాక, అలా రిలాక్సయి డాబామీద కూర్చుంటే, మాటల సందర్భంలో తానే చెప్పింది మొత్తం సంభాషణంతా! కాస్త పల్లెటూరి బుద్ధులున్నాయ్! ఆమె మాటలు పట్టించుకోకండి! ఆమె తరపున నేను క్షమాపణ చెప్దామని వచ్చేను''

''మిస్టర్ తరుణ్! మీ సంస్కారాన్ని నిజంగా అభినందిస్తున్నాను. ఏదో మెరమెచ్చుమాటగా కాదు. నిజంగా మీలాంటి సంస్కారవంతులుండబట్టే, మాలాంటివాళ్ల మానప్రాణాలకు రక్షణ వుంటోంది. ఇంతకుముందు మీరు ఫ్యాక్టరీలో ఓ పెద్ద ప్రమాదంనుంచి రక్షించినందుకు దివ్యరాం ఫంక్షన్‌చేసి మరీ ఫెలిసిటేట్ చేశాడు. నేనిప్పుడలా చెయ్యలేకపోయినా, ఇలా తియ్యగా గుర్తుండిపోయేలా'' అంటూ అతని చెయ్యి పట్టుకుని ఊపేస్తూ షేక్‌హ్యాండ్ ఇచ్చి, ఆ చేతిని అలాగే పెదవుల దాకా తెచ్చి అంటీఅంటనట్లుగా ఓ కిస్ ఇచ్చింది మంజూష. ''ఏ బెస్ట్ అప్రిసియేషన్ విత్ సిస్టర్లీ లవ్! ఓ.కే?!'' అంది చిర్నవ్వుతో.

తలవూపి, ''మరి నేవెళ్లిరానా?'' అన్నాడు తరుణ్.

పెదవులు విడీవిడనట్లుగా నవ్వింది మంజూష.

''ఏం అనుకోనంటే ఓ బ్రదర్‌హుడ్ సజెషన్... దివ్యరామ్‌గారిని ఓ వారంరోజుల్లో ఇక్కడికి రప్పించండి! ఆయన లేని ఫ్యాక్టరీ... గెస్ట్‌హౌస్ ఛాంబర్ అన్నీ బోసిపోతున్నాయ్!''

రెప్పవాల్చకుండా అతడు వెళ్లినవైపే చూస్తుండిపోయింది మంజూష.

''అవును తరుణ్! నువ్వు చెప్పింది అక్షరసత్యం. కేవలం ఫ్యాక్టరీ మాత్రమే కాదు. ఈ బంగళా ప్రెమిసెస్ మాత్రం?! ఏదో కోల్పోయినట్లులేదూ? జీవకళ లేకుండా నిస్తేజంగా వున్నట్లు లేదూ!?''

మంజూషలో ఆత్మవిమర్శ ప్రారంభమైంది.

అంతరాంతరాల్లో అనుశీలన ఆకృతిదాల్చింది.

★ ★ ★

సాలోచనగా మంజూషనే నిశితంగా పరిశీలిస్తున్నాడు డాక్టర్ సాధూ. తానామెను నెల్లాళ్ల కిందట, నెర్వస్ కండిషన్లో చూశాడు. అప్పట్నుంచీ- ఆమె మానసికస్థితిని గమనిస్తూనే వున్నాడు.

ఇప్పుడామె శారీరక స్థితిని కూడా అబ్జర్వ్‌చేస్తూంటే, ఆమె దైన్యస్థితికి అతడి హృదయం కూడా ఆవేదన చెందుతోంది.

ఎప్పుడూ కాంతివంతంగా చురుగ్గా మెరిసే ఆ కళ్లకింద నల్లని వలయాలు.

కళతప్పిన మొహంలో, సదా నిలబడిపోయిన కలవరపాటు.

పసిమిరంగు శరీరం పాలిపోయినట్టు.

నడకలో, మాటలో ఏదో తత్తరపాటు.

కాన్ఫిడెన్షియల్ మేటర్స్ మాట్లాడాలని మంజూష ఫోన్ చెయ్యడంతో వచ్చిన డాక్టర్ సాధూ, ఆమె మాట్లాడే ప్రతిమాటనీ ఆచితూచి అంచనా వేస్తున్నాడు. అత్యంత శ్రద్ధగా ఆమె కండిషన్ కనిపెడుతున్నాడు.

''అయినవాళ్ల అండలేని ఆడదంటే, అర్భకుడి క్కూడా ఆమెమీద కన్నే! ఛ! ఛ!'' మంజూష తనమీద జరిగిన అత్యాచారయత్నం చెప్పి ఆఖర్న అంది.

కోపంతో పళ్లు బిగునుకున్నాయ్ డాక్టర్ సాధూకి.

''వాడు మా మెడికల్ ప్రొఫెషన్‌కే మచ్చతెచ్చే చీడపురుగులా తయారయ్యాడమ్మా! ఏం చేస్తాం? నడమంత్రపుసిరి వాణ్ణిలా కన్నూమిన్నూ కానకుండా చేస్తోంది'' కసిగా అన్నాడు.





"నో! డాక్టర్! దివిపట్ల నేను చేసిన అపచారమే కావచ్చు! నా పాపపు తలపే నన్నిలా శాపంలా వెంటాడుతోందేమో! అటువంటి దివ్యమైన మనిషిని వంచించానేమో!" రుద్ధ కంఠంతో అంది మంజూష.

" నేనో అలా ఎందుకనుకుంటున్నావ్ మంజూషా? నువ్వేమీ హద్దుమీరి ప్రవర్తించలేదుగదా!"

"హద్దు అనేది దేనికి? ఎక్కడివరకూ వుంది ఆ రేఖ? భార్యాభర్తల బంధం మధ్య మూడోవ్యక్తి ప్రవేశించనంతవరకూ అంటారు కొందరు. ప్రవేశించినా మాటలవరకూ ఫరవాలేదంటారు కొందరు. మాటలేకాదు. విహారాలవరకూ ప్రాబ్లెం లేదంటారు మరికొందరు. విహారాలతోపాటు ముద్దులూ- కౌగిలింతలూ కూడా తప్పు కావంటారు ఇంకొందరు. అట్‌మోస్ట్ స్టేజ్- ఇద్దరి శరీరాలూ ఏకం కావడం చివరిహద్దా?"

"నో! అదీ డోంట్‌బాదర్ అనేవాళ్ళున్నారు. ఊ! నీ కాశ్చర్యంగా వున్నా లేకపోయినా అలాంటివాళ్ళని నేనెరుగుదును" ఆగాడు సాధూ!

"మరి- మీరన్న హద్దు దేంట్లో? ఎంతవరకూ?" ఆశ్చర్యంగా అడిగింది మంజూష.

"క్యారెక్టర్‌లో... యస్! తెలుగులో చెప్పాలంటే, స్వచ్ఛమైన సౌశీల్యంలో. అదే వ్యక్తుల జీవితాలకి ఆలంబన. అదే ఉద్దీపన. అదో సంఘధర్మం. ఓ కట్టుబాటు మాత్రమే కాదు! రుజుమార్గ ప్రేమకి- నిర్మలమైన ప్రేమకి స్కేల్. అదే సరిహద్దు. ఆ హద్దు లేకపోతేనే సాంప్రదాయాలు సైతం చిన్నాభిన్నమైపోతాయ్! మన భారతీయ సాంప్రదాయం అందుకే అంత సమర్థవంతమైంది. ఇక్కడి స్త్రీ హృదయంలో ఒక్క భర్తకే సముచితస్థానం అత్యున్నత పీఠం వుంటుంది"

తానెక్కడ మిస్సయిందో క్రమంగా అర్థమవుతోంది మంజూషకి.

"ఇక్కడి వనితకి పెళ్లితో ముడిపడిందే జీవితం. వైవాహికబంధమే పరాకాష్ఠ. అంతే! అంతవరకూ గాజుపలకలా పారదర్శకంగా వున్న హృదయం ఫ్రేమ్‌డ్ మిర్రర్ అయిపోతుంది. ఆ మనోదర్పణంలో చెరగని చెదరని భర్తరూపమే ప్రతిష్ఠితమవుతుంది"

"యూ ఆర్ కరెక్ట్ డాక్టర్! ఆ హద్దు మీరి ప్రవర్తించానేమో అని నాకనిపిస్తోందిప్పుడు"

"ఎప్పుడు? ఎలా?"

"యుక్తాయుక్తవిచక్షణ గలిగిన సైకాలజిస్టులు మీరు... మీ దగ్గర దాచనవసరంలేదు. దివ్యరామ్‌కి మాత్రమే అందించవలసిన ప్రేమానురాగాలు అపార్థాల సుడిగుండంలో పడి దారితప్పి ఎక్కడెక్కడికో పయనించాయి. ఫలితం- అవి వేరేవాళ్లతో పంచుకోవడంలో ఆనందం పొందాను. నో...! పొందాననుకున్నాను"

మంజూష కళ్లవెంట అప్రయత్నంగా అశ్రువులు.

అంతలోనే తేరుకుంటూ- "తప్పు కేవలం నాదనీ చెప్పలేను... ఇందులో దివికీ భాగంవుందనిపిస్తోంది"

"నేనంగీకరించను మంజూష! దివ్యరామ్ నీకన్న ముందునుంచీ నాకు తెలుసు! సో... సీనియార్టీ నాది! అదలావుంచు! నీకోసం నీ హృదయాన్ని అర్థం చేసుకోవడంకోసం అతడెన్ని అహోరాత్రులు ఆవేదన అనుభవించాడో, ఓ ప్రాణమిత్రుడిగా నాకు తెలుసు!"

మౌనంగా తల వంకించింది మంజూష.

"కాదనను! నాకు స్వాతిశయం ఎక్కువే! నేను పెరిగిన వాతావరణం అలాంటిది. నాకా స్వేచ్ఛనీ ఇచ్చాడు దివ్యరాం! దాన్ని నేనే దుర్వినియోగం చేశాను డాక్టర్! నేనే చేజేతులా ఓ భ్రమలో..." మంజూష మాట్లాడలేకపోతోంది.

"ఓ.కే. ఓకే. పశ్చాత్తప్తవవుతున్న నీ హృదయంలో ఇక సంక్షోభానికి స్థానం వుండదు మంజూ! బీ ఫ్రెష్"

"సంక్షోభం వుండదేమోగాని సంపూర్ణత్వం ఎలా వస్తుంది డాక్టర్! మళ్లీ నా దివి నా దగ్గరకు చేరితేగదా! స్వదోషాన్ని తన సరళ స్వభావంతో మన్నించగలిగే అతని సద్గుణమే నాకు దిక్కు! అతడి మృదుమానసమే నాకు శ్రీరామరక్ష కాదూ!"

నిలువుగా తలూపాడు డాక్టర్ సాధూ సాలోచనగా.

"డాక్టర్! నాకో సహాయం చెయ్యండి. అది మీ వల్లనే సాధ్యమవుతుంది!"

"ఏమిటో చెప్పు మంజూ!"

"నా దివిని... నా రామ్‌ని నా దగ్గరకు చేర్చండి ప్లీజ్! డాక్టర్! మీకు జీవితాంతం రుణపడివుంటాను" అప్రయత్నంగా చేతులు జోడించింది మంజూష.

కదిలిపోయాడు డాక్టర్ సాధూ!

"ఛ! ఏమిటిది మంజూ! నువ్వింత ఇదిగా అడగాలా? అది నా కర్తవ్యంగా భావిస్తాను. కాని ఒక్కటే సందేహం... ఇందులో థర్డ్ పర్సన్ ఇంటర్ ఫియరెన్స్ అంత మంచిదా? అని..."

"థర్డ్ పెర్సన్ ఎక్కడినుంచో వచ్చిన బయటివాళ్లు కాదుగా డాక్టర్! ఇద్దరికీ ఆత్మీయులు... పైగా సైకాలజిస్టులు"

"రైటే... దివ్యరామ్‌ది పెక్యూలియర్ మెంటాలిటీ మంజూషా! నేనే ఏదో ప్రెషరైజ్ చేసి రాయబారం నడిపినట్టు ఫీలైతే కష్టం"

నిరాశపడిపోయింది మంజూష.

"మరి దారేది డాక్టర్?"

"నా ఆలోచన సాగుతున్నదీ ఆ దిశగానే! డోంట్‌వర్రీ! అఁ!... ఓ అపాయింట్‌మెంట్ వుంది! నాకిక శెలవా?" వాచ్ చూసుకుని లేస్తూ అన్నాడు సాధూ.

గేటువరకూ సాగనంపి, దీనంగా మరోసారి "ఈ మంజూషని మీ కేర్‌టేకింగ్‌లోంచి..."

"నెవ్వర్! మంజూష నాకు పరాయిది కాదు. నా సోదరి"

డాక్టర్ సాధూ కారు అప్‌లేండ్స్ మలుపు తిరిగింది.

★ ★ ★

స్టాండ్ కమర్చిన కాన్వాస్‌మీద చకచకా కదుల్తున్న బ్రష్‌లు.

తదేకదీక్షతో దివ్యరామ్‌ని చిత్రిస్తోంది మంజూష.

ఒక మృదు సమీరం... ఒక మలయపవనం చేరువలో పదిలంగా రాసుకుంటూ వెళ్లిపోయిన అనుభూతి.

వెళ్లిపోదా మరి!?

ఈ ప్రణయపర్వంలో తన నిరాదరణ ప్రమేయమే ఎక్కువభాగం వుందికదూ!

ఒకనాటి దివ్య హృదయరాణి... నేడు పరాజిత... శిథిల హృదయ... లోకం దృష్టిలో అపరాధి.

అన్నీవుండి- ఏమీలేక, ఏమీలేని స్థితిలో ఏకాకిగా... నిరాలంబనగా...

ఆమె నయనాల అరుణకాంతులు ప్రతిఫలిస్తున్నాయ్... ఆందోళిత మనస్కురాలు...

వెచ్చని నిట్టూర్పులామె నాసికని కంపింపజేస్తున్నాయ్.

సూక్ష్మమైన సూదికొనమీద నృత్యం చేస్తోందామె సున్నితహృదయం.

తూట్లు పడ్డచోటల్లా రక్తధారలు అలుముకొని, పునీతమైపోతూన్న మానసం.

"నీ ప్రేమామృత స్వరంతో నా మనోద్వారాలు తెరువు దివీ!"

ఆమె పరితాపం నిప్పురవ్వలుగా ప్రారంభమై, ప్రస్తుతం జ్వలిత జ్వాలగా... మనస్సున్నచోటనేగదా మథనం.

దివ్యరామ్‌ని తృణీకరించిన, నిరాదరణకు గురిచేసిన మంజూష నిలువునా దహించుకుపోతోంది.

దివీ! నా రామ్! ఎక్కడున్నావ్ నువ్వు...

కఠిన హృదయుడివి కావు నువ్వు!!

అనురక్తి లేనివాడివి కావు నువ్వు!!!

చిరుగంటల శబ్దంలోంచి దివ్యరాం తొంగి చూస్తాడు.

క్షణం కూడా ఆలస్యం చేయకుండా తానతన్ని అల్లుకుపోతుంది.

మళ్లీ తననుంచి పారిపోనీయకుండా తనలోని ప్రతి అణువునీ అతడితో నింపేసుకుంటుంది.

ఎన్నిసార్లో! దివ్యరాం తన లాలనని కాంక్షించేడో!

ఒక్కసారైనా కనీసం ఓన్లీ వన్ టైం... తానావిధంగా ప్రవర్తించడానికి ఇష్టపడిందా?

పైగా తానెన్నోసార్లు అనుకొనేది.

"అడ్డంకుల్ని ధైర్యంగా ఎదుర్కొంటూపోలేక, ఎక్కడికక్కడ వానపాముల్లా చుట్టుకుపోతూ గడిపేసే జీవితమూ ఓ జీవితమేనా?




ఇన్నాళ్లూ ఈ వానపాముతో ఎలా గడుపుతోంది? ఏమిటో- అంతా అన్‌సూటబిలిటీ... లైఫ్ ఈజ్ ఫుల్ ఆఫ్ కాంట్రడిక్షన్స్. అనవసరపు సర్దుబాటు జీవితాలు...''

కానీ- లోపం తనలోనేవుంది. తన ఒపీనియన్‌లోనే వుంది.

అసలా పోలికకీ, అతని ప్రవర్తనకీ పొంతనే లేదు.

ఇన్నాళ్లూ ఎంత అసంబద్ధంగా ఆలోచించింది తాను?

భావావేశపు సుడిగాలుల్లో, ఏ సుదూర తీరాలకో కొట్టుకుపోయిన దివ్యరామ్ దివ్యస్వరం మళ్లీ వినిపిస్తుందా...?

★ ★ ★

సముద్రజలాలు వివేకానందరాక్‌ను అలలు-అలలుగా తడుతూన్న నయనమనోహర దృశ్యం...

వెన్నెల్లో స్వచ్ఛంగా మెరుస్తూన్న ఇసుక...

చిన్న కూనిరాగంతో సాధూ నడుస్తూంటే, మహా మౌనమూర్తిలా నడుస్తున్నాడు దివ్యరామ్.

తడిగా వున్న ఇసుకదిబ్బలమీద నడుస్తూ, ఓచోట కూర్చున్నారిద్దరూ.

నిశ్శబ్దంగా సముద్రంఒడిలో కలిసి కరిగిపోతూన్న వెన్నెల...

నిర్మలాకాశంలో దేదీప్యమానంగా ఒకతార వెలుగుతోంది....

అది తార కాదు... వీనస్... ప్రేమకు సంకేతం.

''ఇప్పుడు చెప్పు దివ్యరాం!'' మౌనాన్ని ఛేదిస్తూ అన్నాడు డాక్టర్ సాధూ!

ఏం మాట్లాడలేదు దివి.

వెయ్యి లంకణాలు చేసినవాళ్లా దిగులుగా... జాలిగా... దీక్షగా ఎటో చూస్తున్నాడు.

''ఏమిటంత దీక్షగా చూస్తున్నావ్?''

''ఏళ్లతరబడి- అలా సముద్రంలో కలుస్తూనేవుంది వెన్నెల. దానికి అసలు తృప్తి అనేది వుందా?''

''కవివెప్పుడయ్యావ్ దివీ?'' ఆశ్చర్యపోయాడు సాధూ...

మెరుపుల్లా కదుల్తున్న ఆలోచనల్ని ఓ ఆర్డర్‌లో పెడుతూ మళ్లీ తనె అన్నాడు- ''ఓయ్ కవిహృదయమా! నీ కవితా పరిభాషలోనే తిరిగి ప్రశ్నిస్తున్నాను. ఈ సముద్రపు హోరులో మంజూష తియ్యని గొంతు విన్పించడంలేదూ?''

''వద్దు సాధూ! ఏం చెప్పొద్దు! నిరంతరం ఎక్కడా ఆగకుండా- గలగల ప్రవహించే సెలయేరులాంటిదనుకున్నాను సాధూ! కాని ఆమె గలగలలు నా కోసం కాదని... ఛ! నిజంగా ఏమిటో ఈ ఆడాళ్లు! కాదంబినీ అంతే! ఆమె కలయిక ఓ మధురస్వప్నం! చేజారిన స్వప్నం...!''

బ్లాంక్‌గా ఉంది దివ్యరాం ముఖం.

డాక్టర్ సాధూకి అతని ముఖం చూడ్డానికే భయం వేస్తోంది...

''ఇన్నాళ్ళూ ముళ్ళమీద గడిపిన ఈ జీవితానికి గుడ్‌బై కొట్టేసి, అలౌకికానందాన్ని పొందుదామని వచ్చాను. ఇక్కడా వెంటాడి వేధిస్తున్న జ్ఞాపకాలు... ఎందుకు? డబ్బూ! పదవీ! హోదా! అంతస్తూ! దేనికివన్నీ? ఏంచేసుకోను సాధూ? మనశ్శాంతి లేకపోయాక...''

''ఎన్ని జీవితాల్నో, ఎన్ని మనస్తత్వాల్నో చూశాను నేను. కాని నీలా పలాయనవాదాన్ని జపించేవాళ్ళని చూళ్ళేదు'' సాలోచనగా అన్నాడు సాధూ.

''ఇప్పుడు చూస్తున్నావుగా!''

''ఎందుకు చూడ్డంలేదూ? నిరంతర విద్యార్థినైన నాకీ ప్రపంచాన్ని మించిన విశ్వవిద్యాలయం వుందా? మా జీవితాలేకదా మీకు లెసన్స్''

''అసలు నా తప్పేంటి చెప్పు సాధూ! మా వివాహానికి ముందే నా హృదయకుసుమాన్ని ఆమె పదాంకితం చేశానే! నా జీవన భాగ్యరాశిగా, నా మానసపేటికగా మంజూషని చిత్రించుకున్నానే! ఇంకా ఇంకేం చెయ్యాలి?''

ఎక్కడో ఏదో అపశృతి వినిపిస్తోంది.

ఆనందాంతరంగితం కాకున్నా ఓ మధుర గాన తరంగంలానైనా మారితే!? సరిచెయ్యబడలేని రాగం కాదుగదా!

"స్త్రీలు ప్రేమైకమూర్తులు దివీ! కొందరు వివాహాన్ని పెద్ద అడ్డంకిగానూ భావించినవాళ్ళున్నారు. అలాగని ఎవరితోపడితే వారితే యాంత్రికంగా కొట్టుకుపోరు! అన్నివిధాలా నచ్చిన పురుషుడికి, తమ ప్రేమైక భావనను సంపూర్ణంగా అర్పించుకుంటారు. ఇక్కడ దేహమా! మనస్సా! అనే సందేహం అనవసరం! ఆ ప్రసక్తే వద్దు! ప్రేమలోని ఫ్రీనెస్‌ని, విల్లింగ్‌నెస్‌ని శారీరకవాంఛకింద జమకట్టేస్తే అర్థంలేదు!"

"సైకాలజీలో థీరిటికల్‌గా ఎన్నయినా చెప్తారు మీ డాక్టర్లు!"

"పొరబడుతున్నావ్ దివీ! సైకాలజీ ఈజ్ నాట్ ఎ ఫిక్షన్. దీనికి అస్తిత్వం వుంది. మానవ జీవితాల్లోంచే విభిన్న మనఃప్రవృత్తుల్లోంచే సజీవంగా ఉద్భవించిన శాస్త్రం ఇది. ప్రమాణాలతో సహా ఎన్నో ఆధారాలు చూపించొచ్చు! అంతేకాదు! ఈ నిజం కూడా విను. మంజూష ప్రస్తుతం చాలా సెన్సిటివ్‌గా ఫీలవుతోంది.

"బావుంది నువ్వనడం! నేనామెను ఇల్ ట్రీట్ చేశానని భావిస్తున్నావా?"

"నో! నో! అలాక్కాదు! ఎందుకంత అప్‌సెట్‌గా, అనహనంగా వుంటోందో ఏనాడైనా లాలనగా ఆరా తీశావా?"

"ఆమెకే మానసిక జాడ్యమూ లేదే! అంతా ఆమె భ్రమ"

"అంటే?"

"ఏమీలేదు! ఏదో వున్నట్టు ప్రవర్తించడం!"

"మళ్ళీ పొరబడుతున్నావ్ దివీ! అది ఆమెకి చేతకాదు!"

"రాయబారానికొచ్చినవాళ్ళు అలాగే అంటార్లే!"

"అదుగో! మళ్ళీ పొరబడుతున్నావ్"

"పొరబడుతున్నది నేనా! నువ్వా? నీ యింట్లోంచేకాదు, నీ జీవితంలోంచే వెళ్ళిపోతున్నాను అని ఒకప్పుడు అంది మంజూష. అన్నంతపనీ చేయడానికి వెనుకాడిందా? ఆ రాత్రి మనం వెతికి వెతికి వేసారి, నెర్వస్ కండిషన్లో వున్న మంజూషని చివరిక్షణంలో నీ ట్రీట్‌మెంట్‌తో... ఏం? అదంతా మర్చిపోయావా?"

"సరైన పాయింట్‌కే వచ్చావ్! నిజంగా అలా చెయ్యగలిగిందా? తాను నీ జీవితంలోంచే తప్పుకోదలిస్తే నీ ప్రెమిసెస్‌లోకి మళ్ళీ ఎందుకొస్తుంది? ఏదో అశాంతిలో పిచ్చిపిచ్చిగా ప్రవర్తించి, ఆరోగ్యంమీదికి తెచ్చుకుంది. అంతే! లక్కీగా మనం అక్కడే వుండడంతో వెంటనే ట్రీట్‌మెంట్ అంది మనిషిలో కంలో పడింది"

"పోనీ! అలాగే అనుకుందాం. తర్వాతైనా నన్నెంత టార్చర్ చేసింది. ఉలుకూ, పలుకూ లేకుండా!"

"అదే వచ్చిన చిక్కు! ప్రతి మనిషిలోనూ తనకి తెలీకుండానే ఎంతో కొంత హింసావినోదం దాగివుంటుంది. అయితే అది వివిధస్థాయిల్లో వుంటుంది. ఒప్పుకో! మానెయ్! నిజం అది! తక్కువ డోసేజీలో వుంటే తగువే లేదు. మోతాదు మించితేనే ప్రమాదం. ప్రవర్తన చిత్రంగా వుంటుంది. నిర్లక్ష్యం చేస్తే ఫలితం విపరీతంగా వుంటుంది. ఓ మానసిక వికారం, పిచ్చిపిచ్చిగా ప్రవర్తించడానికి ఆస్కారం... చుట్టూ సిట్యుయేషన్సే కల్పిస్తాయి"

అర్థమయీ అవనట్టుగా వుంది దివ్యరామ్‌కి.

"అసలు నీకో విషయం తెల్సా దివ్యరాం! తన భర్తమీద సంపూర్ణమైన అధికారం సదా వుండాలని, తన కనుసన్నల్లో పతిదేవుడు సదా మెలగాలని ప్రతి స్త్రీ అంతరంతరాల్లోనూ దాగి వుండే కోరిక!"

విస్మయంగా చూస్తున్నాడు దివ్యరాం.

"అవును దివీ! లేడీస్ సైకాలజీమీద ప్రముఖ ఆంగ్లరచయితా, మనస్తత్వవేత్తా అయిన ఛాసర్ సిద్ధాంతం అది. మంజూ విషయంలో అది సరిగ్గా అన్వయిస్తుంది. ఒక సుకుమార ప్రేమలతిక, కఠినాతి కఠినమైన భర్తృమానసిక నిరాదరణ అనే పదఘట్టన కింద దారుణంగా నలిగిపోయిందిన్నాళ్ళూ!"

"నిజమే సాధూ! ఒక్కొక్కసారి లోపం నాలోనే ఉందేమోననిపిస్తూంటుంది నాకు! కాదంబిని మోజులో, మోహంలోపడి నా గుండె గదిని ఖాళీచేసుకున్నాను. సో... చాలాకాలం





ఉపయోగించకుండా వదిలేసిన గది ఎలా వుండాలో అలాగే వుంటుందిమరి!''

అతని నుదుట స్వేదబిందువులు... అంత శీతలంలో కూడా!

''నాచు పట్టిన చెరువునీరులాంటి జీవితం. ఆ నాచు బెడదనుంచి తప్పించి నీటిని స్వచ్ఛంగా చెయ్యడానికి కొన్ని చిరుచేపలుంటాయిట! వాటికా నాచే ఆహారం! మీ ఇద్దరి జీవితాల్లోని అనుమానాలనే నాచుని నేను గ్రహించేస్తే మిగిలేది స్వచ్ఛతేకదా! నీ మనోనేత్రంతో చూసి ఏది కర్తవ్యమని తోస్తే అదే చెయ్!''

''నిజం సాధూ! ఇప్పుడు అన్ని అనుమానాలూ, ఆవేదనలూ పటాపంచలయ్యాయి'' దీర్ఘంగా నిశ్వసించాడు దివ్యరాం.

'నన్ను క్షమించమని అడిగే అర్హత కూడా పోగొట్టుకున్నానేమో మంజూ!' గుండెను నులిమేస్తున్నట్టు, ఊపిరాడకుండా నొక్కేస్తున్నట్టు... గొంతు దాటి మాట బయటికి రావడంలేదు.

ప్రశాంతంగా దరహసించాడు డాక్టర్ సాధూ

★ ★ ★

తెల్లని చీరలో, అదేరంగు చోళీలో వెన్నెల కిరణంలా మంజూష...

ఫుల్ వైట్ మూన్‌లైట్‌లో తళుక్కుమని మెరుస్తోంది ఆమె మెడలోని మంగళసూత్రం.

ఆ వెన్నెల్లో సుధాబిందువులు చిందినట్లు, ఆమె వదనంలో దరహాస చంద్రికలు...

కొంతకాలంగా పాలిపోయినట్టు తెల్లగా మారిన పెదాలమీద మళ్ళీ ఎర్రదనం, కెంపు ఎరుపు.

ప్రేమసముద్రంలో స్నానం చేసి వచ్చినంత స్వచ్ఛమైన భావన...

శరీరంలోని అణువణువూ ఆనందంతో, తాదాత్మ్యంతో నిండిపోతోంది. ఏ జన్మలోనో ఏదో శాపవశాన అలా జరిగింది. వేదన అంతమైంది. మళ్ళీ తనలోని వ్యక్తిత్వాన్ని నిద్రలేపుతున్నాడు దివ్యరామ్. తన హృదయంలో చలనం సృష్టిస్తున్నాడు దివ్యరామ్. తనేమిటో తనకి చెప్పడానికి వస్తున్నాడు దివ్యరామ్. స్వచ్ఛంగా వున్న స్ఫటికమయమైన హృదయవేదిక ఇప్పుడామెది. మనఃప్రియాసమాగమేచ్ఛతో ఆమె హృదయం ప్రేమబంధురమైంది. దివ్యరాం హృదయంలో వంద పాలసముద్రాలు పొంగేయి... వెయ్యి కోయిలలు ఒక్కసారిగా ఆలాపించేయి... అనంతంగా సితార్లు - అద్భుత రాగాలు మీటేయి... దివ్యసుందర విగ్రహుడిలా... నిండుమనసుతో పూర్ణపురుషుడిలా దివ్యరాం...

మెరుపు తీగ ధనువులా మంజూష.

ఏ ఒడ్డునో ఉన్న తనని ఫ్రెండ్లీగా తట్టి వెళ్ళిపోయి, మళ్ళీ తీరాన్ని తాకడానికొస్తున్న సాగరకెరటంలా.

దరిచేరబోయే భర్తకోసం, ఆర్తిగా మంజూష.

చెరోవైపునుంచీ ఒకరిలో ఒకరు ఒదిగిపోవాలని...

అంతే!

ఆమె తన బాహువల్లికని అతని కంఠానికి పెనవేసి, తనువంతా అల్లుకుపోతూ, అతని కళ్ళలోకి చూస్తోంది... పోగొట్టుకున్నదేదో వెతుక్కుంటున్నట్టు...

అతని నిశ్వాసంలో, ఆమె వంటిమీంచి వచ్చే మత్తైన పరిమళాలు గుబాళిస్తున్నాయి.

తన పతి అనురాగంలో, తన ప్రాణవిభుని పరిష్వంగంలో ముత్యాల జలప్రవాహమై కరిగి పరవశిస్తూ ఆమె...

అజరామర ప్రేమకు కోణార్క శిల్పి ఉలితో నిర్వచించిన మనోహర శిల్పంలా... ఆ మహాశిల్పి ఊహాచాతురికి నిదర్శనంలా...

తనవాడైన... సర్వస్వం తనవాడైన భర్త మెడచుట్టూ చేతులు వేసి, అతడి కళ్ళల్లోకి ప్రేమగా, ఆరాధనగా, తపనగా చూస్తూన్న అర్ధాంగి.

ఆమె నడుంచుట్టూ చెయ్యివేసి, తమకంతో, తృష్ణతో తనలో కలిపేసుకుంటున్న పతిదేవుడు.

అది ఆనందసంగమం...

అనురాగ సంగమం...

వేడిసెగల రెక్కలు విసిరే గ్రీష్మంలో, పరస్పర సంశయాలు ఆవిరైన తొలిజల్లు...

వసంతాన్ని వడగాలిగా మార్చేసే చైత్రంలో, చిరుజల్లు కాదది విరివాన.



# ఏరిన ముత్యాలు

★ ఒక గొప్ప గ్రంథాన్ని రాయాలంటే గొప్పవిషయం మీదనే రాయాలి. ఈగ మీద శాశ్వతమైన గొప్ప గ్రంథాన్ని ఎవరూ రాయలేరు.

— హెర్మర్ మెల్విల్

★ పుస్తకాలు లేని చక్రవర్తి ఇంట్లో జన్మించడంకన్నా, పుస్తకాలున్న పేద ఇంటిలో జన్మించడమే నాకిష్టం.

— మెకాలే

★ మేధావంతుల ఆలోచనే సాహిత్యం

-కార్లైల్

★ సాహిత్యం నగం వ్యాపారం, నగం కళ అయినప్పుడే బాగా రాణిస్తుంది.

-విలియంరాల్ఫ్ ఇంగె

★ ఎన్ని గ్రంథాలు చదివావు అనికాదు-- ఎలాంటి గ్రంథాలు చదివావన్నదే ముఖ్యం.

-- కాల్టన్

★ నీలోని మంచికి మూలం పుస్తకాలే

-- గోర్కీ

★ నీరచన మంచిచెడ్డల నిగ్గు తేల్చాలంటే నీ శత్రువులచే చదివించు. నీ మిత్రుల విమర్శ ఎప్పుడూ మంచిది కాదు. ఎందుకంటే నీ మిత్రులు కూడా నీలాగే ఆలోచిస్తారు.

— పోప్

★ తన పిల్లల్ని మెచ్చుకొనే తల్లి, తన రచనల్ని ప్రశంసించుకొనే రచయిత ఇద్దరూ సమానమే.

★ అసలు కవిత్వమంటేనే హృదయవేదన.

--గొర్రెపాటి వెంకటసుబ్బయ్య

★ పుస్తకాలు లేని ఇల్లు ఆత్మలేని శరీరంలాంటిది.

-- సిసిరో

★ ఉత్తమ గ్రంథం చింతామణివంటిది. దానిని చదవడంవల్ల చెడు ఆలోచనలు రూపుమాస్తాయి. సంశయపిశాచం పారిపోతుంది. మదిలో సద్భావం జాగ్రుతమై గొప్ప శాంతి ఏర్పడుతుంది.

-శివానంద.

సేకరణ: **నలబెల్లి శ్రీమన్నారాయణ**

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చేతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్ట్‌లోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ***ప్రతి నవలకు అందజేసే రు: 2,000/- పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.***

ఎడిటర్:

## చతుర

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.

# గతవైభవ స్మృతిచిహ్నం 'సిక్రీ'

విశిష్ట సంస్కృతీ, సంప్రదాయాలతో విలసిల్లుతున్న మనదేశం కళలకు సదా కాణాచిగానే వర్ధిల్లుతోంది. ఈ ధరిత్రి నేలిన వారంతా లలిత కళలను విశేషంగానే ఆదరించారు. మన వారి కళా హృదయాలకు సాక్ష్యంగా నిలిచిన శిల్పాలు, ఆలయాలు, ప్రాకారాలు, అసంఖ్యాకంగా ఉండి గత వైభవాన్ని చెబుతూనే ఉన్నాయి. దేదీప్యమానంగా వెలిగిన ఆనాటి కళా ప్రాభవానికి మూగ సాక్షిగా నిలిచిన ఫతేపూర్ సిక్రీ అక్బర్ హయాంలో సరికొత్త అందాల్ని సంతరించుకున్నా ఈనాడు కళలు మాసి ప్రశాంతంగా విశ్రాంతి తీసుకుంటోంది.

మొగల్ పాలకులలో మూడవ వాడైన అక్బర్ చక్రవర్తి 1556లో రాజ్యాభిషిక్తుడు కాగానే తన చిరప్రత్యర్థులైన ఆఫ్ఘనుల్ని రాజపుత్రుల్ని ఓడించాలనే దృఢసంకల్పంతో వారిపై సమరభేరి మోగించాడు. మాల్వా, చిత్తోడ్, రణథంబూర్, సూరత్, గుజరాత్, బెంగాలులు మొగల్ శక్తియుక్తులకు తలవంచాయి. ఆ రోజుల్లోనే షేక్ సలీం కిస్తీ అనే ఓ సూఫీ సంత్ ఆధ్యాత్మిక బోధనలు అక్బర్‌ని అమితంగా ప్రభావితం చేశాయి. అంతకుముందే రాజపుత్రులకు చెందిన అంబర్ రాజకుమారి 'హర్ భా'ను అక్బర్ పరిణయమాడి ఉన్నాడు. 1569లో ఆ దంపతులకు తొలి పుత్రుడు జన్మించాడు. తన సింహాసనానికి వారసుడు ఉదయించాడన్న సంబరంతో అక్బర్ ఆ పసివాడికి తన శ్రేయోభిలాషి, గురువు అయిన షేక్‌సలీం పేరును పెట్టుకున్నాడు. తనకు అనుక్షణం సలహాల్నిచ్చి, దీవెన



సిక్రీలోని లోపలి ఆవరణ



నేటికీ వేలాది సందర్శకులనాకర్షిస్తున్న పురాతన వైభవం

లందించే షేక్ సలీం కిస్తీకి తన భక్తి విశ్వాసాల స్మృతి చిహ్నంగా, కృతజ్ఞతగా సిక్రీలోని షేక్ సలీం కిస్తీ ఆశ్రమానికి సమీపంలోనే అద్భుతమైన మసీదు నిర్మించి కానుకగా సమర్పించుకున్నాడు అక్బర్. ఆ తరువాత మసీదు పరిసరాల్లో కళాఖండాలనదగిన అనేక రాజమందిరాలు, అంతఃపురాలు, దివ్యభవనాలు, మసీదులు, దర్గాలు, కార్ఖానాలు, టంకసాలలు నిర్మింపచేసి 15 సంవత్సరాలపాటు సిక్రీనే రాజధానిగా చేసుకుని రాజ్యపాలన చేశాడు.

అక్బర్ తాతగారైన బాబర్ తొలి మొగల్ చక్రవర్తి. ఆయన 1527లో సిక్రీ దగ్గర 'భాన్వా' వద్ద రాజపుత్రరాజైన రాణాసాంగాని, ఆయన బలగాల్ని చిత్తుగా ఓడించాడు. తన విజయ సూచకంగా వెంటనే అక్కడ 'బాగెఫతిపూర్' అనే పేరుతో ఓ అందమైన తోట వేయించి, అద్భుతమైన జలాశయాన్ని నిర్మింప చేశాడు. తాత జయకేతనం ఎగురవేసిన ప్రాంతంలోనే మనవడు అందమైన ప్రాకారాల్ని, రాజనగరునీ నిర్మించి రాజ్యపాలన చేయడం విశేషం.

1571లో సిక్రీలో సరికొత్త రాజనగర నిర్మాణం ప్రారంభమైంది. సంత్ షేక్‌సలీం కిస్తీ నివసించిన ఆశ్రమం ఖాన్‌ఖాహ్‌కి చేరువలోనే అతి పెద్దదైన జామిమసీదుతో పుర నిర్మాణం శ్రీకారం చుట్టుకుంది. అక్బర్ రసికతకు కళలపైగల ఆసక్తికి ప్రతిరూపంలా ఆనాటి శిల్పులు అపూర్వమైన తమ ప్రతిభా సంపన్నతతో అక్బర్ నివాస భవనాలు, మొదలైన ఎన్నో కట్టడాలను అత్యంత మనోహరంగా నిర్మించారు.

సిక్రీనగరంలోకి దారితీసే తొమ్మిది ప్రవేశ ద్వారాల్లో ఒకటైన ఆగ్రా సింహద్వారంగుండా లోపలికి వెళ్లగానే ముందుగా 'దివానెఆమ్' కనిపిస్తుంది. ఈ రాజదర్బారులోనే అక్బరు ప్రజల విన్నపాలు, ఫిర్యాదులు విని న్యాయ విచారణలు చేసేవాడు. ఇక్కడే మనోరంజనం కోసం నృత్య, సంగీత కార్యక్రమాలు నిర్వహింపబడేవి. దీర్ఘ చతురస్రాకారంలో ఉన్న అతి విశాలమైన ఈ భవనంలోనే దేశ విదేశీ ప్రముఖులకీ, రాయబారులకీ, అతిథులకీ స్వా



దర్గానుండి కనిపించే జామిమసీదు

గతాలు లభించేవి. సభామంటపంలోనేగాక అనేక గదులలో, పశ్చిమ దిశకు అభిముఖంగా ఉన్న బాల్కనీలలో లేసు డిజైన్లతో నిర్మించిన గవాక్షాలు పుష్కలమైన గాలి, వెలుతురులను అందించేవి. రాజదర్బారు ఒక మూలన రాతి కొక్కెం ఇప్పటికీ నేలపై కనిపిస్తుంది. ఇక్కడ భూమిలోకి పాతిన రాతి స్థంభానికి అక్బర్



వెయ్యి దంతపుకోరలు గుచ్చి అలంకరించిన హిరన్ మినార్

పెంపుడు జంతువైన 'హరన్' అనే ఓ గజరాజుని కట్టి ఉంచేవారు. న్యాయ విచారణలో దోషిగా పరిగణించిన నేరస్తుని ఈ ఏనుగు పాదాల కిందికి నెట్టేసే వారు. అది తొక్కి, నలిపి చంపేసేది. తన కాళ్లకిందికి తోయబడ్డ దోషిని ఏనుగు తొక్కడానికి, చంపడానికి మూడుసార్లు నిరాకరిస్తే నేరస్తుని వదిలిపెట్టేవారు.

దివానెఆమ్‌కి వెనుకవైపున రాజవంశీయుల నివాస భవనాలున్నాయి. ఉత్తర దిశలో మూలవైపు చిన్నదైనా అపూర్వంగా మలచిన 'దివానెఖాస్' ఉంది. ఈ హాల్లో అరుదైన శిల్ప సంపద, చిత్రవిచిత్రమైన డిజైన్లను రూపొందించిన గోడలు కనిపిస్తాయి. దీనికి నలువైపుల ఉన్న ద్వారాలకు బలమైన ఆధారంగా నిలబడిన 36 వృత్తాకార తోరణాలు బ్రాకెట్లలా కనిపిస్తాయి. ఇక్కడి 'ఇబాదత్‌ఖానా'లో సర్వమత సహనానికి ప్రతీకగా హిందూ, ముస్లిం, జైన, క్రైస్తవ మతాల పవిత్ర గ్రంథాలను, మత బోధనలను, అమూల్య సందేశాలను వినిపించేవారు. ఇక్కడికి సమీపంలోనే ఆభరణాల మందిరం ఉంది. దీనికి బ్రాకెట్ల ఆకృతిలో డిజైన్లుండి, గోడలపై, సజ్జాలపై రకరకాల నగల ఆకారాలు చిత్రించారు. దివానెఖాస్‌కి సమీపంలో మూడు గదులున్న 'ఆంఖ్‌మిచోలి' ఉంది. ఇందులో చక్రవర్తి తన స్త్రీ జనంతో దాగుడుమూతలు ఆడుకునేవాడు. ఇది రాజకోశాగారం అని కూడా కొందరు భావిస్తారు. దీనికి అడుగడుగునా ద్వారబంధాలుండి వింతశోభను సంతరించి పెట్టాయి. కొన్ని తోరణాలు దిల్వారా మందిర తోరణాల్ని పోలి ఉన్నాయి. ఇక్కడ రాజపురోహితుడైన జ్యోతిష్యుడు కూర్చునేవాడంటారు. ఈ రెండు భవనాలు ఖచ్చితంగా ఎందుకు ఉపయోగించేవారో తెలియక చరిత్రకారులు, సందర్శకులు ఇందు కోసం నిర్మించి వుంటారు అని ఊహాగానాలు చేసి తామే నిర్ధారిస్తుంటారు.

రాజదర్బారుకి పశ్చిమదిశలో పంచ్‌మహల్ అనే ఓ అయిదంతస్థుల మంటపం ఉంది. దీనినే బద్గీర్ అని కూడా అంటారు. రాణివాసపు అంతఃపుర స్త్రీలు వ్యాహ్యాళికి బయటికి వెళ్లరు కాబట్టి చల్లని గాలికోసం దీనిని నిర్మించి ఉంటారని పరిశీలకులు అభిప్రాయపడుతుంటారు. ఇక్కడి గోడలకి 176 రకాల డిజైన్లతో కూడిన పెద్దపెద్ద రంధ్రాలతో వలలవంటి గోడగవాక్షాలు స్థంభాలను కలుపుతూ ఉండేవి. ప్రస్తుతం ఇవి శిథిలమైపోయాయి. ఆ రోజుల్లో ఈ వలల గోడలే రాణులకీ, రాకుమార్తెలకూ పరదాల్లా పనిచేసేవి. వాళ్లు మేడపైభాగాన కూర్చుని, లేదా విహరిస్తూ శీతల పవనాల్ని ఆస్వాదించేవారు. ఈ వలల గవాక్షాల నుండే సిక్రీ పురశోభల్ని తిలకించేవారు. ఇక్కడి సభాస్థలిలోనే అక్బర్ నర్తకులను పావులుగా చేసి పచ్చీసు ఆడేవాడు. ఈ



సరసనే ఉన్న సరస్సులో షేక్ సలీంకిస్తీ దర్గా ప్రతిబింబిస్తున్న వైనం

ప్రాంతానికే దక్షిణ దిశలో చివరివైపు అనూప్ తలాబ్ ఉంది. ఇక్కడే అక్బర్ ఆస్థాన గాయకుడు తాన్‌సేన్ కూర్చునేవాడు.

1575లో ఈ అనూప్ తలాబ్‌ని 12 అడుగుల లోతు వరకు తవ్వి కట్టించారు. ఓ శతాబ్దం కిందట ఇప్పుడున్నస్థాయికి పూడ్చించారు. నీళ్లులేని ఈ జలాశయం నిండుగా అక్బర్ బంగారు, వెండి, రాగి నాణాలతో నింపేవాడు. పండుగలు, ప్రత్యేక ఉత్సవాలు రాగానే బీదాబిక్కికి వీటిని పంచి పెట్టేవాడు. జలాశయానికి దక్షిణ దిశవైపు అక్బర్ నివాస భవనాలున్నాయి. ఇవి భిన్నభిన్న ఆకృ



దర్గా పోర్టికోపై ఉన్న సర్పాకృతి



రంధ్రాల గోడలే తెరలుగా...

తులతో నిర్మించబడి మొగల్ చక్రవర్తి రాజసాన్ని ప్రతిబింబిస్తున్నాయి. రాతి చెక్కడాలు అత్యంత మనోహరంగా ఉండి కనువిందు చేస్తాయి. పక్షులు, జంతువులు, బొమ్మలు, లతలు, పువ్వులు శాఖోపశాఖలుగా విస్తరించిన దృశ్యాలు అద్భుతంగా శిల్పీకరించారు. ఎత్తైన రాతి అరుగులు, కిరీటాల ఆకృతితో తయారు చేసిన బురుజులు, విలువైన రాతప్రతులు దాచేందుకు సరిపోయే గూళ్లు అందులోని కొన్ని ప్రత్యేకతలు. ప్రజలకు ఉదయమే ఒక చిన్న కిటికీ ద్వారా 'ఝరోకాదర్శనం' ఇచ్చేవాడు అక్బర్. 1585లో చేసిన చిన్నచిన్న పునర్నిర్మాణాల వల్ల ఎన్నో డిజైన్లు దెబ్బతిన్నాయి.

రాజాంతఃపురంలో అక్బర్‌కి దాదాపు ఐదు వేలమంది భార్యలున్నట్లు ప్రఖ్యాత చరిత్రకారుడు అబుల్‌ఫజల్ వల్ల తెలుస్తోంది. బ్లోచ్‌మన్ అనే మరో చరిత్రకారుడు అక్బర్‌కి ఏడుగురే భార్యలున్నట్లు తెలుపగా, బెవెరిడ్జ్ మూడు వందలమంది ఉండేవారని నిర్ధారించాడు. రాణులు తమ పుట్టింటినుండి అధిక సంఖ్యలో దాసదాసీల్ని నర్తకుల్ని వెంట తెచ్చుకునేవారు. రాకుమార్తెలకు కూడా లెక్కలేనంత దాసీగణం ఉండేది. సభాభవనంలో ప్రభుత్వోద్యోగుల కుటుంబాలు, రాజుగారి ఉంపుడుగత్తెలు, నర్తకీగణం మొదలైన వారందరికీ విడివిడిగా విడుదులు, వసతులు కల్పించేవాడు రాజు. స్త్రీల అంతఃపురాల్ని 'హరేంసారా' అనేవారు. సిక్రీలో అత్యధిక స్థలాన్ని హరేంసారాలే ఆక్రమించుకున్నాయి.

'జోధ్‌బాయి భవనం'లో అంబర్ రాకుమార్తె, జహంగీరు తల్లి అయిన హర్‌ఖాతోపాటు బికనీర్, మార్వాడ్, జైసల్మేర్, మేడతా, దుంగార్‌పూర్‌ల రాకుమార్తెలైన అక్బర్ ఇతర పత్నులు కూడా నివసించేవారు. జోధ్‌బాయి అనే పేరుగల మహిళెవరూ అక్బర్ భార్యల్లో లేకపోయినా ఆ బంగళాకి జోధ్‌బాయి బంగళా అనే పేరు వచ్చింది. ఇది రెండంతస్థులున్న అతిపెద్ద భవనం. ఈ భవనంనుండి రాజదర్బారులోకి కూడా మార్గముంది. ఎత్తైన గోడలు, సమున్నతమైన మండపాలతో హైందవ సాంప్రదాయానికి దర్పణంపడుతున్న ఈ భవనం అత్యంత ఆకర్షణీయంగా, సిరులుట్టిపడుతూ ఉండేది. నాలుగువైపులా తోరణ స్థంభాలు, కళాత్మకంగా తీర్చిన గోడలు, ద్వారబంధాలు, దేవతా ప్రతిమల్ని పెట్టుకోడానికి కేటాయించిన చిన్నగుడులు, రాజపుత్ర స్త్రీల ఆరాధ్యదైవాల ప్రతిమలు, జేగంటలు, తులసికోటలు ఏర్పాటుచేశాడు అక్బర్.

జోధ్‌బాయి భవనం తరువాత మరొక అద్భుత భవనం అక్బర్ తల్లి, హుమాయూన్ భార్య అయిన హమీదాబాను బేగం నివాసం. అంతఃపురంలోని వారందరికీ ఆమెపట్ల ఎన లేని భయభక్తులుండేవి. ఎంతో వినయంతో 'మరియంమకాని' అని ఆమెను గౌరవించేవా రు. ఆమె నివాసభవనపు గోడలకు బంగారుతా పడం చేయించినందున ఆమె భవంతిని 'సునేహరామకాన్' అనగా 'స్వర్ణగృహం' అనే వారు.

ఈ రెండు భవనాల తరువాత దర్శించద గిన మూడవ భవనం అక్బర్ భార్యలైన రుక య్యా సుల్తానాబేగం మరియు సలిమా సుల్తాన్ బేగంల నివాసగృహం. భైరంఖాన్ మృత్యువా తపడగా అతని భార్య సలియాసుల్తాన్‌బే

బీర్బల్ నివాసభవనానికి సమీపంలో ఓ సరస్సు ఉండేది. దీనికి దగ్గర్లో హాథీపోల్ అనే ప్రాకారం ఉండేది. ఈ ప్రాకారానికి ఇరువైపులా రెండు ఏనుగుల విగ్రహాలు ఉండేవి. అక్బర్ సిక్రీని వదిలివెళ్ళాక కొందరు ఈ ఏనుగుల్ని ధ్వంసంచేశారు. అక్బర్ తన పెంపుడు విగ్ర హాల జ్ఞాపకార్థం 'హిరన్ మినార్' అనే పెద్ద స్థంభాన్ని కట్టించి దానికి వెయ్యి దంతపు కోరలు గుచ్చి అలంకరింపచేశాడు. దీని సమీ పంలోని బావి నీటి అవసరాల్ని తీర్చేది. మసీ దుకు వెళ్ళేదారిలో అబుల్‌ఫజల్, అతని సోద రుడు, కవి అయిన ఫైజీలు నివసించిన భవనం ఉంది.

1571లో సిక్రీలో మొట్టమొదట జరిగిన మసీదు నిర్మాణం సమర్‌ఖండ్‌లోని బీబీ



టర్కిష్ సుల్తానా పాలెస్ వద్ద ఫలకంపై అద్భుతంగా చెక్కిన లతలు, పూలడిజైను

గంను అక్బర్ పునర్వివాహం చేసుకున్నాడు. బీర్బల్ కుమార్తె కూడా అక్బర్‌ని వివాహమాడి ఈ భవనంలో నివాసం ఉండేది. ఈ భవనంలో కి పురుషులకి ప్రవేశం నిషిద్ధం. చివరికి అక్బర్ అంతరంగిక మిత్రుడైన బీర్బల్‌కి కూడా ఇందులోకి ప్రవేశంలేదు. రెండంతస్థుల ఈ భవనం అద్భుతమైన శోభలతో అలరా రింది. ఈ భవనాలన్నీ వసారాలోని మార్గం ద్వారానో, మరో ద్వారం గుండానో కలి సిఉండేవి. పంచమహల్‌కీ, బీర్బల్ నివాసానికీ మధ్యగల చిన్న పూదోటలోనుండి వెళ్ళిరాగల రహదారి ఉండేది.

ఖానం మసీదును పోలిఉంది. 1611లో విలి యంఫించ్ బీబీఖానం మసీదును తూర్పుటీ రాల అద్భుత కళాకేంద్రంగా అభివర్ణించాడు. సిక్రీలోని మసీదు బయట ఆడంబర రహితంగానే కనిపించినా అంతర్భాగం చిత్ర వైచిత్ర్యాల తోరణాలతో, పుష్పాకృతులతో, వక్ర, వృత్తాకార రేఖలతో ఉంటుంది. ఎరుపు, నలుపు, తెలుపు, గోధుమ వర్ణాలు పైకప్పునీ, గోడలనీ, స్థంభాలనీ, ద్వారబంధాలనీ అలంక రించి, దర్శకులకి కనువిందుచేస్తాయి.

విశాలంగా ఉన్న మసీదు ప్రాంగణంలో ఒకేసారి పదివేలమంది కూర్చుని 'నమాజు' సామూహికంగా చేసుకోవచ్చు. ఈ మసీదును అక్బర్ ఎంతో అపురూపంగా చూసేవాడు. భక్తి శ్రద్ధలతో అప్పుడప్పుడు తనే స్వయంగా నేల





తుడిచేవాడు. తనే అజా ఇచ్చేవాడు. 'అజా' అంటే ప్రార్ధనకి రమ్మని ప్రజల్ని పిలవటం. 1579 జూన్ 26న స్వయంగా 'ఖుద్బా' చదివాడు. ఖుద్బా అంటే ప్రతి శుక్రవారం నమాజుకి ముందుగా ఖురాన్‌లోని బోధనల్ని చదివి అర్థం విప్పి అక్కడున్నవారికి చెప్పడం. ఇదొక గొప్ప చారిత్రిక విశేషంగా చెబుతారు. గతంలో ఇలా ఇద్దరే ఇద్దరు తైమూర్, మిర్జాఉలుగ్‌బేగ్‌లు మాత్రం ఖుద్బా చదివారట.

1585లో అక్బర్ లాహోర్‌కి వెళ్ళిపోయిన తరువాత ఫతేపూర్ సిక్రీ కళాకాంతుల్ని వైభవాన్ని కోల్పోయింది. క్రమంగా రెండు మిలియన్ల జనాభా తగ్గిపోయింది. రాజకుటుంబీకులు, ఉన్నతోద్యోగులు ఎందరో సిక్రీని వదిలి వెళ్ళిపోయినా కిస్తీ దర్గా మాత్రం ఎప్పుడూ భక్తుల రాకపోకలతో నిండుగా వుండేది. హిందూ, ముస్లిం తేడాల్లేకుండా అందరూ షేక్ సలీంకిస్తీ దర్గాను సందర్శించేవారు. 1572లో షేక్ సలీంకిస్తీ అస్తమించగా ఎనిమిదేళ్ళ అనంతరం 1580-81ల్లో అక్బర్ ఎర్రరాయితో ఒక సమాధి గోపురాన్ని నిర్మించాడు. 1606లో జహంగీరు ఈ ఎర్రరాయిపై తెల్లని చలువరాతిని కప్పించాడు. ఇందులో గోడలకు ఆధారంకోసం కట్టిన సజ్జాలకు సర్పాకృతిలో కట్టిన తోరణాలు అత్యంత రమణీయంగా ఉన్నాయి. వలలవంటి డిజైన్లతో, రంధ్రాలతో కట్టిన గోడలు కళాత్మకంగా కనిపిస్తాయి. ఈ దర్గాకి సంతానంకోరి వచ్చిన స్త్రీలు ఈ వలల రంధ్రాల గోడలకు రంగుదారాలు కట్టి వెళ్తారు. తమ ఈప్సితం నెరవేరాక కృతజ్ఞతా సూచకంగా మళ్ళీ ఇక్కడికి వచ్చి వెళ్తుంటారు.

షేక్‌సలీంకిస్తీ మరణం గురించిన ఆసక్తికరమైన కథనం ఒకటి ప్రచారంలో ఉంది. ఒక సందర్భంలో యథాలాపంగా చక్రవర్తి షేక్ సలీం కిస్తీతో, "తమ మరణం ఎప్పుడు, ఎలా సంభవిస్తుంది" అని అడిగాడు. "రాజకుమారుడు సలీం నేనుగాక మరెవరైనా నేర్పిన పద్యమో, శ్లోకమో కంఠస్థం చేసి నేర్చుకున్నప్పుడు" అని బదులు పలికాడు షేక్ సలీం కిస్తీ. ఈ విషయం తెలియని అంతఃపుర దాసి కొన్నాళ్ళతర్వాత రాజకుమారుని "ఓ భగవంతుడా! ఆశ అనే మొగ్గను వికసింపచేయి" అనే అర్థమిచ్చే పద్యాన్ని నేర్పించింది. రాజకుమారుడు సలీం దీనిని కంఠస్థం చేసి సంత్ షేక్ సలీం కిస్తీకి వినిపించాడు. తనకు చివరి ఘడియలు సమీపించాయని తెలుసుకున్నాడు షేక్ సలీం కిస్తీ. ఆ తర్వాత కొద్దిరోజులకే ఆయన మరణం సంభవించింది.



జామిమసీదు

షేక్‌సలీం సమాధికి దగ్గర్లోనే 'జనానా రౌదా' ఉంది. ఇక్కడే రాజకుమారులు సలీం, దనియాల్, మురాద్‌లకి విద్యాబోధన చేసేవాడు కిస్తీ. దీనికి సమీపంలో 'జమాత్‌ఖానా' ఉంది. ఇందులో కిస్తీ శిష్యులు నివసించేవారు. కిస్తీ ఆధ్వర్యంలో భగవద్భక్తి గీతాలు పాడుతూ ప్రార్థనలు జరిగేవి. మృదుమధురమైన, స్వర రాగభావ సమ్మేళనమైన ఆ భజన కార్యక్రమాన్ని 'సామా' అనేవారు. దీనికి చక్రవర్తి, ఆయన



షేక్ సలీంకిస్తీ దర్గా ద్వారం దగ్గర సందర్శకులు

స్త్రీగణం కూడా హాజరయ్యేవారు. సభా మంటపం దక్షిణ గోడవైపు, 1575లో నేలపై నుండి కొలిస్తే 176 అడుగుల ఎత్తున్న గోపురం 'బులంద్ దర్వాజా'ను నిర్మించారు. అక్బర్ గుజరాత్‌పై గెలుపు సాధించిన సందర్భంలో విజయానికి చిహ్నంగా దీనిని కట్టారు. దానిపై అందమైన అక్షరాలతో "ప్రపంచం ఓ వారధి వంటిది. దీనిపై నుండి దాటివెళ్ళండి. కాని ఇళ్ళు కట్టకండి" అని రాశారు. బులంద్ దర్వాజా గోపురంపై నిల్చుంటే కొన్ని మైళ్ళదూరంవరకు ప్రకృతి అందాలు కనిపిస్తాయి. దీనికి పశ్చిమ దిశలోగల జలాశయం ప్రస్తుతం 'ప్రజాస్నానశాల'గా ఉపయోగపడుతోంది. ఓ చిన్న బహుమానంకోసం వందాలేసుకుని అపాయమని తెలిసి కూడా యువకులు పైనుండి ఈ నీళ్ళలోకి దుముకుతారు. మసీదుకి ఒక వైపు 'రంగమహల్' ఉంది. ఇక్కడే రాజకుమారుడు సలీం జన్మించాడు. మసీదులోకి మారక పూర్వం కిస్తీ నివసించిన ఆశ్రమ ప్రాంతాన్ని సందర్శకులు ఇప్పటికీ వెళ్ళి దర్శిస్తుంటారు. ఆయన ప్రార్థనలు, నమాజు చేసుకున్న స్థలంలోనే ఆయన సమాధిని కట్టారు.

1585లో సిక్రీని వదిలి లాహోర్‌కి వెళ్ళిన అక్బర్ తిరిగి 1596లో తిరిగి వచ్చినా సిక్రీకి రాకుండా ఆగ్రాలో నివాసమేర్పరుచుకున్నాడు. నీటి సరఫరా చాలినంత లేనందువల్లే సిక్రీని వదిలేశాడని కొందరు భావిస్తారు.కానీ సిక్రీలో తన అభిమాన ఆధ్యాత్మ గురువైన సంత్ షేక్ సలీంకిస్తీ తనువు చాలించాక చక్రవర్తికి ఒంటరితనం నిస్తబ్దత ఆవహించి ఉంటుందనీ, అందుకే సిక్రీకి ఆయన తిరిగి రాలేదని చరిత్రకారుల అభిప్రాయం. ఆ తరువాత ఇక్కడ విరోధుల్ని యుద్ధాల్లో పట్టుబడ్డ పర్షియన్లు, రాజపుత్రులు మొదలైన శత్రుసైనికుల్ని బంధించేవారు. తరువాతి కాలంలో పాలనలోకి వచ్చిన జహంగీరు, షాజహాను చక్రవర్తులు ప్రత్యేక సందర్భాల్లో సిక్రీని సందర్శించినా... ... ఒకప్పుడు రాజాదరణను, అపూర్వమైన ప్రాభవాన్ని పొందిన సిక్రీ నగరం ప్రస్తుతం గతకాలపు స్మృతి చిహ్నంగా మిగిలి ఉంది.

-జ్యోతిరాణి

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

